# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# కథలు

## 2

రెండవ సంపుటం



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Sripada Subrahmanyasastri Kathalu - Vol-II

ప్రచురణ నెం. : 2151

వి.పి.హెచ్.
ప్రథమ ముద్రణ : నవంబరు, 1992

ద్వితీయ ముద్రణ : జూలై, 1999



వెల: రూ. 100-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాదు-500 029

# 'అత్తరు' శాస్త్రిగారు

తెలుగు కథావనంలో విరబూసిన దివ్య పారిజాతం సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీపాదం! పదాలలో అన్నమయ్యా, పద్యాలలో వేమనలకు వలెనే కథలలో అచ్చతెనుగుతనం ఆఘ్రాణించాలి అంటే శ్రీ పాదవారే శరణ్యం. వారి కథలకు వారే నిర్వచనం, వారే కొలమానమున్నూ ... గోదావరికీ కోనసీమకూ కూడా అంతే కదా!

'నాకో మంచి నవల చదవాలనిపించినప్పుడెల్లా నేనో నవల రాసుకుంటాను' అన్నాట్ట బెంజమిన్ డిజ్రాలీ ... బహుశ శాస్త్రిగారూ అలాగే రాసి వుండాలి తమ కథల్ని.

కథలంటే ఏమిటో, వాటి పరమార్థం ఏమిటో ఈ సంపుటిలో కాపురం చేస్తున్న, వారి కథాదీపం 'మార్గదర్శి' అన్న దాన్లో ఆయనే వివరంగానే చెప్పారు.

"కథలంటే పైపైని వున్నాయనుకున్నావేమో! అవి కల్పించడానికి చాలా గొప్ప ప్రతిభ వుండాలి. వాటి విలవ తెలుసుకోడానికెంతో పరిజ్ఞానం వుండాలి. అవి చెప్పడానికి ఎంతో నేర్పుండాలి ... కథలు కళ్ళకు వెలుగిస్తాయి. బుద్ధికి పదును పెడతాయి. మనస్సుకి ఉత్సాహమూ ఉల్లాసమూ కల్గిస్తాయి. జడునకున్నూ కల్పనాశక్తి ప్రతిపాదిస్తాయి."

కల్పనా ప్రతిభ, విశిష్టమైన పరిజ్ఞానం, కథన కౌశలం – ఇవి పుష్కలంగా పండిన మాగాణి వారి కథలసీమ. వారి కథ దేనిని తీసుకున్నా వెలుగు, పదును, ఉత్సాహం, ఉల్లాసం పరిత సంస్కార వైశాల్యాన్ని బట్టి పసిఫిక్ మహాసముద్రమంతగా లభిస్తాయి.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి మాటలలో చెప్పాలంటే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి "ఆంగ్లము కాని వంగము కాని మఱియొక వాఙ్మయముకాని మర్యాదకైనను చదివి చూచినవారు కారు. విశేషించి 'హిందీ'ని చేరదీయరాదని వారి వాదము –" శ్రీపాద వారిలోని ఈ అంశ ఆయనకే చేతనయిన వ్యంగ్య వైభవమంతా సంతరించుకుని 'శుభికే శిర ఆరోహ' అన్న ఈ సంపుటిలోని కథనిండా పరుచుకుని వుంది. ఈ క్రింది సంభాషణ చిత్తగించండి:

"ఉత్తరదేశం రాతలో రమా అనే వుంటుంది; కాని పలుకుబడి రొమా అని."

"ఉన్నది ఉన్నట్టే పలికితే యేం?"

"పనికిరాదు, సంస్కృత భాషా సంప్రదాయ ప్రకారం 'రొమా' అనే పలకాలి. మనవాళ్ళకి హ్రస్వాకారం యెలా పలకాలో తెలియదు."

"అయ్యో ... అయితే అఆలు ఎలా పలకాలంటావోయ్?"

"ఓ ఆ అని!"

(ఇదంతా విని మూడో పాత్రయిన అన్నపూర్ణ అంటుంది) "మరి అంత తెలిసినవాడు కదా ఒ అ అని, అంటాడేమిటి బావ, నాన్నారూ? 'ఒఅ ఒని ఒనాలి' కాదండీ!"

1891–1961 సంవత్సరాలమధ్య జీవించిన ఈ కథక చక్రవర్తి. అనాటి సమాజంలో వెల్లువెత్తిన అనేకానేక మార్పుల ఉప్పెనలను చదివి, వాటి దిశనూ సారాంశాన్ని గ్రహించి, తన కథలలో ఎంతో పోడిమితో పోషించారు.

తల్లితండ్రులు–పిల్లలు, సంప్రదాయం – ఆధునికత, కులము–గుణము, పెళ్ళి–ప్రేమ, బానిసత్వం– స్వాతంత్ర్యంలాంటి ద్వంద్వాలన్నిటిలోనూ ఆయన అటు కన్నా ఇటే మొగ్గి, తాను ఇరవయ్యవ శతాబ్దంవాడినని మాత్రమేకాదు, ఇరవయ్యొకటవ శతాబ్దానికి కూడా స్నేహితుడినేనని నిరూపించారు. ఇది చాలా హర్షణీయమైన అంశమే; కాని శ్రీపాద వారిలో, ఆధునికతలోని అపస్వరాలను పసిగట్టి ప్రక్కకు పెట్టగల తెంపరితనమూ వుంది. అందులోనే ఆయన పరిపక్వత, పరిపూర్ణత ద్యోతకమవుతాయి. ఈ క్రింది వాక్యాలు గమనించండి:

"అడుక్కుతింటూ చెట్టుకింద కాలం గడిపే వాళ్ళని దరిద్రులంటుంది మన సంఘం. ఇది అర్థంలేనిమాట. వాళ్ళకి కావలసినంత శక్తి వుంది; కాని దానికి వినియోగంలేదు అంతే. అలా లేకపోవడానికి సన్నికృష్ట కారణం; వాళ్ళకి సిగ్గు బిడియమూ లేకపోవడం విప్రకృష్ట కారణం; మన ఆధ్యాత్మిక దృష్టి ... ఆధ్యాత్మిక దృష్టి యెప్పు డేర్పడ్డదో అప్పుడే మన పతనం ప్రారంభం అయింది. మనకు దాస్యం బలపడినకొద్దీ ఆధ్యాత్మిక చింత పెరిగిపోయింది" అంటూ నిశితంగా మన ఆధ్యాత్మిక దృష్టిని తూర్పారబట్టిన కలమే –

"వేదాలకాలంనుంచీ మనదేశంలో పట్నాలే కాదు నగరాలూ వుండినాయి. అప్పుడు కూడా మన పట్నాలకూ, నగరాలకూ వుండిన ఆకర్షణ గౌరవమూ పల్లెలకు లేశమూ లేదు. అలా అని అప్పుడెవరూ పల్లెలను నిరసించనూలేదు. నగరాలనూ దుమ్మెత్తి పోయ్యనూలేదు ... మనం మహోన్నత నాగరికత అనుభవించిన దినాల్లో పాశ్చాత్యులు ఇప్పుడు మనం వుండిన స్థితికంటే అధ్వాన్న స్థితిలో వుండినారు –"

అని అనాటి మేలి అంశాలనూ ఎత్తి చూపగల్గింది.

ఇంకొక వాక్యం చూడండి:

"మనిషివల్ల వర్తకం పాడవుతోంది గాని; వర్తకం వల్ల మనిషి యెన్నడూ పాడయిపోడు –" అన్న కీలక వాక్యం నేటి అమెరికా ధోరణి నుండి భారత్ లోని బ్యాంక్‌ల–స్టాక్ విపణుల భాగోతాలదాక వున్న వికారాలకు అర్థం చెప్పడం లేదూ?

అందుకే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి తెలుగు వేళ్ళున్న ప్రపంచస్థాయి రచయితగా కనిపిస్తాడు.

శాస్త్రిగారు చేయి తిరిగిన నాటక రచయిత. అందువల్లనే ఆయన కథలలో కూడా నాటక రచయితకుండవలసిన దృష్టి నైశిత్యమూ, వర్ణనా వైశాల్యమూ, పాత్ర చిత్రణము, సంభాషణా వైదగ్ధ్యమూ ప్రతి పంక్తిలోనూ సాక్షాత్కరిస్తాయి. అది అవిడ వాళ్ళాయనవైపు చూచిన చూపే కానివ్వండి – అడపడుచు నోట

నుండి కురిసిన నిప్పుల వానే కానివ్వండి – దివాన్జీగారి గీర్వాణమే కానివ్వండి – ఒక దాత నిర్లక్ష్యం పరికింపుగా, పరికింపు పలకరింపుగా, పలకరింపు సానుభూతిగా, సానుభూతి శ్రద్ధగా, శ్రద్ధ స్నేహంగా, స్నేహం బంధంగా అంచెలంచెలుగా మెట్లెక్కి మనం అలా చదువుతుండగా మాట వర్ణనయి, వర్ణన జీవమయి, జీవం వ్యక్తి అయి, ఆ వ్యక్తి నువ్వయి నేనయి – మనం కథను చదివే పాఠకులమూ, లేక అందులోని పాత్రలమూ అన్పించేంత ఆత్మీయుల చిరపుంజీలూ, చిరంజీవులూ ఆయన కథలు.

కథను చెక్కడంలో శ్రీపాద వారొక మహాశిల్పి; నేపథ్య నిర్మాణంలో శాస్త్రిగారొక చిత్రకారుడు; వర్ణనల విషయంలో ఎక్స్‌రే కలం ఆయనది. రెండో మూడో పాత్రలను తీసుకుని చాలా అమాయకంగా కథనెత్తుకొని క్లిష్టమైన సన్నివేశాల్లోకి మన గుండెల్ని పట్టుకుని లాక్కువెళ్ళి శతఘ్నులు పేల్చగల ఫీల్డ్‌మార్షల్ ఆయన.

ఈ సంపుటిలోని – 'వడ్లగింజలు' లక్ష్మీ సరస్వతుల మధ్య జరిగిన చదరంగం; స్నేహ కరచాలనంతో ముగిసిన ఉజ్జ్వల కథనవిలాసం.

'శుభికే! శిర ఆరోహ', 'కన్యాకాలే యత్నా ద్వరితా' – శాస్త్రిగారికి వల్లమాలిన ప్రీతిగల సంసార ప్రేమ కథాక్షేత్రంలోని భామాకలాపాలు.

'మార్గదర్శి' – అన్ని భాషలలోకి అనువదించి మెట్రిక్ పాసయిన ప్రతి వారికి ఉచితంగా పంచిపెట్టవలసిన స్నాతకోత్సవ రచన. దానితోబాటే అందించవలసిన సులోచనాల వంటి కథ 'తాపీమేస్త్రి రామదీక్షితులు బి.ఏ.'

ఇక మిగిలిందల్లా షకూరల్లీఖాను అంటే సాక్షాత్తూ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారే! అత్తరు సౌరభం కంపుగా వెలవరించుకున్న దివాంజీలు మనమే, తెలుగు పాఠకులమే! ఇప్పటికీ గుబాళిస్తూన్న 'గులాబీ అత్తరు' సీసాలా..?

చెప్పుకోండి చూద్దాం!

26 అక్టోబరు '92
భాగ్యనగరం.

వాకాటి పాండురంగరావు

* * *

## కథా క్రమంబెట్టిదనిన...

# వడ్లగింజలు

"రాజద్వారే, రాజగృహే సర్వదా దిగ్విజయోస్తు. వేదోక్తం పరిపూర్ణమా –"

మెల్లిగా అడుగువేస్తూ, ద్వారంలోనుంచే యిలాగ ఆశీర్వచనం ప్రారంభించాడు తంగిరాల శంకరప్ప; కాని, దివాన్జీ కెదురుగానూ గుమ్మానికొక పక్కగానూ నుంచునివున్న రాణేదారు, మాట సగంలోనే గభీమనీ అడ్డంవచ్చి "ఫో ఫో – మళ్ళీ యిక్కడికి వచ్చావూ?" అంటూ గుండెలమీద చెయ్యివేసి అతణ్ణి ఆపుచేసి "ఏయ్, యెవరోయ్ జవాన్లూ?" అని ద్వారంకేసి చూస్తూ కరుగ్గా పిలిచాడు.

"చిత్తం బాబయ్యా, మేమడ్డుపెడుతూనే వుండగా, జలగలాగ జారి లోపలికి వచ్చేస్తున్నారండి" అంటూ యిద్దరు జవాన్లు వచ్చి శంకరప్పకి రెండువైపులా నుంచున్నారు.

"చాల్చాలు, దయచెయ్యండి, దయచెయ్యండి" అంటూ మరో జవాను వెనకపాటుగా వచ్చి, వీపుమీద వేళ్ళాడుతూవున్న అంగావ్రస్త్రపు కొంగులు పట్టుకున్నాడు

"దివాన్జీగా రుండగా మధ్య మీరు – ఎవరయ్యా?" అంటూ శంకరప్ప విడిపించుకోపోయాడు. జవాను పట్టుకి అంగావ్రస్త్రం చిరిగిపోతుందా అన్నంత బింకంగా కూడా ముందుకి రాబోయాడు కాని, "చాల్చాలు, వూరుకో యీపాటికి, దరిద్రపు అంగావ్రస్త్రం గుడ్డా నువ్వూ – యింకా చూస్తావేమోయ్?" అని అతగాణ్ణి జవాన్ల మీదికి గెంటేశాడు రాణేదారు.

"నీ మూలాన మాక్కూడా మాట వస్తోంది, మంచివాడవే, రారావయ్యా" అంటూ జవాన్లు శంకరప్ప రెక్కలు పట్టుకున్నారు.

"నేను డబ్బుకోసం రాలేదు" అని శంకరప్ప మళ్ళీ యేదో చెప్పబోయాడు; కాని "డబ్బుక్కాలేకపోతే మరి యీ వేషాలన్నీ యేమిటి? వీధిలోకి పడగెంటక, యింకా చూస్తారేమిటోయ్?" అని రాణేదారు జవాన్లమీద కళ్ళెర్రచేశాడు.

రాణేదారు తొందరపెట్టడమూ, సర్వాధికారి అయిన దివాన్జీ యిదేమీ గమనించక పోవడమూ – దీంతో జవాన్లకి చాలా దిలాసా వచ్చింది. వెంటనే వాళ్ళు పొదివి పట్టుకుని, శంకరప్పని వీధిలోకి లాక్కుపోయారు.

అయినా లోపలికి రావాలని శంకరప్ప గింజుకోడం మానలేదు. వెర్రి ఆవేశంతో అత నొక్కొక్క వూపు వూపినప్పుడు, పట్టుకోలేక, జవాన్లు ముందుకీ వెనక్కీ వొక్కొక్క వూపు వూగిపోసాగారు.

ఇదంతా తెలుసుకోడాని కప్పటికి తెరిపయింది దివాన్జీకి.

చేతిలోవున్న కాగితం పక్కనవుంచి, మరో కాగితం అందుకుని "యేమిటా అల్లరి?" అని నిదానంగా అడిగా డతను.

"ఎవరో పిచ్చిబ్రాహ్మడు మహాప్రభూ! ఏలినవారి దర్శనం కావాలని నానా అల్లరీ చేస్తున్నా డండి."

"ఒక రూపాయి చేతిలో పెట్టి పొమ్మనలేక పోయావా?"

"డబ్బక్కర్లేదు టండి."

"మరేం కావాలిట?"

"చెప్పలేదండి."

"అడిగావా నువ్వు?"

"లే–ద్–ం"

చేతులు నులుపుకుంటూ యిలా నసికాడు రాణేదారు.

వీధిలో జవాన్ల కట్టుళ్ళలో వుండి, యిదంతా వింటూనేవున్న శంకరప్ప "వొక్కక్షణం మాట్లాడ్డంతప్ప మరేమీ అక్కర్లేదని చెప్పవయ్యా" అని కేకేశాడు.

"చెప్పవయ్యా?"అని పళ్ళు బిగించి, పెదవులు మాత్రం కదుపుతూ శంకరప్పమీద నిప్పులు కురిశేశాడు రాణేదారు. ఆ యేకవచన ప్రయోగం గుండెల్లో కసుక్కున కైజారు గుచ్చుకున్నంత బాధ పెట్టిం దతనికి.

ఏకవచన ప్రయోగం అంటే నౌకరీలో వుండే వారి నాలుక యెంతయినా నేర్పు చూపించగలదు; కాని చెవులు మాత్రం ఓర్పు కనపరచలేవు.

"ఒక అంగొస్త్రపుగుడ్డ కట్టుకుని, మరొక అంగొస్త్రపు గుడ్డ కప్పుకుని దరిద్రం వోడుకుంటూ –"

"అయితే?"

"పిచ్చిబ్రాహ్మడు మహాప్రభూ!"

"బేడీ లున్నాయూ?"

"లేవండి!"

"గుడ్డలు మాసి చిరిగీ వున్నాయూ?"

"లేవండి!"

"చింపిరి తలా?"

"కాదండి!"

"మరి నీ అగడం అంతా యెందుకోయ్!" అన్నట్టు, మొగం వంచుకుని, సులోచనాలపైనుంచి కొంచెం చురుగ్గా చూస్తూ వుండగా "నేను కార్యార్థిని గాని, పిచ్చివాణ్ణి కాను మహాప్రభూ!" అని శంకరప్ప గట్టిగా కేక వేశాడు.

రాణేదారు గుండెలు కొట్టుకున్నాయి కాని; కళ్ళు శంకరప్పమీద మళ్ళీ నిప్పులు కక్కాయి.

చికిలికళ్ళు కాగితంమీదికి తిప్పుకుని "యెదటికి రప్పించు" అన్నాడు దివాన్జీ.

కంఠం వొక్కుకుపోయి రాణేదారుకి మాట రాలేదు. చూపులుమాత్రం వీధికేసి మళ్ళాయి. ఆ యింగితం కనిపెట్టి, జవాన్లు, శంకరప్పని తెచ్చి దివాన్జీ యెదట విడిచి పెట్టారు.

## 2

దివాన్జీ యెగాదిగా చూశాడు. ఉన్మాద లక్షణాలు కనపడక పోవడమే కాదు, శంకరప్ప మొగంమీద బ్రహ్మతేజస్సు వెలిగిపోతోంది.

మొదట దివాన్జీ కళ్ళు జిగజిగ లాడిపోయాయి కాని; తరవాత అంతలో అధికారదర్పం పొంగి మనస్సు బిరుసెక్కి పోయింది. దాంతో కొరకొర లాడుతూ "యెవరయ్యా మీరు?" అని ప్రశ్నించాడు.

"మా యింటిపేరు తంగిరాలవారు. నా పేరు శంకరప్ప. నేను తణుకు నుంచి వచ్చానండి."

"ఏమిటి పని?"

"మహారాజులుంగారి దర్శనం చేసుకుందామని వచ్చాను."

దివాన్జీ కళ్ళు చిమ చిమ లాడిపోయాయి. పెదవులు అప్రయత్నంగా కదిలాయి. "ఏమిటీ? ఈ వేషంతోటే?" అనే మాటలు నాలుక చివరనుంచి గభీమని జారిపోయాయి.

"చిత్తం, చిత్తం, ఒక విద్యలో నేను చక్రవర్తిని. విద్వత్తు వున్నచోట వేషం అక్కర్లేదండి" అని వూగీసలాడుతూ శంకరప్ప బదులు చెప్పాడు.

"ఏ విద్యలో నీ చక్రవర్తిత్వం?"

"చదరంగంలో."

దివాన్జీ సీత్కారం చేశాడు. అతని మొగంమీద వెటకారం పొటమరించి వుంది.

పరోక్షంమాట యేమయినా, ప్రత్యక్షంలో, మొదట కూచోమనక పోవడమూ, తరవాత తన సహజ వేషాన్ని నిరసించడమూ, ఆ పైని యేకవచన ప్రయోగమూ, చివర కిదీనీ – దీంతో శంకరప్పలో ధార్ఢ్యం అంకురించింది.

"చందరంగం అంటే లోకసామాన్యానికి లోపల కర్ర ముక్కలూ, పైని లక్కపూతా మాత్రమే కనపడతాయి కాని; తెలిసినవారికి అందులో చతురంగ బలంయొక్క నిజ స్వరూపం గోచరిస్తుంది. యుద్ధరంగంలో అహమికతో యెదురుకున్న యిద్దరు చక్రవర్తుల చావుబతుకుల సంరంభం కూడా ప్రత్యక్షంగా కనబడుతుంది."

"గొప్ప వ్యాఖ్యానమే" అని నిరసించాడు దివాన్జీ.

"ధన్యోహమ్!" అని వెటకారంగా చూశాడు శంకరప్ప.

వెనుకపాటున వచ్చి, మెడమీద చెయ్యివేసి నొక్కిపట్టి నట్టయింది దివాన్జీకి. మాట తొణకలేదు.

"బ్రాహ్మలే కాదు, తురకలు, రెడ్లు, తెలగాలు, వెలమలు – చివరకి క్షత్రియులు కూడా యెక్కడా నా ఆట కట్ట కలిగినవారు లేకపోయారు."

"అ–బ్బా!....అలాగేం?"

"ఆత్మస్తుతి మంచిదికాదు కాని – ఒక్కొక్కప్పుడు – ఒక్కొక్కచోట అదే చాలా అవసరం అవుతూ వుంటుంది. ఇంతకీ; శ్రీ వత్సవాయి చతుర్భుజ తిమ్మజగపతి మహారాజులుంగారంటే చదరంగం ఆటలో నిధి అని దిగ్దంతులు ఘోష పెడుతూ వుండడంవల్ల వొక్కమాటు – ఒక్క ఆట వారితో ఆడాలని –"

"అంతేనా కోరిక?"

"అంతే. అక్షరాలా అంత మాత్రమే!"

"అయితే శీఘ్రంగా వెళ్ళవచ్చు."

"అదేమీ?"

"సాధ్యం కాదు కనక."

"ఏమీ? ఎందుకు కాదు?"

"మన మేమిటి, వీడితో మాట్లాడ్డం యేమిటి?" అని దివాన్జీకి అభిజాత్యం తోచింది; కాని "చదరంగం ఆడకూడదని నిశ్చయించుకున్నారు ప్రభువు" అని మాట జారి వచ్చేసింది.

"ఎంచేతో?"

"తగిన వుజ్జీ దొరక్క .... చివరికి ఆట కట్టడం మాట దేవు డెరుగును, నాలుగైదు యెత్తులయినా పొంకంగా వెయ్యగలవాడు కనబడలేదు పృథివి మీద."

"విపులా చ పృథ్వీ!"

దివాన్జీ వులిక్కిపడ్డాడు; కాని అలాంటిదేమీ లేనట్టు నటిస్తూ, అందుకు నిదర్శనంగా పృథివిమాట జారవిడిచి "కళ్ళు తెరవని కుర్రకుంకలతో ఆటేమిటని దాంతో నిరాశ చేసుకున్నారు మహారాజులుంగారు" అన్నాడు.

"నాతో ఆడిచూడకుండానే?" అని ముదలకించాడు శంకరప్ప.

దివాన్జీ వుగ్రుడైనాడు. నిప్పులు కక్కుతూనే చూశాడు; కాని శంకరప్ప గుండెలమీద తర్జనీ నిర్దేశం యింకా గుండెల మీదేవుంది. కళ్ళింకా నిలవతీసి అడుగుతూనే వున్నాయి.

తల యెగరవేసుకుంటూ "నువ్వేం ఆకాశంమీద నుంచి వూడిపడ్డావా?" అని నిరసనగా అడిగాడు దివాన్జీ.

"ఇంకా పైనుంచే అనే చెప్పవచ్చు"నని దానికి శంకరప్ప నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు.

"అబ్బో!"

"ఆశ్చర్యం అక్కర్లేదు. చదరంగం ఆడి తంగిరాల శంకరప్పని జయించగలవాడు చతుర్దశభువనాల్లోనూ లేడు."

"మహా కోస్తావే?"

"కత్తి చేతిలో వున్నప్పుడు కొయ్యకపోవడం యేమీ?"

"బతకతలుచుకోలేదూ?" అని కరుగ్గా అడిగాడు దివాన్జీ.

"అదీమాట, అసలైనమాట అది. మళ్ళీ చెబుతున్నాను. చదరంగం ఆటలో నేను గొప్ప విద్వాంసుణ్ణే కాని; నా విద్వత్తుకి వినియోగం కనబడలేదు. అంటే ఆ విద్యకీ నాకూ ఆనుకూల్యం పొసగలేదు. ఇక బతికేం ప్రయోజనమూ? ఈ వుద్దేశంతోటే యిక్కడికి వచ్చాను. ఇది చివరి ప్రయత్నం, నా చావు బతుకు లిక్కడ తేలిపోవాలి."

దివాన్జీ యెర్రగా చూశాడు.

"ఏతావతా; మొండిపట్టు పట్టి ఆటలో కూచుని వోడిపోతే, మహారాజులుంగారు, వచ్చినవాడి తలకొట్టించి కోట కొమ్ములకు కట్టించడానికి శపథం పట్టారని తెలుసు. తప్పకపోతే అందుకు సిద్ధపడే వచ్చేశాను."

"అంత సాహసం యేమి? పెళ్ళయిందా?"

"ఇంటావిడ కాపరమే చేస్తోంది."

దివాన్జీకి హఠాత్తుగా జాలి కలిగింది.

"కలో గంజో తాగుతూ పెళ్ళామనీ, పిల్లలనీ యేదో నలుగురితో బాటుగా వుండక, యీ దుస్సాహసం యేమయ్యా నీకు?"

"మంచి ప్రశ్నే కాని; దీనికి సర్వత్రా చెలామణీ లేదు."

"అంటే?"

"అంటేనా? ....... విద్యల్లో వుండుకున్న రుచి అలాంటిది. అది అందరికీ అందేదికాదు. విద్వత్తు వుంటే తిండి అక్కర్లేదు, నిద్ర అక్కర్లేదు, గుడ్డ కూడా –"

"పెళ్ళామో?"

"శాస్త్రం చెప్పిన తరవాయిగా వుంది. నిద్రాహారాలే అక్కర్లేక పోయాక యిక పెళ్ళామెందుకూ? అయితే, ప్రాజ్ఞత రాకముందే నాకు పెళ్ళయిపోయింది. ఇంటావిడ రావడమూ, చదరంగపు వ్యసనం హెచ్చిపోవడమూ వొక్కమాటే –"

"డబ్బు సంపాదించుకురమ్మని యింటావిడ తరిమి కొట్టిందన్నమాట?"

"ఇంటావిడ అయిన ప్రతిస్త్రీకి ఆ అధికారం వున్నదే కాదూ? ప్రతీ మొగాడి యింటావిడా ఆ అధికారం చెలాయించుకుంటూనే వుంది కాదూ? వీవంచ – నా విషయంలో కూడా అది కొంత లేకపోలేదు. తమరు – బాగానే కనిపెట్టారు; కాని వున్నదంతా అలాగే వుండిపోయింది."

ఇది విని దివాన్జీ రుష్టుడూ అయినాడు, లజ్జితుడూ అయినాడు. కాని యీ రెండింటి కలుపుతో చివరికి అభావదశకి వచ్చి "యింకా యేమిటీ?" అన్నాడు.

"ప్రతీ దినమూ యెవరో వొకరు వస్తూవుండడమూ, నాలుగోయెత్తు వెయ్యలేక చల్లగా జారుకుంటూ వుండడమూ, ఇక్కడ మహారాజులుంగారికీ, అక్కడ నాకూ వొక్కలాగే –"

"ఆ దురుసు పోలిక యేమిటయ్యా?"

"సత్యం వొక్కొక్కప్పుడు దురుసుగానే వుంటుందండి!"

దివాన్జీ తెల్లపోయాడు.

" సత్యం యెదట యెలాంటివాళ్ళూ వొక్క అంతస్తులోనే ఉంటారు. పోనీ, తగిన వుజ్జీ దొరక్క యిక్కడ మహారాజులుంగారికీ విసుపే వచ్చింది,. అక్కడ నాకూ విసుపే వచ్చింది. దీన్ని తమ రేమంటారు?"

"నీ ఆట లెక్కేమిటయ్యా?"

"సెబాస్! చాలా రోజులుకి వినపడిం దీమాట; కాని ప్రస్తుతం యీ మాట అనతగిన వారొక్క మహారాజులుంగారే. ఇక తమరా! వారి దర్శనం తమ చేతిలో వుంది."

దీవాన్జీ మొగం ధుమధుమ లాడిపోయింది. "సరే ఆలోచిస్తాం వెళ్ళు" అని నిరసనభావం కనపరచి అతను మొగం వంచుకున్నాడు.

"నేను కట్టుకోడానికి గుడ్డకూడా లేనివాణ్ణని ప్రత్యక్షమే. అయితే, నా ప్రజ్ఞ చూపించాలనే కాని, నాకు మరేమీ ఆశలేదు. మరో కోరిక యెంత మాత్రమూ లేదు. ఈ విషయంలో సంకోచం యెంతమాత్రమూ అక్కర్లేదు."

"మంచిమాట."

"నేనోడిపోతే నాతల తీసుకోడానిక్కూడా నా అభ్యంతరం లేదు."

"అదెలాగా తప్పనిదే."

అవ్యధానంగా "తథాస్తు" అని, "యిక నీ అభ్యంతరం యేమిటి?" అన్నట్టు చురుగ్గా చూసి, డంగయిపోయి దివాన్జీ మాట్లాడలేకపోగా "తెలుసుకో గలిగితే అదీ ఒక గౌరవమే" అని టోకాయించాడు శంకరప్ప.

"ఇంకేం, పరిపూర్ణజ్ఞానం కలిగిందన్నమాటే!"

"చాలామంది పెద్దలున్నూ యిలాగే శెలవిప్పించారు."

దివాన్జీ తేరిచూశాడు. నిజంగా అత నీమర్మాఘాతానికి తాళుకోలేక పోయాడు. తన పాండిత్యమూ, తన ఐశ్వర్యమూ, తన పదవీ – యివన్నీ వొక గోచిపాతరాయుడి యెదట గుడ్డి గవ్వకయినా మారకపోవడం అతనికి చిన్నతనం అనిపించింది.

ఏమీ పాలుపోక యెదటికి చూశాడతను. రాణేదారు కనబడ్డాడు. చేతులు కట్టుకుని వినయంగానే నుంచుని వున్నాడు; కాని దివాన్జీకి అతని నొసలు మాత్రం "నేను చెబితే విన్నావా?" అని దెప్పుతున్నట్టు కనపడింది.

"ఛా" అనుకుని ద్వారం కేసి చూశాడు. ఒక జవాను కనపడ్డాడు. అతను కూడా వొదిగి వొదిగే నుంచుని వున్నాడు; కాని కళ్ళుమాత్రం "మమ్మల్ని గదిమినట్టుకాదు బాబయ్యా" అని వెక్కిరిస్తున్నట్టున్నాయి.

చిరాకు పుట్టింది. అప్రయత్నంగా కిందికి చూశాడు. చేతిలో కాగితం ఉంది. బేగీరావుటపాలో పలివెల రాణాకి వెళ్ళవలసిన కాగితం అది. ఒక్క మాటు మనస్సు గజిబిజి అయిపోయింది. ఎక్కడ లేని తొందరా పుట్టింది. అది కుడిచేతిని వొణికించేసింది. చేతిలో వున్న కాగితం వూపేసేసింది.

మాటలో కూడా కొంచెం తడబాటు కనబడింది.

"రాణేదా–ర్!"

"చిత్తం చిత్తం."

"ఇది అంచెపరుగులమీద వెళ్ళాలి."

"చిత్తం" అంటూ రాణేదా రది దోయిలించి పుచ్చుకుని "మరి యీ చదరంగం సేనాపతి మాట యే మాలోచించా?" రన్నట్టోకమాటు కనుబొమలెగరవేసి, చివరికి "మీరూ మీరూ తంటాలుపడండి, నాకేం బాబూ?" అన్నట్టోక చిరునవ్వు మొలిపించి, మెల్లిగా తిరిగి, గబగబా వీధికేసి బయలుదేరాడు.

# 3

శంకరప్పతో మాట్లాడ్డం దివాన్జీ కిష్టంలేదు.

ఇంతసేపు మాట్లాడినందుకే అతను చాలా పశ్చాత్తాపపడ్డాడు. "అదిలో యిప్పుడు మాట్లాడ్డానికి వీలులేదని పంపేసి వుంటే, ఈ యిబ్బంది కలిగి వుండకపోవు"నని విసుక్కున్నాడు. అయితే, యిప్పుడయినా తొరగా పంపెయ్యడానికేం? కాని యేమనీ పంపెయ్యడం?

మాట్లాడవలసినవారు తన యెదట మరెవరూ లేరన్నట్టు నటిస్తూ, అతనొక కాగితం తీశాడు. ఒకటి రెండు బంతులు చదివాడు; కాని దృష్టి దాని మీద నిలవలేదు.

ఒకమాటు ఈవైపు కాగితాలు సద్దాడు. మరోమాటు ఆవైపు కాగితాలు సద్దాడు; కాని "బొత్తి సరిగానే వుందే, యెందు కీ పాట్లూ?" అని యెవరో అడిగినట్టయి అది వొదులుకున్నాడు.

పొడుముకాయ కాలికిందికి దొర్లిపోయి వుంది. అది తీసి "అనవసరం" అనుకుంటూనే వొక్క పట్టు పీల్చాడు. చ(రుమని నసాళం అంటి చురుకుపుట్టింది. "ఫో ఫో" అనేద్దా మనుకున్నాడు గాని; ప్రతిష్ఠ పీకింది.

అమాంతంగా పెట్టె మూత తెరిచాడు. ఎడమవైపు అరలో బత్తాయి చాకూ, కంరాణీ కనపడ్డాయి. దేనికోసమో వెతుకుతున్నట్టొకమా టవి పైకి తీసి పట్టుకుని మళ్ళీ పడేశాడు. ఎదటి అరలో బాతు కలం కనపడింది. అది బండగా రాస్తున్నట్టు జ్ఞాపకం వచ్చి "చెక్కుదాం" అనుకుంటూ పైకితీసి, అంతలో "ఛా, యింతమంది నౌక ర్లుండగా మనం చెక్కడం యేమిటి?" అనుకుని యధాస్థానంలో వుంచేశాడు. కుడివైపు చిన్న అరలో విడిడబ్బులున్నాయి. అవొకమాటు గలగల్లాడించాడు. మూత అరలో వొకకాగితం వేలాడుతోంది. అది తీశాడు; కాని యింతకి ముందే జవాబు రాసేసిన కాగితం అది. మళ్ళీ అది అక్కడ దాచేసి, గభీమని పెట్టెమూత వేసేశాడు.

వొడిలోవున్న తాళాలగుత్తి పక్కని పడేశాడు. పక్కనివున్న పొడుముకాయ రొంటిని పెట్టుకున్నాడు. సిరాబుడ్డి కొంచెం జరిపాడు. అటువున్న యిసక డబ్బీ యిటు పెట్టాడు.

చివరికి మరేమీ విలాసాలు తోచక, వొకమాటు మెడ గోక్కుని హఠాత్తుగా యేదో జ్ఞాపకం వచ్చినట్టు మొగం పై కెత్తాడు.

కాని, యెన్నిచేసినా మొగం పై కెత్తేటప్పటికి శంకరప్పే కనపడ్డాడు.

"ఇది వూరికే కదిలే ఘటం కాదయ్యోయ్!" అన్నట్టు పెంకిచూపులు చూస్తున్నట్టుకూడా కనబడ్డాడు శంకరప్ప.

దివాన్జీకి అభిమానం ముంచుకు వచ్చింది. "ఛా! ఈ దరిద్రుడికోసం యిన్ని తికమక లేమి" టని శౌర్యంకూడా వచ్చింది. మీదపడి మొట్టాలన్నంత ఆవేశమున్నూ వచ్చింది; కాని తన పదవీ, తన తాహతూ, తన అంతస్తూ స్మరించుకుని ఆవేశం అసహ్యభావంగా మార్చుకున్నాడు.

దీంతో "మహారాజులుంగారికి కావలసిన మనిషి" అనే జ్ఞానం కూడా లేకుండా,

శంకరప్పని చుర చుర చూస్తూ "నీకు కాదూ చెప్పడం? ఇక దయచెయ్యి" అంటూ చెండుకున్నాడు.

"దయచెయ్యడం అంటే యేమంత కష్టమైనది కాదు. దాని కింత సేపక్కర్లేదు; కాని, నాకేమి చెప్పినట్టూ?" అని ముదలకించాడు శంకరప్ప.

"ఆలోచిస్తాం, వెళ్ళు."

"వెళ్ళి?"

"వెళ్ళడమే తూర్పుగా తిరిగి దణ్ణంపెట్టి, పడమరగా తిరిగి అడుగుపెట్టడమే!"

"ప్చ్" అంటూ తల యెగరవేసుకున్నాడు శంకరప్ప.

దాంతో అతిక్రుద్ధుడయిపోయి "ఏయ్ జవాన్లు!" అని దురుసుగా పిలిచాడు దివాన్జీ.

ఎప్పుడెప్పుడని కనిపెట్టుకుని వున్న రాణేదారు పొడిచి తొందర పెట్టగా, జవాన్లు వెంటనే వూచల్లాగ మీద పడి, శంకరప్పని వీధిలో యెత్తి కుదేశారు.

ఇదంతా అయిన తర్వాత, తాను దివాన్జీకి కనపడకుండా వుండేటట్టు చూసుకుని శంకరప్పకేసి వురిమి చూస్తూ, యెదురొమ్మెగరవేసుకుంటూ మీసంమీద చెయ్యి వేసుకున్నాడు రాణేదారు.

"ఏం జరిగింది నాయనా?" అని ఆత్రంగా అడిగింది పేదరాసి పెద్దమ్మ.

"వ్యవహారం అంతా తల్లకిందులయి పోయింది పెద్దమ్మా" అంటూ చతికిలబడ్డాడు శంకరప్ప.

బసకి వచ్చాడు; కాని యెలా రాగలిగిందీ అత నెరగడు. ఈ మాట చెప్పాడు, అయితే యేమి మాట్లాడిందీ అతనికి గుర్తు లేదు. మాట ముగిస్తూ తల రెండుకాళ్ళమీదకి వాల్చుకున్నాడు. నిట్టూరుస్తూ రెండు చేతులూ తలకి చుట్ట వేసుకున్నాడు.

నిరాశా, వుడుకుమోత్తనమూ, దుఃఖమూ అతని శరీరంలో ప్రతీ అణుమాత్ర భాగంలోనూ నిండి చిప్పిలిపోతూవున్నాడు.

ఇదంతా చూశాటప్పటికి పెద్దమ్మ హృదయంలో స్తబ్ధమయిపోయి వుండిన మాతృత్వం అంతా హొక్కమాటుగా జాగృతం అయిపోయింది. దాంతో ఆమె కడుపు తరుక్కుపోయింది. వెంటనే తానున్నూ చతికిలబడి, హొకచేత్తో వీపు నిమురుతూ, రెండోచేత్తో చేతులు తప్పించి అతని మొగం తన బుజంమీదికి తీసుకుని "ఏం నాయనా? ఏం తండ్రీ?" అంటూ అతణ్ణి దగ్గిరపా తీసుకుంది.

ఇది అతనిలో శైశవమౌగ్ధ్యం అంకింతం చేసింది. ముప్ఫయ్యేళ్ళ శంకరప్ప పెద్దమ్మ అడ్డాల్లో బిడ్డ అయిపోయాడు. ఒక్కక్షణం – హొక్కటే క్షణం దుర్దమం అయిన ప్రాపంచిక వృత్తం అంతా మరిచిపోయి మళ్ళీ నిర్వికారావస్థ అనుభవించా డతను.

తరువాత ఆమె గుచ్చి గుచ్చీ, హొత్తి హొత్తీ అడిగింది. అతను ఆదినుంచీ ప్రతి అక్షరమూ వివరంగా చెప్పాడు.

ఈ చెప్పడంవల్లనే అతను కొంత తేలికపడ్డాడు. పెద్దమ్మ ప్రశ్నల ధోరణివల్ల పూర్తిగా మామూలు మనిషే అయిపోయాడు.

అప్పుడామె "ముందుమాట యే మాలోచించావు నాయనా?" అని లాలిస్తూ అడిగింది.

"మహారాజుతో యెలాగయినా వొక్క ఆట –"

"స్స్! ముందుమాట అడుగుతున్నాను నేను."

"నా కర్థం కాలేదు."

"మరి దివాన్జీతో దురుసుగా యెందుకు మాట్లాడావూ?"

"ఆ పెద్దమనిషి మొదటే హేళనలోకి దిగాడు. అదివరకే రాణేదారు, జవాన్లచేత గెంటించడం నన్ను రెచ్చకొట్టి వుంది. సరే, రాణేదారు తన యింటి దగ్గర ఆడిన మాటలు నా ప్రవృత్తినే మార్చేసి వుంచాయి."

"ఈ వుద్యోగస్థులు తమ తాహ తేమిటో, తమ బతు కెలాంటిదో తెలుసుకు మసులుకోరు"

"పొగరు మోత్తనం కాకపోతే, నన్నింత అవమాన పరచవలసిన అగత్యం యేమిటి చెప్పూ?"

"నీ మాట అలావుంచు. చదరంగం ఆడగలవాడు దొరక్క మహారాజు మతిపోయి వున్నాడు."

"అంతవరకూ వచ్చింది చూశావా?"

"దివాన్జీకి అది తెలుసు. తల యిచ్చెయ్యడానిక్కూడా సిద్ధపడి నువ్వు వచ్చినప్పుడు మూర్ఖుడు కాకపోతే ఈ దివాన్జీ "–

"మూర్ఖుడే కాదు – మూఢుడు కూడాను"

"అబ్బ! .... చివరికి ఫలం?"

"నా ప్రజ్ఞ –"

"దిబ్బా దిరుగుండమూనూ."

అంత జాలిలోనూ ఆమె యిలా విసుక్కుంది.

"విద్వాంసులు మంటూ వచ్చేవాళ్ళని చాలా మందిని చూశాను; కాని అందరూ యిలాగే లౌక్యం సుతరామూ లేక, యింగితజ్ఞానం అసలే లేక –"

"అసలే మతిపోయి వున్నాను. నువ్వు పుండుమీద కారం చల్లుతావా పెద్దమ్మా?"

ఇలా అంటూ అతనామె రెండు చేతులూ పట్టుకున్నాడు. దాంతో మనస్సు కరిగి ఆమె ధోరణి మార్చింది.

"అయితే, మరి విను. దివాన్జీ తలబిరుసుతనంవల్ల మహారాజుకి తగిన వాడితో ఆడే యోగం తప్పిపోయింది."

"అక్షరాలానూ!"

"పిచికమీద బ్రహ్మాస్త్రంవేసి మహా కులుకుతున్నాడు గాని; దివాన్జీ చేసింది స్వామిద్రోహం."

"ఈ సంగతి మహారాజుకి తెలిస్తే బాగుండును."

"అన్నావూ? అయితే అది నీ చేవను బట్టి వుంటుంది."

శంకరప్ప వులిక్కిపడి "అంటే?" అన్నాడు.

"అంటే యేముందీ? ఇప్పటిదాకా రాజదర్శనానికి నువ్వు తిప్పలుపడ్డావు. ఇక నీ దర్శనంకోసం రాజే తిప్పలుపడాలి."

"సెబాస్! ఎంత మంచిమాటా! అది అలా జరిగితే యెంత దర్జాగా వుంటుందీ?"

శంకరప్ప మనస్సేమో వురకలే వేసింది కాని; "తొందరపడకు" అని బుద్ధి విలేసింది, పరాభవ ఖిన్న మయిపోయి వుండడంవల్ల ఆ బుద్ధి కింకా నైశిత్యం అలవడి వుండలేదు.

"ఎప్పుడయినా అది సంభవిస్తుందా?" అని సందేహించా డతను.

"చెప్పాను కాదూ? అది నీ చేవను బట్టి వుంటుంది."

"తూర్పా పడమరా నాకేమీ బోధపడ్డంలేదు. అంత యోగమే పడితే ఆటలో మహారాజుని కియిక్కు మనిపించడం తప్ప నావల్ల మరేమీ కాదు. నీళ్ళుముంచినా పాలముంచినా – పెద్దమ్మా, నేను నీ కొడుకుని."

ఇలా అంటూ అత నామె పాదాలు పట్టుకున్నాడు.

ఆ చేతులు దూరంగా తీసేస్తూ, తన పాదాలు ముడుచుకుంటూ "ఇంత వెర్రిబాగుల వాయనవు, చదరంగంలో నీకింత నేర్పెలా వచ్చిందోయ్?" అంటూ జాలిపడింది పెద్దమ్మ.

ఆమె కళ్ళు ఆనందబాష్పాలతో దొప్పదోగిపోయాయి.

"దాని కంతకీ కారణం యీశ్వరానుగ్రహం. అయినా నా ప్రజ్ఞకంతకూ నీ అనుగ్రహమే ఆధారం."

ఒక్కమాటు పైకిచూసి "పెద్దాపురప్పట్నం అంతా యెప్పుడైనా చూశావా?" అని అడిగింది పెద్దమ్మ.

"లేదు. నీ యిల్లూ, రాణీదారు కొంపా, దివాన్జీ లోగిలీ తప్ప నేను మరేమీ యెరగను."

"అయితే విసుపులేకుండా ముందు పట్నం అంతా తిరుగు."

"తిరిగి?"

"పెద్దమనిషి వనుకువే ప్రతీవాడి యింటోనూ దశావతారీ ఆటో, చదరంగం పెత్తులో నడుస్తూనే వుంటాయి."

"ఆఁ, అదా? బోధపడుతోంది."

"చాలామంది వేశ్యలున్నూ వాటిల్లో నిధులున్నారు."

"బాగుంది."

"నీకు పిలుపు అక్కర్లేదు, ఆటకి అడ్డుపడు."

"అడ్డుపడడంతో కుదురుతుందా? శంకరప్ప ఉన్నంతకాలమూ యీ వూళ్ళో యెలాంటివాళ్ళూ కూడా చదరంగం అంటే హడలిపోతూ వుండవలసిందే."

ఈ మాట చాలా దృఢంగా అన్నా డతను. పొంగిపోతూ అన్నాడు. గర్వంతో అన్నాడు. టొకాయిస్తూ అన్నాడు.

"ఇంకేం? నీ వల్ల అంతపని జరిగితే, యిక నీకు అసాధ్యం అంటూ యేమి వుంటుంది? మన్నాడే యీ సంగతి రాజుకి –"

"హాక్ఖదెబ్బని" అంటూ యెగిసిపడి కూచున్నా డతను.

"మొదట, నిన్ను గెంటించిన రాణేదారే వస్తాడు. నువ్వు వెళ్ళకపోతే దివాన్జీ వస్తాడు. అక్కడికీ నువ్వు లొంగకపోతే తరవాత రాజే మన యింటికి స్వయంగా వస్తాడు."

"మన యింటి" కన్నమాట శంకరప్పకి వెనకాల యెంతో బలగం వున్నదన్నంత దిటవు కలిగించింది. "రాజే మన యింటికి స్వయంగా వస్తా" డనేమాట అతన్ని చక్రవర్తిని చేసేసింది.

"సెబాస్" అంటూ గభీమని లేచి నుంచున్నా డతను.

పెద్దమ్మ కూడా లేచి "యిప్పు డెక్కడికీ?" అంటూ చెయ్యి పట్టుకుంది.

"పట్నంలోకి."

"హాక్క క్షణం వోపిక పట్టు. వంట అయి –"

"తొందరలేదు. నాకిప్పు డాకలీ దప్పికా యేమీ తెలవడంలేదు. ఒక్కణ్ణయినా కాళ్లమీద పడేటట్టు చేసుకుంటేగాని నాకు నోటికి ముద్దపోదు. క్షణం, ఎంతోసేపా?"

వాకట్లోనుంచి గుమ్మంలోకి హొక్కటే వురక. అక్కణ్ణుంచి వీధిలోకి హొక్కటే అంగ.

## 5

**ఎడాపెడా చూసుకుంటూ** శంకరప్ప సందు మళ్ళాటప్పటికొక పెద్ద భవంతి కనపడింది. మండువా వాకట్లోనుంచి చదరంగానికి సంబంధించిన ఘర్షణ కూడా వినవచ్చింది.

పెఠాపురం ప్రవేశించాక, యీ రెండురోజుల్లోనూ అతనికిదే చదరంగ వ్యావృత్తి. అంచేత ఆ ఘర్షణ వినేటప్పటి కతనికి తొందర పుట్టింది.

లేడిపిల్ల మీదికి పెద్దపులిలాగా హొక్క దూకుదూకాడు.

లోపల యిద్దరు బ్రాహ్మణ యువకులు చదరంగం ఆడుతున్నారు. వారికిద్దరికీ చెరో సలహాదారూ దగ్గిరసా కూచుని వున్నారు. కాని వారిలో యెవరూ శంకరప్పని కూచో మనలేదు. పలకరించనూ లేదు. చూడనే లేదు.

అతను కూడా వారిని పలకరించలేదు.

ఒక్కమాటు నలుగురి మొగాలూ చూశాడు. ఒక్కమాటు బలమున్నూ చూశాడు. తరవాత అతికష్టంమీద మనస్సు బిగపట్టుకుంటూ, స్తంభానికానుకు నుంచున్నాడు.

అరగడియ గడిచింది; కాని యెత్తు పడలేదు.

బలం అంతా అతి సూక్ష్మంగా పరిశీలించడం, ఏదో, యెత్తు తోచి గభీమని చెయ్యిచాపడం, అంతట్లో యెదటి బలంలో యేదో జంతువు ప్రతికూలంగా కనబడి, వరాలు కుంగిపోగా, చెయ్యివెనక్కి తీసేసుకోవడం, తరవాత ఆ వేగం మళ్లించుకోలేక కూనిరాగం తీస్తూ వ్రూగిసలాడడం, లేకపోతే "ఛా" అంటూ అట్ట తేలేటట్టు తొడ చరుచుకోడం, అదీ కాకపోతే, వెనకటి యెత్తుల్లో హొకటి తప్పుగా పడి విషమించిందని పశ్చాత్తాప పడడం – యెత్తు వెయ్యవలసిన యువకు లీస్థితిలో వున్నారు.

ఎదిరిబలంలో వున్న లోటుపాట్లన్నీ బాగా కనిపెడుతూ వుండడం, ఎత్తువెయ్యడాని కెదటి ఆటకాడు చెయ్యిచాపినప్పుడల్లా గుండెలు పీచు పీచు మనిపించుకోడం, ఉన్న గోడు కూడా చెడుతుందని వాళ్లు యెత్తు మానుకున్నాచుంటే, పెదవులు విరవడం – కనుబొమ లెగరవెయ్యడం – వోరచూపులు చూసుకోవడం, ప్రతిపక్షు లీస్థితిలో వున్నారు.

ఇంకొక అరగడియ గడిచింది.

శంకరప్ప విసిగిపోయాడు.

"ఏమండీ, యెత్తువెయ్యరేం?" అని సరసంగానే అడిగాడతను కాని; ఆటకాడిది వినిపించుకోలేదు. సలహాదారు మాత్రం మొదట మిడుతూ మిడుతూ చూసి, తరవాత "నీకెందుకయ్యా మా గొడవ?" అని కొంచెం విసుక్కున్నాడు.

"మీ గొడవ నా కెందుకూ? ఆట గొడవ అడుగుతున్నాను నేను. ఎంతకీ యెత్తు పడదేం?" అని శంకరప్ప మళ్ళీ అడిగాడు. ఈమాటు అతను బుద్ధిపూర్వకంగానే కొంచెం పెంకితనం కనపరిచాడు.

సలహాదారా పెంకితనం గమనించకపోలేదు. అయితే, అతని తల యింకా బిరుసెక్కి పోలేదు. నిజాని కతనింకా సాధకావస్థలోనే వున్నాడు. పైగా, ఇందాకా వేషాన్ని బట్టి బికారిగా కనపడ్డ శంకరప్ప, ముఖవర్చస్సును బట్టి యిప్పుడు అసాధ్యుడుగా కనిపించాడు. అదేదో చూడాలని ఆపేక్ష కలిగిం దతనికి. దాంతో ఆ నిర్లక్ష్యం పోయింది.

"నాలుగ్గుళ్ళ పొద్దెక్కేటప్పటికి ఆట యీ స్థితికి వచ్చింది. ఎత్తు వేశామంటే, మా ఆట పైసలా. సరియైన యెత్తు తోచక మేమూరుకోగా తమకి వంతురాక మావాళ్ళూరుకున్నారు" అని వెంటనే సాదరంగా చెప్పా డతను.

"ఇంతమంది – యింతసేపు – ఏమండీ, యిందులో యేం వుందీ?" అని విస్మాకారంగా అడిగాడు శంకరప్ప.

ఆటకాడి కిది కొట్టినంత పని చేసింది. వెంటనే బుస్సు మంటూ కోడెతాచు పడగ యెత్తేటట్టు మొగం పైకెత్తి "చదరంగం అంటే యేమిటో నీ కేమయినా తెలుసా?" అని దురుసుగా అడిగా డతను.

"దొరికా" ననుకున్నాడు శంకరప్ప.

ఆటగాడి మొగంమీద చక్కని వర్చస్సు కనపడింది శంకరప్పకి. "సత్తావుంది; కాని సంస్కారం చాలదు. చికిలీ చేస్తే, చంద్రహాసం అవుతాడు. ఇతగాణ్ణి భృత్యుణ్ణి చేసుకుతీరాలి" అని అతను నిశ్చయించుకున్నాడు. దాంతో, అతణ్ణి రెచ్చకొట్టి తనకి అవకాశం కలిగించుకోదలచి "నాకూ తెలుసు. ఆ మాటకి వస్తే నాకే తెలుసు" అని వొత్తి చెప్పాడు.

ఆటకాడు గతుక్కుమన్నాడు.

శంకరప్ప అది కనిపెట్టి "అలా చూస్తే యేమవుతుందీ? వారి ఆట నేను కట్టిస్తాను, మీరు తప్పుకోండి. లేకపోతే మీచేత కట్టిస్తాను, నేను చెప్పినట్టెత్తు వెయ్యండి. చేతనయితే, మీ యిష్టంవచ్చిన పరీక్ష చేసుకోవచ్చు, నేను సిద్ధం" అని టొకాయించాడు.

ఆ వేషం చూసి ఆటకాడు మొగం మళ్ళించుకున్నాడు గాని; తన సలహాదారు పుబలాటం గుర్తించి "యీ పిడుగు వీడిమీద పడిపోనీ"అని నిశ్చయించుకున్నాడు.

ప్రతిపక్షి వయస్సుకీ అనుభవానికీ కూడా ఆ నలుగురిలోనూ పెద్ద. ఒకపాటి ఆటకాడు కూడాను. "జన్మానికల్లా శివరాత్రి" అన్నట్టు గతసంవత్సరం, యెవరూ దొరకని సమయంలో మహారాజుతో వొకనాడు రెండాటలు వేసివున్నా డతను. తన కారులో అలాంటి అదృష్టం పట్టినవాడు తానొక్కడే కావడంవల్ల, చదరంగం బల్లదగ్గిరికి వచ్చాటప్పుడు చాలా బిర్రుగా వుంటూవుంటాడు. మహారాజులుంగారి నడక కూడా కొంచెం కనపరుస్తాడు. ఆట ప్రారంభం అయినాక అంగన్యాస కరన్యాసానాలు కూడా వింతగా చేస్తూ వుంటాడు.

మాటధోరణిలో వున్న పెంకితనం చూడగా శంకరప్ప ఆట చూడాలని అతనికి సరదాగానే వుంది; కాని "గోచిపోతరాయణ్ణి మనతో సమానంగా కూచోనివ్వటమా!" అని అభిజాత్యం తోచింది.

ఆటగాళ్ళందరూ మొగ మొగాలు చూసుకున్నారు.

"ఏమంటావోయ్?"

"ఈ యెత్తు కానివ్వరాదుటోయ్!"

"మనిషి మారేటప్పు డిది కొత్త ఆటే అనుకోవచ్చు కాదుటోయ్!"

"ఇంతవరకూ వచ్చాక మనిషి మారడం యేమిటి కావలిస్తే సలహా పుచ్చుకోవోయ్!"

ఉత్సాహాతిరేకం వల్ల, ఆటకాడు "సలహా పుచ్చుకో" అన్నమాట ఆంతర్యం గ్రహించలేదు. దీనికి సాయం, సలహాదారు, తాను జరిగి "అలా జరుగు" అని కూడా అన్నాడు. అంచేత "మరి కూచోవయ్యా!" అని జరుగుతూ శంకరప్పని పిలిచా డతను.

కాని శంకరప్ప కూచోలేదు. స్తంభం కూడా విడిచిపెట్టలేదు. ప్రతిపక్షి వుద్దేశం అతను గ్రహించేశాడు. దాంతో "నా తాహతూ నీ తాహతూ చూద్దువు గాని" అని మనస్సులో అనుకుని "మీరు లేవనక్కర్లేదు. లేవనేవద్దు. నేనిలా నుంచునే వుంటాను. మీ సరసని కూచోడానికి నేనెంతవాణ్ణి?" అన్నాడు మెల్లిగా.

ప్రతిపక్షి తృప్తిపడ్డాడు.

"అయితే సలహా చెప్పు" అని బల్లకేసి తిరిగా డాటగాడు.

"ఎన్ని యెత్తుల్లో ఆట కట్టమంటారు?"

"సొరకాయలు నరుకుతున్నావే!"

ఆట కా డిలా అంటూ చాలా హేళన కనపరిచాడు కాని, సమయం గుర్తించి శంకరప్ప దాన్ని లెక్కచెయ్యలేదు.

"నరకడాని కంత తేలికయిన వస్తువు మరేదీ లేదని తరవాత మీకే తెలుస్తుంది, యెత్తులమాట చెప్పండి ముందు."

"అయితే నువ్వే చెప్పు."

"అయితే వినండి – ముందు నేనో యెత్తు వేస్తాను. అంటే చెబుతాను. తరవాత వారు వేస్తారు. మళ్ళీ నే నింకో యెత్తు చెబుతాను."

ప్రతిపక్షి పులుకూ పులుకూ చూశాడు. ఆటకాడు, "కోతలు" అనుకుంటూ చూశాడు. ఆటకాడి సలహాదారు "తరవాతా?" అన్నాడు.

"బలం కలిపివెయ్యడమే."

ప్రతిపక్షి వురిమిచూశాడు. ఆటకాడు "మరికానియ్యి" అని చెయ్యిచాపాడు. సలహాదార్లిద్దరూ చకితులయినారు.

"మీ నల్లగది శకటు వారి గుర్రం ముందు వెయ్యండి" అన్నాడు శంకరప్ప.

"ఓస్" అనిపించింది ఆటకాడికి. ఈ యెత్తు అతని కిదివరకి పదిమాట్లు తోచింది. సలహాదారుకి తొమ్మిది మాట్లయినా తోచింది; కాని ధైర్యమూ, సాహసమూకూడా కలక్క వా రూరుకున్నారు. ఈ యెత్తే శంకరప్ప చెప్పడంలో వారికి విశేషం కనపడలేదు కాని; అతను మూడెత్తులతో ఆఖరంటున్నాడు. అది తలుచుకుని "వే-శా-ను" అంటూ చెప్పినట్టు వేశాడు ఆటకాడు.

ప్రతిపక్షి కీ యెత్తులో యేదో కిటుకుందని తోచింది. ఆటకాడే స్వయంగా యిది వేసి వుంటే, చూపుల్లో అధమం రెండుమూడు రసాలయినా వొప్పించి వుండు నతను.

ఇప్పుడతని కెత్తు తోచలేదు.

ఇప్పటిదాకా అత నుపయోగించిన నిర్లక్ష్యభావం అంతా యిప్పు డాటకాడికి సంక్రమించింది. దాల్లో కొంత వాడిసి కొట్టేసి "చూస్తావేమిటోయ్?" అంటూ నిలవదీసి అడిగాడు సలహాదారు.

"ఆలోచించుకో నియ్యవోయ్! ఇదంతా మీ ప్రజ్ఞే అన్నట్టెగిసిపడుతున్నావేమిటి?"

"తొందరపడకు. కావలసినంత సేపాలోచించుకో. బాగా నిదానించి మరీ యెత్తువెయ్యి" అన్నా డాటకాడు.

"వోస్! ఏమి ఔదార్యంరా? .... అయితే, మరి, గుర్రం యిక్కడ వేశాను."

"ఆ బంటుతో మీరు తోసిరా జనండీ!"

"తోసి రాజు రా!"

"ఆటకట్టు అని కూడా –"

"ఆట క – ట్టురా!"

ఆటకాడు సందేహిస్తూ అనగా "జంకెందుకోయ్?" అని గదిమాడు సలహాదారు.

ఆటకాడు "భేష్" అన్నట్టుమాత్రం చూడగా సలహాదారు పొంగిపోయి "యేవ్వూరు మహానుభావా మీదీ?" అంటూ గభీమని లేచి శంకరప్ప చేతులు పట్టుకున్నాడు.

శంకరప్పకి, చెవిలో "వొకడు" అని వినిపించినట్టయింది.

"నన్ను చూశారా? నా వేషం కనపడుతోందా? పొట్ట చేత్తో పుచ్చుకువచ్చాను. అన్ని వూళ్ళూ నావే!"

"పేరు?"

"తంగిరాల శంకరప్ప."

ఆటకాడి మనస్సు గుబగుబ లాడిపోయింది.

ఉత్సాహం అణుచుకోలేక "ఏమిరా, ఆట కట్టిందని వొప్పుకుంటావా – యెత్తు వేస్తావా?" అని దురుసుగా అడిగా డతను.

"చే–బ్దా ..........ఈ గుర్రంతో యీ బంటు –"

"తెరిచి రాజవుతోందోయ్!"

"అయితే, రాజు నిక్కడ వేశాను."

ఇలా అంటూ యెత్తువేసి, ప్రత్యర్థి "నీకు దిక్కున్నచోట చెప్పకో" అన్నట్టు చూడగా ఆటకాడు తెల్లపోయి శంకరప్పకేసి చూశాడు.

"ఏం, మూడెత్తుల్లో కట్టలేక పోయాననా అలా చూస్తున్నారు? తప్పే, అపరాధిని క్షమించండి, ఏంచెయ్యనూ మరీ? ఇంకొక్క యెత్తు – ఎర్రగది శకటుందే మీది, దాంతో వారి రాజుని –"

సగంలో అందుకుని "హోరీ శకటింటో వేశావురా రాజునీ" అని సలహాదారు సింహనాదం చేశాడు.

"అరే, అరే" అంటూ ఆటగాడు ఆశ్చర్యపడ్డాడు.

ప్రతిపక్షి ముందు నాలుకకరుచుకున్నాడు. తరవాత తన రాజుని తీసి చేత్తో పట్టుకున్నాడు. ఎక్కడ వేదామన్నా స్థలం కనపడలే దతనికి.

మతిపోయింది. చివరికి "హా" అంటూ బలం అంతా కలిపేసి కాళ్ళుచాపేసి రెండు తొడలూ గోక్కుంటూ గోడకి చేరబడిపోయాడు.

ఆటకాడు వుబ్బెత్తుగా లేచి, గభీమని శంకరప్పను కౌగిలించుకుని "మహానుభావా! ఎవరో సామాన్యులని మిమ్మల్ని హేళన చేశాను. ఏకవచన ప్రయోగమున్నా చేశాను. అపరాధిని. నన్ను క్షమించా" లని బతిమాలాడు.

అందుకు శంకరప్ప "మీరేమీ కించపడనక్కర్లేదు మొదట మీరనుకున్నట్టిప్పటికీ నేను సామాన్యుణ్ణే. ఇక యేక వచన ప్రయోగమా? ఈ స్థితిలో నాకు అదికూడా గౌరవాస్పదమే. చిన్నమ్మ కొడుకులు మీరు. ఎవరి నేమనడానికయినా అర్హులు. నన్ను మీరు నువ్వన్నందుకు నాకే విచారం లేనప్పుడిక మీకెందుకూ?" అంటూ తేల్చేశాడు.

"అయ్యా, యీపూట మీరు భోజనానికి మా యింటికి దయచెయ్యాలి" అని ఆహ్వానించాడు సలహాదారు.

"అలా కాదు. ఈ పూట మా యింటికి, రాత్రి మీ యింటికీ వస్తారు" అని సలహాదారుకి సద్దిచెప్పి, "మరి దయచెయ్యండి " అని శంకరప్ప చెయ్యిపట్టుకున్నాడు ఆటకాడు.

శంకరప్ప ముందు చెయ్యి విడిపించుకున్నాడు.

"మహానుభావా! మీరుభయులూ నన్ను క్షమించాలి. మీ అనుగ్రహానికి చాలా సంతోషం. వే నింతలో యీవూరు విడిచివెళ్ళను. ఎన్నేసి పూటలు మీ యిళ్ళల్లో భోజనం చెయ్యాలో అప్పుడే అయిందా? ఇప్పటికి నన్ను విడిచి పెట్టండి. కారణం తరవాత మనవి చేసుకుంటాను."

"మీ బస యెక్కడ?"

"పెద్దమ్మ యింటో."

"భోజనం చెయ్యగానే దయచెయ్యగలరా?"

"వల్లకా దంటే భోజనమే మానెయ్యగలను"

"అక్కర్లే దక్కర్లేదు. ఇంతట్లో మేముకూడా భోజనం చేసి వస్తాము. మిమ్మల్నొకచోటికి తీసుకువెడతాం. మీరు వారితో - ఇప్పు డెందుకు లెండి, తరవాత మాట్లాడుకుందాం, పెద్దమ్మ యింటి వెనకాలే మా యిల్లు - పదండి"

ముగ్గురూ బయలుదేరారు.

రామశాస్త్రి, యాజులూ వెంటరావడం చూసి పెద్దమ్మ "అప్పుడే పిట్టల్ని కొట్టినట్టున్నాడు నాయన!" అనుకుంది.

ఆ మాటా ఈ మాటా చెబుతూ పొక్కక్షణం కూచుని "భోజనం కాగానే వచ్చేస్తాం" అంటూ శాస్త్రి, యాజులూ వెళ్లిపోయారు.

జరిగిందంతా విని "యిదీ పద్ధతి" అని మెచ్చుకుంటూ దగ్గిర కూచుని కబుర్లు చెబుతూ శంకరప్పకి సుష్టుగా భోజనం పెట్టింది పెద్దమ్మ.

# 6

"ఇదిగో, భీమసేనరావుగారే!. ఎప్పుడు దయచేశా రేమిటి వూళ్లోకి?"

"శాస్సేపు మాట్లాడకండి, శాస్తుల్లుగారూ! నా ఆట కట్టితీరతానని పొట్టు పెట్టుకున్నారు పంతులుగారు."

"ఎప్పుడు వేశా రండి యెత్తు?"

"పొద్దున్న."

"తమరేనా?"

"అవును."

"చిత్తం" అంటూ శాస్త్రి రాజు దగ్గిరగా కూచుంటూ తన ముందు కూచోమని చోటు చూపించాడు కాని; శంకరప్ప కూచోలేదు. అదిచూసి యాజులు కూడా నుంచునే ఉండిపోయాడు.

ముగ్గురూ బలం పరిశీలించారు.

శాస్త్రి శంకరప్పా చిరునవ్వు నవ్వుకున్నారు.

అరగడియ గడిచినా చలనం లేకపోవడం చూసి, కళ్ళతో పొడిచి యాజులు రెచ్చగొట్టగా, శాస్త్రి "పంతులుగారూ!" అంటూ అందుకున్నాడు.

"కోపంవచ్చినా సరే, నా మనవి చిత్తగించాలి తమరు."

"ఒక్కక్షణం తమ రూరుకోగూడదూ?"

"ఊరుకోనేవచ్చు. ఊరుకోలేకా కాదు. ఆట కట్టించుకున్నా కట్టినా వేంకటపతిరాజుగారితో యెత్తు వెయ్యగలవారు మన జట్టులో తమ రొక్కరే కాని; యిలా చూడండీ, వీరు - తంగిరాల శంకరప్పగారులెండి వీరి పేరు. వీరి నొక్కయెత్తు వెయ్యనివ్వండి. లేకపోతే తమరే వేయించండి, వీరి సలహా పుచ్చుకుని"

"అయ్యా, దయచెయ్యండి" అంటూ శంకరప్పకి తహజీ మిచ్చాడు రాజు.

"చిత్తం. చిత్తం. నుంచునివుంటే బలం బాగా కనబడుతోంది. సెల విప్పించండి" అని సవినయంగా కోరాడు శంకరప్ప.

రాజు "తమ చిత్తం" అనగా శాస్త్రికూడా చెప్పాడు కాని, శంకరప్ప కూచోలేదు.

"అంత సమర్థులా వారు? ...." అనడిగాడు పంతులు.

"సందేహం మేం? మూడెత్తుల్లో ఆట కట్టేస్తారు."

"అబ్బా! ఏ వూరయ్యా మీదీ?"

పంతులు ప్రశ్నలో అహమికా, తేలిక భావమూ వుండడం గుర్తించి, "మా బ్రహ్మిగాళ్ళకి నోరు సరిగా తిరగదు, చిత్తగించారా?" అన్నట్టు మొదట రాజుకేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, "చిత్తం చిత్తం, నాకేవూరూ లేదండి. చెట్టుమీది పక్షిని" అని చివరికి పంతులుకి బదులు చెప్పాడు శంకరప్ప.

"పక్షులు చదరంగం ఆడతాయా?"

"ఏమి ఆడకా? ఆహార నిద్రాభయమైథునాది – చిత్తగించారూ? పక్షులు మనుష్యులు చేసే పనులన్నీ చేస్తాయి. అయితే, యెత్తు వెయ్యడానికి మాత్రం పూటలికి పూటలూ రోజులికి రోజులూ గడిపెయ్యవు."

ఈ మర్మాఘాతానికి వ్యగ్రు డయిపోయి "అలాగేం? అయితే యేదీ కాయ కదుపూ చూద్దాం" అంటూ మూతి బిడాయించుకుని పక్కకి వొత్తిగిల్లాడు పంతులు.

"నన్ను పరీక్ష చెయ్యాలని వుంటే నువ్వు తప్పకుంటే యేమవుతుందీ?"

"మరేం చెయ్యాలీ?"

"అలాకూచుని రాజుగారికి సలహా చెప్పాలి. లేకపోతే వారిని తప్పకోమని నువ్వే ఆడాలి."

"పాండిత్యం వొలికించేస్తున్నావే! ఏదీ మరి కానియ్యి."

ఉభయుల మర్యాదతిక్రమణము గుర్తించి రాజా, శాస్త్రి చాలా ఆందోళన పడ్డారు కాని, యింకా ముదిరితే అప్పుడు చూసుకో వచ్చునని వూరుకున్నారు.

పంతులు రాజు పక్కకి వెళ్ళాడు. పంతులు స్థానంలో యాజుల్ని కూచోబెట్టాడు శంకరప్ప.

శాస్త్రి, యాజులూ పైకి బింకంగానే వున్నారు కాని; యింతా చేసి చివరికి శంకరప్ప వోడిపోతాడేమో అని బిట బిటలాడి పోసాగారు.

అప్పుడు "సెలవా?" అంటూ ముందు రాజు అనుజ్ఞ పుచ్చుకుని, తరవాత "మన రాజుని వొక్కగది వెనక్కి తప్పించండి" అని యాజుల్ని ఆజ్ఞాపించాడు శంకరప్ప.

వెంటనే "తమరు తోసిరాజనండి రాజుగారూ!" అని పంతులు పురమాయించాడు.

"మన రాజుని ఆ బంటుకడ్డువెయ్యండి యాజులుగారూ!"

పంతులుకూడా యిలాగే ఆజ్ఞాపించాడు కాని, రాజందుకంగీకరించలేదు.

ఇద్దరికీ చర్చ ప్రారంభమయింది "ముందు మనరాజు వునికి గట్టి చేసుకోవా" లంటాడు రాజు. "ఎదుటివారికి గుక్క తిరక్కుండా మళ్ళీమళ్ళీ రా" జనాలంటాడు పంతులు.

ఇద్దరూ వొక్కనిమిషం ఆలోచించారు. అప్పుడు కూడా పంతులామాటే అన్నాడు. "అయితే, యీ ఆటతో నాకు సంబంధంలేదు, మీరు కానివ్వండి" అని రాజు తప్పకున్నాడు.

వెంటనే ద్విగుణీతోత్సాంతో "తెరిచి రాజు" అన్నాడు పంతులు, పక్కకి జరిగి.

"మన వల్లకటు అడ్డుపడెయ్యండి" అన్నాడు శంకరప్ప.

"నేను మీ శకటుని కొట్టేశాను."

"మీరేం చేస్తారు యాజులుగారూ?"

"నేను వారి రాజుని కొట్టేశాను."

పంతులు నాలుక తెగ్గరుచుకున్నాడు - చివరికి నోరు కుట్టేసుకున్నాడు.

తరవాత శాస్త్రీ, యాజులూ బలవంతపెట్టగా, రాజు స్వయంగా శంకరప్పతో వొక ఆట వేశాడు. అది ముగిశాటప్పటికి చీకటిపడింది. అయినా రాజే వోడిపోయాడు. శంకరప్ప వెంటవెంటనే యెత్తువేస్తూ రాగా, రాజు గడియా రెండు గడియలూ ఆలోచించిగాని యెత్తు వెయ్యలేకపోతూ వచ్చాడు.

అందరూ లేచారు.

"రేపొకమాటు దయచెయ్యండి" అని రాజు ఆహ్వానించగా "చిత్తం చిత్తం, తప్పకుండా దర్శనం చేసుకుంటా" నంటూ శంకరప్ప సెలవు పుచ్చుకున్నాడు.

తరవాత రాజుతో లోగుమ్మందాకావెళ్ళి "యిదంతా తెలివే అంటారా తమరు?" అని అడిగాడు పంతులు.

"కాకేమీ?"

"ఎప్పటికీ కాదు."

"ఎంచేతా?"

"అలాగా. ఉచ్చిష్ట గణపతి వుపాసనవుంది ఆ బ్రాహ్మడికి."

"తమ రెలా కనిపెట్టారూ?"

"ఆ వేషం చిత్తగించారా?"

"సింగినాదం కాదూ? మహారాజులుంగారి యెదుట మనమెలా వుంటామో ఆలోచించారా?"

బుర్రవంచుకుని మెట్లు దిగి "మరి సెలవు" అని మెల్లిగా జారాడు పంతులు.

"వేంకటపతిని రాజుగారితోటే ఆడావా? రెండాటలూ వారే వోడిపోయారా? ఇంకేం? మొదటే యీ దారి తొక్కవలసిందోయి నాయనా! ఆ దిక్కుమాలిన రాణీదారెక్కడ దాపరించాడోయి నీ ప్రాణానికీ" అని శంకరప్ప వీపునిమురుతూ పెద్దమ్మ చాలా నొచ్చుకుని చాలా మెచ్చుకుంది.

అది చూసి "రాణీదా రేమిటి శంకరప్పగారూ?" అన్నాడు శాస్త్రి.

"ఆయన చదరంగం ఆడలేడే" అన్నాడు యాజులు.

దీనిమీద "చెప్పనా మానవా?" అన్నట్టు శంకరప్ప తనకేసి చూసి చూడ్డంతోటే పెద్దమ్మ అందుకుని "అది వేరే గొడవ నాయనా! ఇప్పటిది కూడా కాదులెండి. నా నాయనికి భోజనాని కాలస్యం అయిపోతుంది, యిప్పటికి మీరు వెళ్ళండి. వెర్రితండ్రికి నిద్ర తక్కువయితే జబ్బు చేస్తుంది, మరి రాకండేం?" అని తొందరపెట్టి వారిని పంపేసి, "నీళ్ళు కాగాయి పద, స్నానం చెయ్యి. వొసే, రామసోదెమ్మా! నీళ్లు తొరపడం అయిందా, యింకా తరవాయేనా?" అని అడుగుతూ రెక్కపట్టుకుని శంకరప్పని నూతిపెరట్లోకి తీసుకువెళ్ళింది.

# 7

నాల్గుఝాళ్ళ పొద్దెక్కిుంది.

"మీకోసం చూస్తున్నా" నంటూ లేచి నుంచున్నాడు శంకరప్ప.

"రైతులు శిస్తులు తెచ్చారు. లెక్కలు పరిష్కారం చేసుకుని వారిని పంపేశాటప్పటికీ వేళ అయింది. మావాడుకూడా కొంచెం పని తగిలి పెందరాడే రాలేక పోయాడు. ఇంతకీ; మనం వెళ్ళవలసినచోట పొద్దు పొడిచాటప్పటికే ఆట మొదలయిందని కబురువచ్చింది, మరి బయలు దేరండి" అంటూ శాస్త్రి కవాచీ బల్లమీద కూచున్నాడు.

"సరే, వారిని బయలుదేర మంటూనే నువ్వు తిష్టవేస్తావేమిటోయ్?" అని ముదలకించాడు యాజులు.

ఒక్క నిమిషం సరాగాలు వెళ్ళిపోయాయి.

దండెంమీద ఆరి వున్న అంగొస్త్రం తీసి కప్పుకుని శంకరప్ప అడుగు వేశాడు

"నా నాయన్ని పెందరాడే తీసుకురండి నాయనా! వేళతప్పి భోజనం చెయ్యడం మీకు మాత్రం మంచిదా?" అని అడుగుతూ వారిని కొంజా దాటించి వీధి అరుగుమీద చతికిలబడింది పెద్దమ్మ.

ఒకచోట, వొక బుగ్గమీసాల క్షత్రియుడొక తురకాయనతో చదరంగం ఆడుతూ "దయచెయ్యండి శాస్త్రులుగారూ!" అని పిలిచాడు.

మరోచోట ఒక తెలగా, ఒక వైశ్యుడూ, ఒక బ్రాహ్మడూ దశావతారీ రంగుబూజు ఆడుతున్నారు. వారిలో బ్రాహ్మడు "ఆది నారాయణం వేద్దాం రావోయ్!" అని పిలిచాడు.

ఇంకో చోట "మా భీమరాజు అసాధ్యపు యెత్తు వేశాడండోయ్! మీరు వస్తేగాని మాట తక్కేటట్టు లేదు. సమయానికి దేవుడులాగ కనపడ్డారు, రావాలి, మరితప్పదు" అని ఒక పంతులు కేకవేశాడు.

మరికొందరున్నూ పిలిచారు. కాని, శాస్త్రి అగలేదు

"చాలా తొందరపనిమీద వెడుతున్నానండి", "ఇప్పుడు కాదోయ్", "ఆ పనిమీదే ఒకచోటికి వెడుతున్నాను. ఇప్పుడు రాలేను. మరోలాగ అనుకోకండేం?" అని వారికి చెబుతూ అతను ముందుకి సాగుతూ వచ్చాడు.

వెళ్ళివెళ్ళి వారొక బ్రాహ్మడి యింట్లో ప్రవేశించారు.

అప్పటికప్పుడే అరవైయేళ్ళ ఆ బ్రాహ్మడు ఒక రాచకుమారుడితో చదరంగం ఆడుతున్నాడు.

ఆట చాలా బిర్రుగా వుంది. ఇద్దరూ ప్రాణాలు వొడ్డినంత కసిగా యెత్తులు వేస్తున్నారు.

ఓమాత్రాన తేలేటట్టులేదు గాని; క్షత్రియుడి ఆట కొంచెం లొగసానుగా మాత్రం వుంది.

వీరు ముగ్గురూ చూస్తూ నుంచున్నారు.

శాస్త్రీ యాజులూ తమకు తామే కూచున్నారు గాని; శంకరప్ప గోడకి చేరబడి నుంచునే వుండిపోయాడు.

ఒక్కగడియ గడిచాక శంకరప్ప యిక వోపికపట్టలేక శాస్త్రికేసి చూశాడు. శాస్త్రి రాజు కేసి తిరిగి యేదో అనబోయాడు కాని; సరిగా యీ సమయంలో, ఆ వృద్ధబ్రాహ్మడు అతి టెక్కుగా గోడకు చేరబడి "కృష్ణంరాజుగారూ! తమ యిష్టంవచ్చినవారి సలహా పుచ్చుకోండి, మరేమయినా చేసుకోండి. ఈపూటమాత్రం తమరు సరిగా యెత్తు వెయ్యగలిగితే, నా గర్వపరిహారానికి తను రెలాంటి శిక్ష విధించినా వొప్పుకుంటా" నంటూ మూతి బిగించుకున్నాడు.

వచ్చినవారిలో, యాజులు, సత్రకాయరకం అనీ, శాస్త్రి ఆటకాడే అయినా తనయెదట కూచోడానికే జంకుతాడనీ అతనికి బాగా తెలుసు. శంకరప్పని అతగా డిదివర కెప్పుడూ చూడలేదు. కాకపోయినా, ఆ వేషాన్ని బట్టి అతనొక మనిషిగానే తోచలేదు ముసలాడికి.

అంచేతనే యీ బింకం అతనికి.

ముసలాడు నిజంగా అసాధ్యుడు. దుర్వాసుల ఆదివారాహ మూర్తి అని అతని పేరు. సరాసరీ మహారాజులుంగారితో చదరంగం ఆడే గ్రామస్థులు నలుగురైదుగురిలోనూ అత నొకడు.

వారిలో వయస్సుకీ, నేర్పుకీ కొంచెం పెద్దకూడాను.

అయితే, మూర్తి ఆట జన్మాని కొక్క మాటయినా కట్టాలని కృష్ణంరాజు కెన్నాళ్ళనుంచో వుబలాటం. ఈ మాటమీద "ఇవాళ కట్టితీరా" లని పట్టుదల కలిగిం దతనికి.

కాని యేమీ పాలుపోలేదు.

వచ్చినవారి సాయం పుచ్చుకుందామా అంటే శాస్త్రీ, యాజులూ తనకే తీసికట్టు.

అతని కళ్ళు అప్రయత్నంగా శంకరప్ప కేసి మళ్ళాయి.

"మన కెందుకూ?" అనుకుంటూనే "యేవూరు తమది?" అనేశా డతను.

"మీ రూరుకోండి" అన్నట్టు శంకరప్పకేసి చూసి "కృష్ణంరాజుగారూ! వూరూ పేరూ అడగవద్దు, వారి సలహామాత్రం పుచ్చుకోండి. తాతగారిని మూడో యెత్తు వెయ్యనివ్వరు వారు" అని శాస్త్రి బదులుచెప్పాడు.

అది విని మూర్తి వెటకారంగా చిరునవ్వు నవ్వి పైగా సకిలించాడు. దాంతో రాజుకు పొడిచినంత పనయింది.

శాస్త్రీ, యాజులూ కూడా కసి పెంచుకున్నారు.

రాజు శంకరప్పకేసి చూశాడు. ఆ చూపులో "సలహా చెప్పవలసిం"దన్న ప్రార్థన లేకపోలేదు; కాని శంకరప్ప చూసీచూడన ట్టూరుకున్నాడు.

"అడగం" డన్నాడు మళ్ళీ శాస్త్రి. "సందేహించకండి రాజుగారూ!" అని యాజులు కూడా చెప్పాడు. రాజు నోరారా అడక్కపోయినందు వల్లనే శంకరప్ప వూరుకున్నాడని వారు గ్రహించేశారు.

ఈ సలహాలూ, యీ తటాపటాయింపూ, యీ బింకమూ చూసి "కాపరం కడతేరినట్టే" అన్నట్టు వెకిలి చూపు చూశాడు మూర్తి.

అది కృష్ణంరాజుకి గాయం రేపింది.

"చూస్తారేమండీ?" అన్నట్టు వురుముతూ చూశారు శాస్త్రీ, యాజులూనూ. ఊరుకోక అదిచూసి మూర్తి శిరఃకంపం చేశాడు.

"ఏమండీ, నాకు సలహో సెల విప్పిస్తారా?"

"తప్పకుండా మనవిచేసుకుంటాను."

"ఇలా దయచెయ్యండి."

"వద్దువద్దు, తమరు జరగనక్కర్లేదు."

ఇలా అని శంకరప్ప, మొదట శాస్త్రీ, యాజుల గార్ల కేసి గంభీరంగా చూశాడు. తరవాత మళ్లీ వొకమాటు బలం చూశాడు. పిమ్మట "మీకేమీ భయంలే" దన్నట్టు రాజుకేసి నిదానంగా చూశాడు. చివరికి మొగం వంచుకుని దూరంగా వెళ్ళి కూచున్నాడు.

# 8

ఎలా చూసినా అక్కడికి బలమే కాదు, బల్లా కనపడదు.

శాస్త్రికీ యాజులికీ యిదేమీ అర్థం కాలేదు.

మూర్తి బింకంగానే వున్నాడు కాని; అతనికిన్నీ యిది బోధపడలేదు. రాజు కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఏం, అలా వెళ్ళీ కూచున్నారేం?" అనడిగా డతను.

"దగ్గిర కూచుని ఆడడానికి తాతగారి ఆటలో యేమంత పసవుందీ? నేనిక్కణ్ణుంచే మనవి చేసుకుంటాను, తమరు యెత్తు వేయించండి" అన్నాడు శంకరప్ప.

శాస్త్రీ యాజులూ యిది మూర్తికి తగిన జవాబని సంతోషించారు.

"ఇదేదో వుద్దండపిడుగులా వుంది" అనుకుని రాజు దిటవు తెచ్చుకున్నాడు.

మూర్తి వారి పోకడ లన్నీ కీగంట చూసి, శంకరప్పకేసి గు–ర్–రు మంటూ చూశాడు.

ఒక్క నిమిషం యెవరూ అధరస్పందం చెయ్యలేదు.

"రాజుగారూ! కుడివైపునవున్న మన యేనుగుని వారి శకటు దగ్గిరగా వేయించండి" అని చెప్పాడు శంకరప్ప కాని; రాజుకది యిష్టం కాలేదు. అత నాయెత్తు వెయ్యలేదు. పైగా "ముందు మన రాజుని తప్పకోవాలండీ! లేకపోతే ఆట మరీ చెడుతుంది" అని వాదంలోకి దిగాడు.

"ఇదేమిటండీ?" అన్నట్టు శంకరప్ప తన కేసి చూడగా "వారు చెప్పినట్టు చెయ్యండి రాజుగారూ!" అని శాస్త్రి వొత్తిచెప్పాడు. "చర్చ మొదలు పెట్టకండి. వారేంచెబితే అది చెయ్యండి. ఇష్టం లేకపోతే తమరు సొంతంగానే యెత్తు వేయించండి" అని యాజులుకూడా కచ్చితంగా చెప్పాడు.

"అయితే వే–శాను" అంటూ రాజెత్తువేశాడు. వెంటనే మూర్తి నిర్లక్ష్యంగా యెదురెత్తు వేసి కనుబొమ లెగరవేసుకుంటూ చూశాడు.

"వారు తమ శకటు మన యేనుగు పక్క వేశారండీ"

"మనకి తెరచి రాజయిందన్నమాట. అయితే, మన యెర్రగది శకటు రాజుకి అయిమూల గదిలో పడెయ్యండి."

"వే-శాను"

"అంతేనా?"

"మరేమిటీ?"

"వారికి తెరిచి రాజయిందని చెప్పరూ?"

రాజు ఈ మాట చెప్పగా గతుక్కుమనిపోయి మూర్తిపైకి చూశాడు, పెదవి కరుచుకుంటూ

"తాతయ్యగారూ!"

"ఎందుకండీ మనుమడయ్యగారూ?"

ఇలా అని మూర్తి కళ్ళు మూసుకున్నాడు.

"ఆలోచిస్తున్నారండీ"

"తొందరపెట్టకండి."

మూర్తి వుడికిపోయాడు.

అతనికి వల్లమాలిన శౌర్యం వచ్చింది. వెంటనే బలం అంతా వొక్కమాటు కలియచూసి, వొక మా టొక బంటూ, యింకొక మాటు శకటూ. మరొకమాటు గుర్రమూ ముట్టుకుని, మూడు మాట్లూ వూగీస లాడిపోయి, చివరికి రాజుని వెనక్కి తప్పించుకున్నా డతను.

రాజు శంకరప్పకి యీ సంగతి చెప్పాడు.

"చూడండీ, స్వస్థలంలో వుండిపోయిందే మన నల్లగది శకటు? దాంతో వారి బంటు –"

"కొట్టి రాజండి."

"ఆట –"

"కట్టండీ తాతయ్యగారూ!"

మూర్తి కొయ్యయిపోయాడు.

శాస్త్రీ యాజులూ అందుకున్నాడా అన్వయించేటట్టు "సెబాస్!" అన్నారు.

రాజు మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

స్వగతాలు ముగిశాక యువకులు ముగ్గురూ శంకరప్పకేసి చూడగా, అతను, యెదటి గోడనివున్న పరశురామ పటంకేసి నిశ్చలంగా, చూస్తున్నాడు.

ఆ నిర్వికారస్థితి చూసి ముగ్ధు డయి, లేచివెళ్ళి చెవిలో యేదో చెప్పాడు శాస్త్రి.

శంకరప్ప తలవూపి వూరుకున్నాడు.

మూర్తికి రోషం కెళ్ళించింది.

దాని కది చల్లబడేటట్టు కనబడలేదు. దాంతో అతను బలం కలిపేసి "చిట్టచివర వచ్చి గారడీ చెయ్యడం కాదు ప్రయోజకత్వం! చేతనయితే మొదణ్ణుంచీ స్వయంగా యెత్తు వెయ్యమనండి" అన్నాడు.

అని మళ్ళీ తన బలం సద్దుకున్నాడు.

"ఏమి సెలవు?" అని అడిగి రాజుకూడా బలం సర్దాటప్పటికి శంకరప్ప వచ్చి కూచున్నాడు.

ఒక్క అరగడియ ఆట వడిగానే నడిచింది; తరవాత మందగించింది.

ఆ స్థితిలోకూడా మరో అరగడియ గడిచాక "యిక నాలుగో యెత్తు పడనివ్వ" నన్నాడు శంకరప్ప.

"నీకు మూడోయెత్తు చేతనయితేకదా?" అని ముదలకిస్తూ మూర్తి రెండో యెత్తు వేశాడు.

శంకరప్ప నిర్విణ్ణత నటించాడు. యువకులు తెల్లపోగా మూర్తి "గుఱ్ఱం దిగండి" అన్నట్టు శిరఃకంపం చేశాడు.

"ఎత్తు వెయ్యమంటారా" అని అడిగాడు శంకరప్ప.

"తరమయితేనూ!"

"అయితే మాట చెప్పండి."

"అడిగేదేమిటీ?"

"అయితే, యిదుగో గుఱ్ఱం యిక్క–డ–వే–శాను"

"తెరచి రాజు."

"మిమ్మల్ని నాలుగోయెత్తు వెయ్యనివ్వనన్నాను."

"నీ మాట లెక్కేమిటి జమేమిటి, వేసేశాను."

"శంకరప్ప శాస్త్రికేసి తిరిగి పెదవి విరిచాడు.

"ఏమిటీ యీ ధోరణీ" అనుకుంటూ శాస్త్రి బలం అంతా పరిశీలించి "అయ్యో, తాతగారూ, మీకు వేసిరాయిందండీ, అది సర్దుకోకుండా రాజంటారండీ?"అనడిగాడు, కొంచెం గట్టిగా మీరెలా.

తరవాత, కృష్ణంరాజు, యువకులతో కూడా శంకరప్పని తనయింటికి తీసుకువెళ్ళి, యెంతో పొగడి, యెంతో ఆదరించి "తమరు నన్ను దిద్దాలి" అంటూ రెండు చేతులూ పట్టుకుని ప్రార్థించాడు.

## 9

శాస్త్రికీ యాజులికీ నిద్ర లేదు. ఆహారం లేదు. ఈ ప్రపంచ ధోరణే పోయింది.

వారికి శంకరప్ప వుపాస్యదేవత అయిపోయాడు. గొప్ప గొప్ప ఆటగాళ్ళ దగ్గరికి అతణ్ణి తీసుకువెళ్ళడమే వారికి వృత్తి అయిపోయింది.

భక్తియోగంలో శంకరప్పకి కాళ్ళు పట్టడందాకా వెళ్ళిపోయారు వారు.

ఇలాగ వొక్కవారం గడిచింది.

ఈ వారంలోనూ పెద్దాపురంలో పేరుపడ్డ ఆటగాళ్ళు సగానికి పైగా చిత్తయిపోయారు.

శంకరప్ప వీధికి రావడం భయం. పదులు – యిరవైలు – యాభైలు చదరంగప్రియు లతణ్ణి చుట్టుకుని "మేము చూస్తాం వొక్కాట వెయ్యండీ" "మాకు మెళుకువలు చెప్పండీ" "తమరీవూళ్ళో వుండిపొండీ" "తమరొకమాటు మహారాజులంగారితో

ఆడాలండీ" "తమర్ని దివాన్జీవారికి పరిచయంచేస్తాం దయచెయ్యండీ" అని ఇలాగ ప్రార్థించడం మొదలుపెట్టారు.

"తంగిరాల శంకరప్ప" – ఇది పట్నం అంతటా – చుట్టుపట్ల కూడా రామనామం అయిపోయింది.

వూళ్ళవూళ్ళనుంచి ఆటగాళ్ళు రాసాగారు.

చూడనివారు "ఎంత పకడయిన మనిషో!" "ఎందర్ని వోడించి వచ్చాడో" "ఎన్ని తోడాలున్నాయో?" "ఎన్ని సింహతలాటం మురుగులున్నాయో?" "ఎన్ని వుంగరాలు గడించాడో?" "ఎన్ని శాలువలు కొట్టేశాడో" అనుకుంటూ చూసి, తమకళ్ళు తామే నమ్మలేకుండా వున్నారు.

ఆ వేషం బాగాలేదని అనేకులు పట్టంచులచాపు లివ్వ వచ్చారు. ఉప్పాడ జరీజామార్లు కట్టబెట్టపోయారు. బరంపురం తాపితాలు కొందరు సమర్పించపోయారు. కాశ్మీర శాలువలు కొందరు కప్పపోయారు.

కాని శంకరప్ప వొకటీ పుచ్చుకోలేదు. ఒకటీ తాకలేదు – చూడనేలేదు.

"అన్నీ పుచ్చుకుంటాను. ఒకటీ విడిచిపెట్టను. ఏదీ పోనిచ్చుకోను; కాని యిప్పుడు కాదు. ఈ స్థితిలో కాదు. ఎవరూ ఏమీ అనుకోవద్దు. ఎవరూ ఆగ్రహించవద్దు. నేను పుచ్చుకోడానికే వచ్చాను. అజీగిపుచ్చుకుంటాను" అని వారికందరికీ సద్ది చెబుతూ వచ్చాడు.

అనేకులు విందు భోజనాలకు పిలిచారు. వారికీ యిదే సమాధానం. ఇదే సద్దుబాటు.

ఎవరికీ యేమీ బోధపడలేదు. ఏమీ తోచనేలేదు.

"పెద్దమ్మ చెల్లెలి కొడుకేమోరా" "మేనల్లుడేమోనయ్యా" "మొత్తానికి దగ్గిర వాడయి వుంటాడండీ" అంటూ యిలాగ యెన్నో రకాల ప్రతిపాదనలు జరిగాయి; కాని వొకటీ నిలవలేదు. శాస్త్రీ యాజులూ కూడా యీ విషయం తెలుసుకోలేకపోయారు.

పెద్దమ్మ కూడా గాంభీర్యం వహించింది.

ఇంకొకవారం గడిచింది. సామంతులూ, సేనాధిపతులూ రాజబంధువులూ, రాజపురుషులూ, సంపన్నులూ, సరసులూ కోరి తీసుకువెళ్ళి శంకరప్పతో మళ్ళీ మళ్ళీ ఆడి, ఆటకట్టించుకుని, అదే తమకొక గొప్పగా ఆనందించసాగారు.

అతనితో ఆడడమే రాజయోగం అని ఆశ్రయించి, కనిపెట్టుకుని పడిగాపులుపడి తహతహలాడిపోసాగారు.

శంకరప్పకి శాస్త్రి దివాన్జీ, యాజులు సేనాపతీ అయిపోయారు.

రాణేదారుకిదంతా వుప్పెనగా తోచింది. దివాన్జీచెవులు తూట్లుతూట్లయి పోయాయి; కాని అత నిదేమీ యెరగనట్టు నటించసాగాడు. అయితే "మహారాజే కబురు చేస్తారేమో కొంపతీసి" అన్న భయంమాత్రం అతని కోమూల పేగులు తోడేస్తూనే వుంది.

## |10|

చీకటి పడుతూపడుతూ వుండగానే వేళాకోళాలు చేస్తూ రామసోదెమ్మ వడ్డించగా, పెద్దమ్మా, శంకరప్పా యేకబంతిని భోజనంచేసి వచ్చి అరుగుమీద కూచుని కబుర్లు చెప్పుకోసాగారు.

మరో పది ఘడియలకి శాస్త్రి వచ్చి, నట్టివాకిట్లో మంచం మీద కూచున్నాడు.

ముగ్గురూ మాట్లాడుకుంటూ వుండగా "పెద్దమ్మగారూ!" అంటూ వీధిలో నుంచి పిలుపు వచ్చింది.

"ఎవరువా?" రంటూ శాస్త్రి వెళ్ళి తలుపు తియ్యగా ఝూమ్మంటూ వీధిలో రెండు కాగడాలు, పాలకీ పదహారుగురు బోయీలూనూ. ఈటెలతోటీ, బల్లేలతోటీ పది పదిహేనుగురు భటులు, అందరికీ జవాబుగా గుమ్మం దగ్గిరగా వెండి మీసాల ముస్సద్దీ. అతనికి పక్కగా డలాయతు.

చకితుడైలేచి శంకరప్ప నట్టి వాకిట్లోకి వెళ్ళేడు. "ఇది మహారాజులుంగారి పిలుపు" అని సన్నగా చెబుతూ, పెద్దమ్మ అతనితో కూడా రెండడుగులు వేసి ఆగిపోయింది.

"ఇక్కడ తంగిరాల శంకరప్పగా రున్నారాండి?" అనడిగాడు, ముస్సద్దీ.

"ఉన్నారు."

"వారి దర్శనంకోసం వచ్చాము."

"తమరు—"అంటూ శాస్త్రి మాట తేల్చేశాడు.

"మేము చామర్లకోట శ్రీ రావు రాయడప్ప రంగా రాయణింగారి మనుష్యులం."

"దయచెయ్యండి, వారే శంకరప్పగారు."

ముస్సద్దీ కొంజా దాటి వచ్చా టప్పటికి శాస్త్రి మనస్సు వురకలు వేసింది. "వారెవరూ?" అన్నట్టు శంకరప్ప పెద్దమ్మకేసి చూశాడు. "చెబుతా" అన్నట్టు పెద్దమ్మ కళ్ళు చికిలించి, మళ్ళీ వెనక్కి రెండడుగులు వేసింది.

"నమస్కారాలు" అంటూ ముస్సద్దీ నమ్రుడుకాగా "శ్రీకృష్ణార్పణం. దయ చెయ్యండి" అంటూ శంకరప్ప మంచం చూపించాడు.

శాస్త్రికూడా "దయచెయ్యండి" అన్నాడు కాని; ముస్సద్దీ నుంచునే వుండి, మోడ్పుకేలితో శంకరప్పని చూపిస్తూ "వారి సన్నిధిని నుంచునే వుండవలసిన వాణ్ణి నేను" అన్నాడు.

"ఎంతమాట సెలవిప్పించారూ? అందరమూ కూచుందాం దయచెయ్యండి" అంటూ మంచం దగ్గిరికి వెళ్ళాడు శంకరప్ప.

శాస్త్రి వెళ్ళాడు. ముస్సద్దీ కూడా కొంతదూరం వెళ్ళాడు; కాని కూచోక చేతులు దోయిలించుకున్నాడు.

చివరికి అందరూ నుంచునే వుండిపోయారు.

మంచం మొదణ్ణుంచీ నిలువుకాళ్ళమీదే వుంది.

అప్పుడు ముస్సద్దీ చేతులు మళ్ళీ జోడించుకుని "తమరు చదరంగంలో నిధులని కోలాహలంగా వున్న జనశ్రుతి విని, తమ చాతుర్యం చూసీ, తమతో వాక్క

ఏమి టేమిటో కబుర్లు వెళ్ళాయి. ఏమి టేమిటో సంగతులు వచ్చాయి. చదరంగానికి బదులు లోకాభిరామాయణం ప్రారంభమయింది.

"చంద్రవదన అని మా వూళ్ళో వొక వేశ్య" అంటూ అందుకున్నాడు శంకరప్ప.

"ఆమె మా నాయనగారి దగ్గిర కావ్యనాటకాలంకార గ్రంథాలు నాతో క్షుణ్ణంగా చదివింది. ప్రస్తుతం ఆమె మొగలితుర్రు అస్థానంలో మన్ననలు పొందుతోంది. భ్రాతృప్రేమతో పెంచి, నన్నామె చదరంగంలో ప్రవేశపెట్టి దిద్దింది."

"సరసంగా వుంది. అంచేతనే తమ యెత్తుల్లో యీ చాతుర్యం" అన్నాడు మహారాజా.

రంగనాయికా, ఆమె సహచారిణులూ వుత్సాహంతో మొగ మొగాలు చూసుకున్నారు.

"కందనోలి నవాబుగారి వజీర్లలో వొకాయన యీ ఆటలో అఖండుడు. వయసు కాలంలో సేనావిన్యాసంలో ఆయన అసాధ్యుడిగా వుండినాడనీ, ఈ వార్ధకంలో ఆ నేర్పంతా చదరంగం ఆటలో కనపడుతోందనీ కర్ణాకర్ణిగావిని, పనికట్టుకువెళ్ళి, నెలరోజులు తంటాలుపడి ప్రవేశం సంపాదించాను. మూడు రోజులు యెన్నో పెంకిరాకడలు వచ్చా డాయన. ప్రతీ యెత్తూ నన్ను మూడు చెరవులనీళ్ళు తాగించింది."

"దేశంలో యెంతెంతవారేనా వున్నారు. అలాంటివారిని చూడాలంటే అదృష్టం వుండాలి. అయితే తరవాత యేమిజరిగిందీ?"

"నాలుగోనాడు బల్లదగ్గిర కూచోగానే కౌగిలించుకుని, నా చెయ్యి ముద్దాడి ఆయన చేసిన బహూమతీ మహాప్రభూ యిది" అని, తన మొలలో గుప్తంగా వుండిన కటారి తీసి, మహారాజా దగ్గిరగా వుంచాడు శంకరప్ప.

శాస్త్రీ, యాజులూ వులిక్కిపడి "ఇదివరకి మనకి చూపించారుకారు చూశావా?" అన్నట్టు చూసుకున్నారు.

"ఎందరు వీరాధివీరుల కవోష్ణరక్తం చవిచూసిందో యిది. లేకపోతే యీ కెంపుల కింతపూత యెలా వచ్చిందీ? మంచి సరసు డాయన" అని మెచ్చుకుంటూ మహారా జది అందుకుని పరిశీలనగా చూసి, వొరతీసి వాయి కూడా పరీక్షించి, "బాగుంది" అని అప్పలనరసింహరాజుకి అందించాడు.

"నాలుగో నాడు కొత్త ఆట వేశాం. నా యెదట కూచుని ఆడింది ఆయనే కాని, తెరచాటునుంచి సలహాలు వచ్చాయి. తెరచాటున నెమిలిపిట్ట వున్నదా అని భ్రాంతి పడ్డాను నేను. ఆట వారం రోజులు సాగింది; కాని, మహాప్రభూ! ఏమి రాకడలూ అవీ? ఏమి ప్రతిఘటనలూ అవీ! ఒక్కొక్క యెత్తు వొక్కొక్క వూపు వూపేసింది నన్ను. ఎనిమిదో సాయంత్రం, తెరచాటునుంచి తన వాడిలో పడిన యీ వుంగరం నా వేలికి తొడుగుతూ ఆయన చేసిన ప్రశంసా, తెర చీల్చుకు వచ్చిన మందహాసజ్యోత్స్నా యిప్పటికీ నాకు పులకలు రేపెడుతున్నాయి."

ఇలా చెప్పి, శంకరప్ప, యెడమచేతి అనామికనుంచి తీసి, ఆ రత్నాంగుళీయకం మహారాజా సన్నిధిలో వుంచాడు.

మరో గడియ యిలాగే గడిచాక అందరూ లేచారు.

మన్నాడుకూడా వుదయం యిలాగే గడిచిపోయింది.

తరవాత అదే మామూలయిపోయింది.

## |24|

"మనం కొంచెం జోరు చేసేశాం. తమరు వుసికొల్పడంవల్ల నేను కూడా వుద్రేకంలో పడిపోయాను" అంటూ చాలా పరితపించాడు ఆదివరాహమూర్తి.

"నేను మాత్రం యిలా అవుతుందని యెరుగుదునుటండీ? ఆ రాణేదారుగాడు నన్ను తప్పుదారిలో పెట్టేశాడండీ!" అంటూ పిసుక్కున్నాడు దివాన్జీ.

"మహారాజు దృష్టిలో క్షుద్రుణ్ణయి పోయాను నేను. నాకు తరణోపాయం కనపడ్డం లేదు."

"ఆట పూర్తికాకుండా బెంబేలుపడిపోతారేమిటండీ?"

"ఆటవేరూ శంకరప్పగారి ప్రవృత్తివేరూ కాదండీ? ఆ వినయ విధేయతలూ, ఆ సభ్యతామర్యాదలూ మహారాజుని ముగ్ధుణ్ణి చేసేస్తున్నాయి. నే నసత్యవాదినే కాదు, ఈర్ష్యాళువు నయిపోయాను. అదీకాక; ఆట యెప్పుడో పూర్తి అయిపోయింది"

"అంటే?"

"అంటే యేంవుందీ? ఇక్కడికి నెల్లాళ్ళనుంచీ ప్రతీదినమూ వుదయమూ సాయంత్రమూ వెళ్ళి బల్లదగ్గిర కూచోడం తప్ప మరేమీ పనిలేదు. మహారాజిక యెత్తు వెయ్యలేరు."

"వెయ్యలేరూ?" అంటూ దివాన్జీ మూన్పడి పోయాడు.

"వేసేం లాభమూ? ఇప్పుడు వేసిరాజు మాత్రమే ఎత్తు వేస్తే కొట్టిరాజే. అంచేతే మహారాజు తటాపటాయిస్తున్నారు."

"..............."

"ఎటుచూసినా ఆటకట్టించి ఒప్పుకోడమే మర్యాదగా కనపడుతోంది."

"మరి దారి లేదంటారా?"

"ఉంది, మహాప్రభూ! వుంది. బల్లదగ్గిరికి, బల్లదగ్గిర్నుంచి కావలసినంత దారి!"

☆ ☆ ☆

"మరి చాతుర్యం కళ్ళారా చూస్తున్నావు నువ్వు."

"అవును, చూస్తున్నాను."

"రోజూ రెండుపూటలా వారిదర్శనం అవుతోంది నీకు."

"ఆహాఁ– అవుతోంది."

"వారు మీ యింటికి విజయం చేశారు"

"నీకు కనపడుతూవున్నదీ, నిన్నూరిస్తూవున్నదీ యిదే; కాని, దీనివల్ల నాకు కలిగిన మహాభాగ్యం యమయాతన మాత్రమే అని యెరగవు నువ్వు."

ఇది విని అలివేణి వులిక్కిపడింది.

"పందిట్లో నుంచునివుండి పందిట్లోనుంచే వెళ్ళిపోయారు వారు. నా చైతన్యం అంతా వారివెంటే వెళ్ళిపోయింది. ఇప్పుడు నీయెదట వున్నది రంగమ్మ కట్టె మాత్రమే!"

ఈ మాటతో రంగనాయిక కంఠంలో గద్గదిక అంకురించింది. అలివేణి కళ్ళు అనిమిషా లయినాయి.

"రెండుపూట్లా వారిదర్శనం అవుతోంది కనక, కర్పూరవిడెం సమర్పించుకునే మునివేళ్ళ స్పర్శ అయినా అవుతోంది కనక, యెప్పుడైనా వొక్కొక్కమాటు, వారు, కాటుక కళ్ళ నిండా చూస్తున్నారు కనుక రంగమ్మ నింకా నువ్వు చూడగలుగుతున్నావు"

"నా కందులో సహస్రాంశమూ లేదుగా?"

రంగనాయిక క్షణం ఆలోచించి "శాస్త్రుల్లుమామయ్యగా రున్నారుగా? వారి నాశ్రయించరాదూ?"అంది.

"అదీ అయింది. ఈ ఆటసంగతి తెలితేగాని, వారు మాట్లాడరన్నారన్నయ్యగారు" అని అలివేణి మొగం వేల వేసుకుంది.

"ఒక్కపనిచెయ్యి."

"ఏమి టదీ?"

"తెల్లవారితే యిటు మహారాజు కొలువు. దీపాలు పెడితే అటు వారి రాక. కనక నాకెలాగా యోగం లేనట్టే. నువ్వు బసకే యెందుకు వెళ్ళగూడదూ?"

"శాస్త్రం చెప్పినట్టుంది నీ సలహా."

"అదేమే?"

"పెద్దమ్మగా రంటే వారికీ భయమే. అన్నయ్యగారికీ భయమేటు!"

"పాదసేవకీ అభ్యంతరం వుంటుందా?"

అలివేణి "అవునుసుమా" అంటూ యెగిరిపడి "నువ్వు చెప్పింది బాగుంది. ఇక ఆప్రయత్నం చేస్తాను. ఆ యేర్పాటు చేసేదాకా అన్నయ్యగారి పాదాలు వదలను" అంది.

"అదేవిధంగా చివరికి నాకేనా అదృష్టం—"

"నా కంత అదృష్టం పడితే నీకూ పట్టిం దన్నమాటే. మొదటిరోజున నిన్ను తీసుకునే వెడతాను."

"అయితే, మధ్యాహ్నం రెండు జాములవేళ మామయ్యగారి నోమాటు మీ యింటికి రప్పించగలవా?"

"వో! నిమిషంలో రప్పిస్తాను, మా అమ్మ తీసుకువస్తుంది."

"అట్నుంచి నరుక్కువద్దాం. నాకు వేళ అయింది, వెళ్ళిపోవాలి, యిక నువ్వు వెళ్ళు."

ఇద్దరూ వొకమాటు గంభీరంగా చూసుకుని "సంయే" "సంయే" అనుకుని, అభీష్టం నెరవేరినట్టే ఆనందిస్తూ అలివేణి యింటికి వెళ్ళిపోగా, వుపక్రమణిక ఆలోచించుకుంటూ రంగనాయిక వెళ్ళిపోయింది.

☆ ☆ ☆

"ఏ మౌద్దంటారు బాబయ్యా?"

"ఏమిటోయ్ అయేది? మహారాజే నెగ్గేస్తారు. వాడి తలకాయ దగ్గిర వుండి, కోట కొమ్మలికి నేను కట్టిస్తానిక మాదిగ అమ్మిగాడిచేత" అంటూ వెన్ను విరుచుకుని మీసం మీద చెయ్యివేసుకున్నాడు రాణేదారు.

"అంతమాట అనెయ్యకండి బాబయ్యా! ఇదివరకే తొందరయిపోయిం దికనేనా జాగ్రత్తగా వుండడం మంచిదండి."

"అయితే, యే మంటావ్?"

"ప్రభువ్వారు నెగ్గలేరుటండి. నెగ్గడందాకా ఎందుకూ, కాయే కదపలేరుటండి?"

"అఁ!"

"సూరపురాజు బాబయ్య సెలవిప్పించారండి. ఆట కట్టిపాయేవుందిట దేవరా!"

"కొంపతీసి గోచీపాతగాడు నెగ్గేస్తాడా యేమిటి?"

"మనవి చేసుకున్నాను కాదండీ? అలాంటి మాటా రానియ్యకండి బాబయ్యా! దేవిడీ మన్నా అయిందంటే—"

"ఓరి నీ యిల్లు—"

రాణేదారు నో రెండిపోయింది.

"పైకి దయచెయ్యండి బాబయ్యా!" అన్నాడు చల్లా జగ్గప్ప మెట్లకేసి చూపిస్తూ.

"అప్పుడే శంకరప్పగారు వచ్చారా యేమిటి?" అని సూరపరాజూ, "యెత్తేమయినా పడిందా?" అని ఆదివరాహమూర్తీ వొక్కమాటే అడిగారు.

ఇద్దరికీ "లేదండి బాబయ్యా!" అని వొకటే జవాబు.

"మరేమంటావోయ్?"

"ఏమీలేదు, పైకి దయచెయ్యండి."

"ప్రభువు—"

"ఈపాటికి నల్ల చెరువుదగ్గిరికి చేరుకుంటారండి!"

"అదేమిటి?"

"ప్రభువ్వారూ, శంకరప్పగారూ. అప్పలనరసింహరాజు బాబయ్యా వేటకి—"

"మరి ఆట?" అని అడిగాడు మూర్తి.

"శంకరప్పగారికి వేటకూడా అలవాటుందా యేమిటి?" అని ఆశ్చర్యపడుతూ అడిగాడు సూరపరాజు.

ఇంతలో "వేటేమి టండోయ్?" అంటూ వెంకటరాయుడు వచ్చాడు.

జగ్గప్ప వివరాలు చెప్పాడు.

దానిమీద "అయితే యిక మేము పైకెందుకూ వెళ్ళడం?" అనడిగాడు మూర్తి.

"ఎత్తేమయినా దొరుకుతుందేమో పరకాయించమని సెలవయింది బాబయ్యా!"

"ప్రభువ్వారికి తోచనియెత్తు మనకా తోస్తుంది?" అని అన్నాడు వెంకటరాయుడు.

"ఎత్తుతోచడం సర్వాబద్ధం. ఇక వున్నదల్లా యేమిటంటే! ప్రభువులేరు కనక, బలంచూస్తూ మనం ధారాళంగా చర్చించుకోవచ్చు. ఇది కాదని అదీ, అది కాదని యిదీ యెత్తువేసీ చూడవచ్చు."

సూరపరా జిలా అనగా "బలం యేమాత్రం కలిసిపోయినా మన పరువు దక్కదండోయ్!" అన్నాడు మూర్తి.

"పై నెవ రున్నారు జగ్గప్పా?"

"బంగారపు బలం యెలా వుందో అలాగే దంతపు బలం సర్ది వుంచింది అలాయిదాగా రంగనాయిక. నాగరత్నం కూడా పైనేవుందండి. వీరభద్రమూ విరిబోణీ వచ్చే వేళయిందండి."

"బలికాం మరి తొరగా పదండి" అంటూ మెట్లకేసి తిరిగాడు బోసినోరు చప్పరించుకుంటూ మూర్తి.

సూరపరాజు మెట్లదగ్గిరికి బయలుదేరి "వెంకటపతిరాజు దద్దయ్యగారుంటే బాగుండును. అన్నట్టు విజయరామరాజుగారూ?" అని అర్థోక్తిలో వుండగా, "వారు భీమవరపుకోట వేంచేశారు బాబయ్యా! మళ్ళీ పదిరోజుల్లో దయచేస్తారండి. వెంకటపతిరాజు బాబయ్యకీ, అప్పలాచార్యు లయ్యవార్లం గారికీ, మల్లికార్జునలింగం అయ్యవార్లంగారికీ కభురు వెళ్ళింది. తమరు దయచెయ్యండి, రాగానే పైకితీసుకు వస్తావార్ని" నంటూ జగ్గప్ప బయలుదేరాడు.

వారు ముగ్గురూ యేకవరసన మెట్లెక్కేశారు.

☆ ☆ ☆

రోజులు కాదు, వారాలుకాదు, మాసాలే ఆరు గడిచిపోయాయి; కాని, యెత్తు పడలేదు. దారీ దొరకలేదు. ఆశే అంతరించిపోయింది.

ఈ అరుమాసాల్లోనూ యెక్కడి కెక్కడికో కభుర్లు వెళ్ళాయి. ఆహూతులూ, అనాహూతులూ యెవరెవరో యెంద రెందరో ఆటగాళ్ళు వచ్చారు.

ఎన్నో పరిశోధనలు చేసి, యెన్నో మాట్లు రకరకాల యెత్తులు వేశారు. కాని, బంగారపుబలం బంగారపుకొండ అయి అలాగే ఉండిపోయింది.

కోటలో బంగారపుబలం యెలావుందో అలాసర్దుకొని మూర్తి వగైరాలు తమ యిళ్ళల్లో కూడా తీవ్రప్రయత్నాలు చేశారు.

ఒక్కొక్క బల్లదగ్గిర పదేసి మందీ, యిరవయ్యేసి మందీ నలుగుళ్ళు పడ్డారు.

పెద్దాపురానికి పెద్దాపురమే వుడికిపోయింది; కాని ప్రయోజనం కలగలేదు.

చివరికి, మహారాజుకి, నిద్రాహారాలు కరువయిపోయాయి. రాచకార్యాలమీద వెగటున్నూ పుట్టింది.

# 25

కరకర పొద్దుపొడిచింది.

ఎర్రని సూర్యబింబం, పొగనింపి అప్పుడే వెలిగించిన కాగితబ్బుట్టలాగ మెల్లిగా పైకి లేవసాగింది.

దేవిడిలో ఝూంఝుకారా మంటూ నగారా మోగిపోసాగింది.

ఊళ్ళో శివాలయంలో రుంజలు, ఆ నగరాకి జవాబివ్వసాగాయి.

బురుజుమీది నరసింహస్వామి ఆలయం పసిడికుండ, జిగజిగ మెరిసిపోతోంది.

ఘంటాపథాలన్నీ అసివారులు బయలుదేరిన అశ్వికులతో నిండిపోయి వున్నాయి.

సాలలు బాగుచెయ్యడంకోసం, కోటలో బయట కట్టివున్న మదపుటేనుగులు ఘీంకారాలతోటీ, పారశీకాశ్వాలు సకిలింపులతోటీ అన్నదాతలను ఆహ్వానిస్తున్నాయి.

అగడ్తలో, తమ్మిచెర తప్పించుకుని, మహోల్లాసంతో పాటలు పాడుకుంటూ గండుతుమ్మెదలు పూలతోట కొల్లగొట్టడానికి కోటలో చొరబడుతున్నాయి.

ఇలాంటి సమయంలో, సాముగరిడీలు చాలించి, మహారాజు అప్పుడే స్నానపు గదిలో ప్రవేశించాడు.

నూనెజిడ్డు వదలడానికి ఇద్దరు గుబ్బెతలు సుగంధ చూర్ణంతో నలుగులు పెడుతున్నారు.

ఒకతె సువర్ణకలశం పట్టుకుని గంగాళం దగ్గిర నుంచుంది.

మరొకతె ఆ గంగాళంలో నీళ్ళు తొరుపుతూవుండగా యింకొకతె అందులో పన్నీరు గుమ్మరిస్తోంది.

వేరొకతె, వుండుండి చెయ్యిపెట్టి నీళ్ళు పాళాలు చూస్తోంది, పరిశీలనగా.

ఇంకొకతె కొంచెం దూరానునుంచుని చెంగావిపంచెకి చుంగలు సవరిస్తోంది.

మరొకతె అందరిమీదా కళ్ళతో అధికారం చెలాయిస్తూ, ఆజ్ఞలకోసం యెదురుచూస్తూ కొంచెం పక్కగా నుంచునివుంది.

మానసికాందోళనవల్లా, సుఖస్పర్శవల్లా కళ్ళు మూసుకుని, మొగం కూడా వంచుకునివున్న మహారాజు హఠాత్తుగా మెరుపుకొట్టినట్టయి ఆమెకేసి చూశాడు.

వెంటనే "చిత్తం మహాప్రభూ!" అంటూ ఆమె సావధాన అయింది.

"చల్లా జగ్గప్ప – నుంచున్నట్టుగా" అని కొంచెం ఆత్రంగా చెప్పి, మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు మహారాజు.

ఆజ్ఞ అంచెనోళ్ళమీద వెళ్ళింది.

జగ్గప్ప యెగిరివచ్చి "హాజర్ మహాప్రభూ!" అంటూ దోసిలి వొగ్గి నమ్రుడయినాడు.

కళ్ళు తెరవకుండా మొగంమాత్రం అటుతిప్పి, "జగ్గప్పా?" అన్నాడు మహారాజు.

"చిత్తం మహాప్రభూ!"

"ఎలావున్నాసరే, శంకరప్పగారిని నిమిషాలమీద తీసుకురావాలి."

"తీసుకువస్తాను మహాప్రభూ!"

"పాలకీఅయితే ఆలస్యం అవుతుంది. గండభేరుండాన్ని తీసుకువెళ్ళు."

"చిత్తం చిత్తం."

"ఇంకా నుంచున్నావు!"

"లే–ద్–ము–"

జగ్గప్ప మాటకంటేముందే వుడాయించాడు.

"తొరగా తెమల్చాలి" అన్నట్టు పరిచారికలకేసి చురుగ్గా చూశాడు మహారాజు.

## 26

స్నానసంధ్యాద్యనుష్ఠానాలన్నీ ముగించేసుకుని, ఆరివున్న అంగావస్త్రాల జత ధరించి, మిత్రుల కిద్దరికీ మధ్యగా, కవాచీ బల్లమీద కూచునివున్నాడు శంకరప్ప.

కొంచెం పక్కగానూ, పడమటింటి గుమ్మానికి చేరికగానూ పెద్దమ్మా, లోగుమ్మంలో తలుపు ఆనుకుని రామసోదెమ్మా, మండువాదక్షిణపుటంచున గోడ ఆనుకుని అలివేణీ రంగనాయికా నుంచుని వున్నారు.

"చెల్లాయిది ఆరుమాసాల తపస్సు; రంగనాయికదిన్నీ ఆపాటిదే కనక, మీరీపాటికి వరదలు కావడం ధర్మం" అన్నాడు శాస్త్రి.

అలివేణి దోసిలి వొగ్గింది.

"సంగతి సందర్భాలన్నీ మామయ్య గారితో మనవి చేసుకునే వున్నాను. మళ్ళీ యిలాంటి అవకాశం యెప్పటికో? అంచేత నే నాదుర్దా పడిపోతున్నాను" అంది జాలిగా రంగనాయిక.

"మిమ్మల్ని నిర్బంధించడానికి మేము చాలం; కాని, మీరివాళ దయచెయ్యక తప్పదు. బాహాటంగా అంగీకరించడం తరవాయిగా మహారాజు వోడిపోయే వున్నారు. ఆ కాస్తా అయిపోయిందనుకుందాం. ఇక మీతో యెత్తువెయ్యడాని కెవరికి గుండెలు తాళుతాయి? కనక మీరివాళ 'ఊం' అనాలి, తప్పదు" అని యాజులు వొత్తిచెప్పాడు.

దానిమీద "యిక తప్పేటట్టు లే"దన్నట్టు శంకరప్ప పెద్దమ్మకేసి చూశాడు. అది గుర్తించి "పెద్దమ్మగారి అనుగ్రహమూ మాభాగ్యమూనూ" అంది అలివేణి.

"వెర్రిపిల్లవు, జగత్పండితుడైన నా వరహాలమూటకి నేనా చెప్పగలదాన్ని?" అంటూ పెద్దమ్మ రామసోదెమ్మ కేసి చూడగా, ఆమె శంకరప్పకి మాత్రమే కనపడేటట్టు విభ్రమ విలాసాలు మొలిపించి తలుపుచాటున నక్కింది.

దాంతో శంకరప్ప కళ్ళల్లో వింతతేజస్సు మెరిసి, అలివేణి కనుదమ్ములకు వికాసంయిచ్చి, రంగనాయిక చెవులకు మధుర శబ్దం అందించింది.

ఈ సమయంలో కొంజాదగ్గరనుంచే "పెద్దమ్మగారూ!" అంటూ పిలుపు వినిపించింది. వెంటనే గుమ్మంలోకి వెళ్ళి పెద్దమ్మ "యేం జగ్గప్పా?" అనడిగింది.

వచ్చినమనిషి జగ్గప్ప అని తెలవడంతోటే నాలుక కరుచుకుంటూ రంగనాయికా, అలివేణీ తూర్పింటోకి దూరారు.

"దండాలు బాబయ్యా! దండాలండి, దండాలండి."

"శుభం...ఏమోయ్, తెల్లవారకుండా వచ్చావూ?"

"ప్రభువ్వారు తరిమిపంపారు దేవరా! నుంచున్నపాళంగా తోడితెమ్మని సెలవు. పాలకీ అయితే ఆలస్యం అయిపోతుందని గండభేరుండం పంపారు. ఈపాటికి సగందూరాన వుంటుందండి."

"అంత వులకం యేమిటోయ్?"

"తెలవదు బాబయ్యా"

తదేకదృష్టితో చూస్తూ "విసుగ్గా వున్నారా?" అని అడిగాడు శంకరప్ప.

"లేదం"డన్నాడు జగ్గప్ప.

"ఏంచేస్తున్నారు?" అనడిగాడు యాజులు.

"స్నానప్రయత్నంలో ఇంకా నలుగుల్లోనే వున్నారండి!"

శంకరప్ప చిరునవ్వు బిగపట్టుకుని, మిత్రులకేసి బెల్లింపు చూపులు చూశాడు.

"ఏదో యెత్తు తోచింది, మరి లేవండీ!" అంటూ యాజులు లేచి నుంచున్నాడు.

చిరునవ్వు నవ్వుతూ, పెదవి విరుస్తూ, తల అడ్డంగా వూపుతూ తొంగిచూసి రంగనాయిక మళ్ళీ దాక్కుంది.

"అదిగో గండభేరుండం బాబయ్యా!" అన్నాడు జగ్గప్ప.

శంకరప్ప నిశ్చలంగా అలాగే కూచుని వున్నాడు.

అదిచూసి "లే, యింకా జాప్యం చేస్తావేం నాయనా?" అంటూ పెద్దమ్మ తొందరపెట్టింది.

అప్పుడు, మొగంపక్కకి తిప్పుకుని, కిందికిచూస్తూ వొక్కమాటు తల పంకించి, తాపీగా మళ్ళీ మొగం తిప్పుకుంటూ "జగ్గప్పా!" అంటూ అందుకున్నాడు శంకరప్ప.

"చిత్తం బాబయ్యా!"

"శంకరప్ప వీనుగెక్కేగాని, గుర్రంయెక్కి వెళ్ళడోయ్!"

అదేదో బోధపడక జగ్గప్ప తెల్లపోయాడు.

శాస్త్రీ యాజులూ మొగమొగాలు చూసుకున్నారు.

పెద్దమ్మ శంకరప్పని విడిచి జగ్గప్పనీ, జగ్గప్పని విడిచి శంకరప్పనీ చూడసాగింది

"కనక నువ్వు వెళ్ళిపోవచ్చు."

"వెడతాను దేవరా!" అంటూ చేతులు నలుపుకున్నాడు జగ్గప్ప.

"ఈమాటే మనవిచెయ్యి ప్రభువ్వారితోటి"

"చిత్తం చిత్తం" అంటూ నసిగాడు జగ్గప్ప.

"ఇంక గండభేరుండం యెందుకూ?"

"పాలకీ—"

"ఇప్పటికంతే మరి"

"సెలవు బాబయ్యా!"

"శుభం!"

"దండాలండి, దండాలండి, దండాలండి!"

బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి జగ్గప్ప గుర్రం యెక్కాడు గుర్రాలు మేఘాలెక్కాయి.

## 27

"అరుమాసాల ఆందోళనవల్ల, గుర్రం కదిపితే యేనుగుతో తెరచి రాజవుతుం దన్నసంగతి మరచిపోయారు ప్రభువ్వారు" అని కళ్ళు చికిలించుకుంటూ, జగ్గప్పలావెళ్ళీ వెళ్ళడంతోటే రంగనాయిక మళ్ళీ వాకిట్లోకి వచ్చింది.

"శాబాసు" అంటూ ఆమె వెనకనే అలివేణిన్నీ వచ్చింది

"ఏమిటీ?" అంటూ యాజులూ, "అవును సుమా!" అంటూ శాస్త్రీ వూగిపోయారు.

అది శంకరప్పకి వుద్రేకం కలిగించింది

ఆరుమాసాలుగా బలవంతాన అణిగి వుండిన వుత్సాహం అంతా వొక్కవూపున కట్టితెంచుకుని వురికి, శంకరప్పని గుంజిగుంజి విడిచిపెట్టింది.

దాంతో "మనం నెగ్గేశామండీ! మహారాజివాళ తమ వోటమి వొప్పేసుకుంటారండీ!" అంటూ చంటిపిల్లాడిలాగ పరవళ్ళు తొక్కి, అమాంతంగా వెళ్ళి పెద్దమ్మ కాళ్ళదగ్గిర చతికిలబడ్డా డతను.

పెద్దమ్మకిన్నీ వుత్సాహమూ, ఆనందమూ వెల్లివిరిసిపోయాయి.

వెంటనే శంకరప్పని పొదివిపట్టుకుని "నా తండ్రే! నా బాబే! ఈ మాట వినడానికే కనిపెట్టుకుని వున్నాను నాయనా, నేను. నా కళ్ళు చల్లబడ్డాయి బిడ్డా!" అంటూ వుద్వేగంతో మూర్ధాఘ్రాణం చేసిందామె.

అది చూసి అలివేణి "యిదంతా పెద్దమ్మగారి చేతిచలవ" అనగా "యింకా సందేహమా?" అంటూ ఆవేశంతో అందుకున్నాడు శంకరప్ప.

"మీరంతా శంకరప్ప మహా తెలివయినవా డనుకుంటున్నట్టుంది, ఇదంతా శంకరప్పప్రజ్ఞ అనుకుంటున్నట్టూ వుంది; కాని, అసలు శంకరప్ప ఆదిలోనే మొగం వేల వేసేశాడు. ఇప్పుడు మీయెదుట వున్న శంకరప్ప పెద్దమ్మ ప్రాణప్రతిష్ఠచేసి విడిచిపెట్టిన పిండిబొమ్మ. నిజంగా పెద్దమ్మే కటాక్షించి వుండకపోతే, శంకరప్ప యెవరో, మీరెవరో, మహారాజెక్కడో, యీ గొడవ అంతా యేమిటో! ఎన్ని జన్మలెత్తి యెంత సేవ చేసినా నేను పెద్దమ్మరుణం తీర్చుకోలేను. పెద్దమ్మ శక్తి యావూళ్ళో యెవరెరుగుదురూ? మహారాజు నాకోసం పాలకి పరివారమూ పంపారంటే – సేనాధిపతినే పంపారంటే అది పెద్దమ్మవేసిన ఎత్తుకి ఫలితం. ఎందుకని దయతలిచి ఆవేళ వారు రాగానే నన్ను పంపించిందిగాని, పెద్దమ్మ వొకరోజు బెట్టుసరీ చూపిస్తే మహారాజే పాదచారి అయి రాకపోదురా వెతుక్కుంటూను? ఆదిలో పెద్దమ్మ వేసిన యెత్తే యిప్పుడు మహారాజు ఆట కట్టించిందనుకోండి. నామరూపాలులేక గాలి కెగిరి వచ్చిన యీ దూదిపింజెని 'మనిషి, వుక్కుతునక' అనిపించింది పెద్దమ్మ. దివాన్జీ నౌకర్లచేత యీడ్చులుపడ్డ శంకరప్పకి పెద్దాపురం మహారాజుచేత తహజీ మిప్పించింది పెద్దమ్మ. అంటే – నా పెద్దమ్మ ఆదిశక్తి అని యిప్పుడేనా తెలిసిందా మీకు? నా పెద్దమ్మ నా యిలవేల్పు."

ఇలా అంటూ పరవశు డయిపోయి కళ్ళుమూసుకుని అతను పెద్దమ్మ పాదాలమీద వాలాడు.

అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి.

శాస్త్రీ, యాజులూ, అలివేణీ, రంగయికా పెద్దమ్మ కేసి చూస్తూ అప్రయత్నంగా దోసిళ్ళు వొగ్గారు.

కళ్ళు తుడుచుకుంటూ వచ్చి, పెద్దమ్మమీద ఒక చెయ్యి అనుక్కొచుని, రామసోదెమ్మ బోర్లాపడుకుని వున్న శంకరప్ప వీపు నిమిరింది.

అప్పటికి పెద్దమ్మకి మాట తిరిగింది.

"అన్నం అమ్ముకుంటూ పొట్టపోసుకునే ముసలిముండ యింతపని చెయ్యడం యెక్కడేనా వుందా? కనక నా వెర్రితండ్రి మాటలు మీ రెవరూ నమ్మకండి నాయనా! 'చేతిలో యెర్రని యేగానిలేదు. మహారాజుని ఆశ్రయిద్దామని వచ్చాను. అన్నం పెడతావా పెద్దమ్మా!' అంటూ వచ్చాడు నా తండ్రి. ఆ దైన్యంలోనే ఆ మొగంమీద నాకు దేవతాకళ కనపడింది. 'నీ కొడుకనుకో' అని యెవరో చెవిలో చెప్పినట్టయింది. దీనికి సాయం నా మేనగోడలు – యీ వెర్రిపిల్ల 'కట్టుకోడానికి

బట్టలు కూడా లేనట్టుంది అత్తా — మొగం కలకల్లాడుతోంది, గొప్పవాడు కామోసు, వొప్పుకోవమ్మా!' అంటూ పాకులాడింది. లేదనలేకపోయాను. పెట్టాలని వుంటే పదిమంది తిని పోయేచోట గుప్పెడన్నమే మిగలకపోతుందా? 'నీకు లోటు లేదు, రా, నాయనా!' అన్నాను. అది విని పొంగిపోయాడు నా తండ్రి, అప్పుడే మొదలు ఈ పడిపడి దణ్ణాలికి. చిట్టి తండ్రికి నేనంటే యేదో వెర్రిభక్తి కుదిరిపోయింది ఇంతకీ నా తండ్రికి జయం కలిగింది — నాకు కావలసిందదే" అందామె.

అప్పటికి ప్రకృతిలో పడి లేచి కూచున్నాడు శంకరప్ప.

వెంటనే రామసోదెమ్మ పడమటింటోకి వెళ్ళిపోయింది

తరవాత "నౌకర్లచేత యీడ్పులు పడ్డం యేమిటో కూడా చెబితేగాని వల్లకా"దంటూ వెళ్ళి శంకరప్ప రెండుచేతులూ పట్టుకున్నాడు శాస్త్రి.

యాజులుకూడా మొండిపట్టు పట్టాడు

పెద్దమ్మా శంకరప్పా వొక్కమాటు చూసుకున్నారు.

ఆ చూపుల్లో మెరుపుతీగలు పాకిపోయాయి

వెంటనే ఒక్కమాటు కంఠం సవరించుకుని శంకరప్ప జరిగిందంతా చెప్పేశాడు.

విని విని "దివాన్జీకీ, రాణేదారుకీ పుట్టగతులుంటాయా?" అంటూ పెద్దమ్మ పళ్ళుకొరికింది.

అలివేణీ రంగనాయికా కంటతడి పెట్టుకున్నారు

"ఈ తుచ్ఛుల్ని దేవిడీమన్నా చేయించవలసిందే!" అంటూ శాస్త్రీ, యాజులూ అగ్గయిపోయారు.

ఇంతలో పాలకీ వచ్చింది

ఒక్కమాటు రంగనాయికనీ, అలివేణినీ చూసి పెద్దమ్మ శంకరప్పకి కనుసన్న చేసింది.

వెంటనే "అలివేణీ! రంగనాయికా!" అంటూ మహోత్సాహంతో లేచి అత నందుకున్నాడు.

"ఇప్పటికి నేను వచ్చినపని అయింది. అనుకున్నదీ నెరవేరింది. ఇక యేది యేమయినా యిబ్బంది లేదు. అదివరకెందరితో ఆడినా, మహారాజుతో యెత్తు వేశాక అటో యిటో అది తేలిపోయేదాకా మరెవరితోటీ ఆట వెయ్యకూడదనుకున్నాను. శాస్త్రిగారి తోటీ యాజులుగారితోటీ కూడా ఆడలేదంటే యిక చెప్పడానికేం వుందీ? ఇక ఆ వ్రతం పూర్తి అయినట్టే; కనక యివాళ రాత్రి—తెలిసిందా? ఇక మీ యింటికి వచ్చి యెత్తు వేస్తాను. మీ కోరిక తీరుస్తా"

శాస్త్రీ యాజులూ చాలా ఆనందించారు.

అలివేణీ రంగనాయికా పొంగిపోయి, అంతలో కొంచెం సిగ్గుపడ్డారు

ఈ సమయంలో చాకలి పెద్ద వచ్చి "హాజర్ బాబయ్యా!" అని విన్నవించి పాలకీ దగ్గరికి వెళ్ళిపోయాడు.

అందరి దగ్గిరా సెలవు పొంది, కళ్ళు తిప్పుకుంటూ శంకరప్పని పొగుడుతూ రామసోదెమ్మ దారి చూపించగా "అలాగాండి? బాగుందండి. అవును, మంచిబట్టలే

వుంటే వారియెదట రాచ కౌమార్ళ విశేషం యేమిటండి? మీ మేలు మరిచిపోరండి వారు దీపాలు పెట్టాటప్పటికివాళ భోజనం పెట్టించండేం అక్కయ్యగారూ!" అని గునిసి, రంగనాయిక, దొడ్డిదారిని కోటకి వెళ్ళిపోయింది

ఆమె కోట సమీపిస్తుం దన్నంతవరకూ జాప్యం చేసి శంకరప్ప లేచాడు.

వెంటనే అలివేణి అతని పాదాలు అంటి కళ్ళకద్దుకుని, ఒక్కమాటు అతనికళ్ళల్లోకి సవిలాసంగా చూసి, తానే కరిగిపోయి, నునుసిగ్గుతో పక్కకి తప్పుకుంది.

"అబ్బాయోయ్! అగ్రహారం. జ్ఞాపకంవుందా? మరోటయితే నే నొప్పను సుమా!" అంటూ పెద్దమ్మ సాగనంపగా, శాస్త్రీ యాజులుగార్ల బుజాలమీద చేతులు వేసుకుని పున్నమ చంద్రుడులాగ మెరిసిపోతూ శంకరప్ప పాలకీ దగ్గిరికి బయలుదేరాడు.

## 28

పాలకీలో కాలు గుమ్మంలో పెట్టాటప్పటికి వ్యూచలాగ వచ్చి మహారాజు శంకరప్పని కౌగలించుకున్నాడు.

కళ్ళు తెరిచి చూశాటప్పటికి ఆ కౌగిలింతతోనే యిద్దరూ సింహాసనం మీద కూచుని వున్నారు. మహా విలవ అయిన తలకాయకు తగినసత్తాలేక, దివాన్జీమెడ జవజవలాడి తోటకూరకాడ అయిపోయింది

సభ్యులందరి కంటే ముందు తన కంఠం సవరించుకుని "శంకరప్పగారూ!" అని సంబోధించాడు మహారాజు.

"ఏమిసెలవు జగత్ప్రభూ!" అని శంకరప్ప దోసిలివొగ్గాడు.

"తమరు నా ఆట కట్టేశారండీ"

"ఎంతమాటా! నిర్హేతుకజాయమాన కటాక్షంవల్ల తమరలా సెలవిప్పిస్తున్నారే కాని, యేలినవారి ఆట కట్టడానికి నేనెంతవాణ్ణి మహాప్రభూ?"

"అలాకాదండీ! స్పష్టంగా నేనోడిపోయాను. చదరంగంలో నాకిదే మొదటి వోటమి. ఓటమివల్ల మనుష్యుల మానసికావస్థ లెలాపరిణమించేదీ నాకిప్పుడే బోధ అయింది. అయితే, ప్రతిపక్షి రసికుడైతే వోటమికూడా ఆనందకరంగా వుండేటట్టు కనపడుతోందండీ!"

"ఒక్క మనవి మహాప్రభూ!" అంటూ అందుకున్నాడు అప్పలనరసింహరాజు.

"నా అంచనా తప్పిపోలేదు. తమ రుభయులూ ఆటకి కూచుంటే యెవరోడినా పర్యవసానం యిలాగే వుంటుందని నే నాదిలోనే నిశ్చయించుకున్నాను. అంచేతే యెంత జంకినా, శంకరప్పగారిని నేను బలవంతపరచగలిగాను. ఆరుమాసాల తీవ్రస్పర్ధకి ఫలితంగా, చివరికి, విజితులూ విజేతలూ కూడా సమంగా ఆనందించడం – యిది మానవ ప్రవృత్తికి అతీతమైన విషయం."

"తమరింకొకటికూడా సెలవిప్పిస్తారని తలుస్తున్నాను."

"చిత్తం మహాప్రభూ, మనవి చేసుకుంటున్నాను. ఈ ఫలితానికి సన్నికృష్ణకారణం శంకరప్పగారి ప్రవృత్తిన్నీ. ఏమంటే? శంకరప్పగారి యీ విజయం సామాన్యమైనదా?

కాని, దానికి సంబంధించిన పొంగు లేశమయినా వారిదగ్గిర కనపడుతోందా? వారి మొగంమీద యెంత స్వాతికతేజస్సు భాసిస్తోందో చిత్తగించారా?"

"అదీ సంగతి. దానివల్ల పరిసరాలన్నీ అకలుషాలయినవి బ్రహ్మ తేజస్సంటే అదేకదూ?"

"చిత్తం చిత్తం!"

దీనిమీద చేతులుజోడించుకుని "శ్రీహరీ! మాటలురాని కొండికవాణ్ణి పట్టుకుని యిద్దరు ప్రభువులు అలా సెలివిప్పించడం ధర్మమా?" అంటూ అందుకున్నాడు శంకరప్ప; కాని, మాటకి అడ్డంవచ్చి మహారాజు "ఇద్దరు కాదెంత మందయినా యీ పని చెయ్యవలసిందే. ఏమంటే, నిజంగా చదరంగం ఆడతగ్గవారు తమ రొక్కరే కనబడుతున్నారు. ఇందులో తమర్ని జయించగల వాడింతవరకూ పుట్టలేదు, ఇకముందూ పుట్టబోడు" అన్నాడు

శంకరప్ప మొగం వంచుకున్నాడు.

"తమచేతిలో అపజయం పొందడంకూడా వొక భాగ్యంలోనే లెక్ఖ!"

"................"

"మనస్సు నిలుపుకోలేక ఆట వెయ్యడమేకాని, యెవరితో వేసినా చంటిపిల్లలతో ఆడుతున్నట్టే వుండేది. తమతో ఆడ్డంమాత్రం కత్తులమీద పరీక్షా, నేలవిడిచి సామూనూ!"

"ఇప్పటిదాకా నేనున్నూ –" అంటూ మోడ్పుకేలితో ప్రభువుకేసి తిరిగి అందుకున్నాడు శంకరప్ప

"అనేకులతో చదరంగం ఆడాను. అనేకం మాట్లాడాను. అతినిర్లక్ష్యంగానూ ఆడాను. , అందర్నీ ఓడించాను; కాని పెద్దాపురం కోటలో అడుగు పెట్టినప్పుడు కాళ్ళు వొణికాయి. తమ యెదట కూచున్నప్పుడు గుండెలు కొట్టుకున్నాయి. తమ దివ్యతేజస్సు నన్ను విభ్రాంతుణ్ణి చేసేసింది. తీరా యెత్తువేసిన తరవాత తమతో ఆటకి కూచోడం దుస్సాహసం అని బోధపడింది. పట్టుపట్టి యేలినవారితో ఆడినందుకు నేను సిగ్గుపడిపోతున్నాను మహాప్రభూ!"

"సిగ్గా? ఓడిపోయిన నాకే ఆనందంగా వుందే, తమ కేలా సిగ్గు? ఆట మొదలు పెడితే యెవరికో వొకరికే గెలుపు. రెండోవా రోడిపోవలసిందే. అయితే, అంతమాత్రాన వారిని తీసిపారెయ్యవలసిందేనా? నిజంగా, చూడవలసినవి శక్తిసామర్థ్యాలూ, యుక్తిప్రయుక్తులూనే కాని, జయాపజయాలు కావు."

ఇలా అని మహారాజు తనకేసి చూడగా "ఏలినవారు సత్యం సెలవిప్పించారు"అంటూ అందుకున్నాడు అప్పలనరసింహరాజు.

"శంకరప్పగా రెంతకేనా సమర్థులు; కాని, వారు తమ శక్తి యెంతటిదో యెరుగరు. వారిని కోటకి తీసుకురావడం నాకు చాలా కష్టం అయిపోయింది."

"దీనికంతకి కారణం నా శపథం. 'నేనయ్యా మహామొనగాణ్ణ'ని యెక్కణ్ణించో వచ్చి, యెత్తు వేశాటప్పటికి చేతులు వేలవేస్తే యెలాంటివాడు కూడా సహించడం కష్టం. అందుచేత అసమర్థులూ, కళాజీవులు కానివారూ సిద్ధపడకుండా వుండడానికే నేను శపథం పట్టాను గాని, మరొకందుకు కాదు. దీనికి నిదర్శనం, వచ్చినవా రోడిపోతే తల కొట్టించివేస్తా నన్నాను కదా, మరి నేనే వోడిపోతే?"

"చిత్తం చిత్తం, నేనామాటే మనవిచేసుకున్నాను శంకరప్పగారితో. కాస్త యోచించ గలవారి కెవరికయినా ఇది తోచే ప్రశ్నే, ఇందులో ఏదో గంభీరార్థం వుండకపోదు–"

"ఉండకపో దంటే తమరు గ్రహించలేనిదా యిది? అయినా నేనే మనవిచేసుకుంటాను."

ఇలా చెప్పి శంకరప్ప కేసి తిరిగి, చేతులు కట్టుకుని "దాసోహమ్" అని మహారాజు శిరస్సు వంచుకున్నాడు.

అది చూసి అప్పలనరసింహరాజు చకితుడైనాడు

శాస్త్రీ యాజులూ నిర్విణ్ణులయిపోయారు.

విజయరామరాజు దివాన్జీ కేసి నిరసనగా చూశాడు.

సభ్యులందరూ గతుక్కుమనిపోయారు.

అంతకుముందే "శ్రీహరీ! శ్రీహరీ!" అంటూ చెవులు మూసుకుని "ఎంతమాటా? కిరీటమాంధాతలు – మమ్మేలినవారు తమరెక్కడ! క్షుద్రభక్షకుణ్ణి నేనెక్కడ మహాప్రభూ? తమ రంతమాట సెలవిప్పిస్తే నేను భరించగలనా?" అంటూ శంకరప్ప తహతహలాడిపోయాడు.

## 29

ఒక్కక్షణం గడిచాక, ఆనందబాష్పాలు కొనగోట చిమ్ముకుంటూ "శంకరప్పగారూ!" అని మళ్ళీ సంబోధించాడు మహారాజు.

"చిత్తం మహాప్రభూ!" అంటూ అంజలిబంధంతో శంకరప్ప సావధానుడైనాడు

"ఇంతటి ఉత్కటానందం నాకింతవరకెప్పుడూ కలగలేదు, ఇందుకు గుర్తుగా, తమ ప్రతిభముందు నా సంపత్తి అణువునూ పోలదు గాని, అయినా చంద్రున కోనూలుపోగని శాస్త్రమే కనక, పెద్దాపురం రాజ్యంలో వున్నది యేమయినా సరే తమకి సమర్పించుకుంటాను, సెలవిప్పించండి"

"నాకు బహుమానమా మహాప్రభూ?"

"అవును.........కాకేమీ.........తమకంటే బహుమానార్హులు మరెవరూ?"

"పోనీ, నేనిప్పటికే బహుమానం పొంది వున్నాను కదా?"

"అదెలాగా?"

మహారాజు, అప్పలనరసింహరాజు కేసి చూస్తూ యిలా అనగా, ఇదంతా వోరకంట చూస్తూవున్న దివాన్జీ యీ నిండు సభలో తాను చేసిన పని బయటికి వచ్చేస్తుందేమో అని కుతకుత లాడిపోతూ తలకాయ తీసుకువెళ్ళి పొట్టలో పెట్టుకున్నాడు.

ఇది చూడమని శాస్త్రీ యాజులుగార్లకు కన్నుగీటి శంకరప్ప మళ్ళీ అందుకున్నాడు:

"వత్సవాయి సాహసౌదార్యాలు చాలా విన్నాను. ప్రకృతం సకృచ్ఛృతంగా చూస్తూనూ వున్నాను. నాకు ఆనందపారవశ్యం కలుగుతోంది. ఇదిలా వుండగా – కందనోలి సంఘటన చిరస్మరణార్హమే కాని, మా చెల్లెలు చంద్రవదన, అది చాలదని పూర్వపక్షం చేసేసింది. 'పెద్దాపురం మహారాజులుంగారితో కూడా యెత్తువేస్తే కాని, తనకి తృప్తిలే'దని ఆమె నన్ను తరిమి పంపింది నేను చాపలం జయించుకోలేక పోయినాను. మురిసిపోతూనే వచ్చాను గాని; 'పెద్దాపురం ప్రవేశించడం చాలా

సాహసం అని అనుభవం అయింది. ఏమయినా ముళ్ళ కంచెల్లో బాధపడి చివరికి సహకారం పొందకలిగాను. ఏలినవారితో వొక ఆటా ఆడగలిగాను. తమతో అర్ధాసనమున్నూ అధిష్ఠించగలిగాను, తృప్తి అయింది. నా బతుకున్నూ సఫలం అయింది. ఒక పిచ్చిబ్రాహ్మడి కిది సంభవమా మహాప్రభూ? ఒక దరిద్రదేవత కిది లభ్యమేనా రాజాధిరాజా? ఇంతకంటే నేను కోరతగినట్టిన్నీ పొందతగినట్టిన్నీ బహుమానం మరేం వుంది భూలోకదేవేంద్రా?"

దీనికి మహారా జేదో చెప్పదలుచుకుంటూ వుండగా "నేను మనవి చేసుకుంటాను" అంటూ అప్పలనరసింహరాజు లేచాడు.

మహారాజు "సెలవిప్పించండి" అన్నాడు.

"సంగ తంతా తమకి విశదమయ్యే వుంది. దాన్నిబట్టే చూస్తే తమ దర్శనం లభించడమూ, తమతో యెత్తు వెయ్యగలగడమూ – ఇవే శంకరప్పగారికీ మహామేరువులు. కాని, వారి కళాభిజ్ఞత–"

"అదీ సంగతి. వారి కళాసంపద మన మందరమూ కొల్ల లాడినాము దానికి పరిహారం చూపించవద్దూ? ఇంతేకాక, ఏ విద్యలోనయినా, యే కళలోనయినా నిష్ణాతులైనవారికి వత్సవాయివారి సత్కారంలేకుండా వుండగూడదని మామూలు పురుషుల శాసనం. దానికి తప్పడం మాకు ధర్మమా, సాధ్యమా? విద్యలకు మా రాజ్యంలో అయినా అనాదరం జరగకూడదే, యిక నా దగ్గిరా జరగవలసింది!"

"నా దగ్గిర యే లేశమాత్రమో కళాభిజ్ఞత వుండడం నిజమే; కాని అది చెప్పకోతగ్గది కాదు. నా యెడల శ్రీ దాట్ల అప్పలనరసింహరాజు బహద్దరు వారికీ నిర్హేతుకంగా పుత్రవాత్సల్యం కలిగిపోయింది. భీమవరపుకోట నాన్నగారు దానికి దోహదం చేశారు. ఆ రసికప్రభువుల ఆదరవాత్సల్యాలే నన్ను తమ సన్నిధి చేర్చాయి గాని, నా శక్తి సామర్థ్యాలు కావు."

"అయితే, మామయ్యగారికి అలాంటి ఆదరవాత్సల్యాలు తమయెడల మాత్రమే కలగడాని క్కారణం?"

ఉన్నట్టుండి విజయరామరా జీలా అడగ్గా మందహాసం చేస్తూ "మరి వారి సందేహం తీర్చండి" అన్నాడు మహారాజు.

అంజలిబంధంతో విజయరామరాజుని నిర్దేశిస్తూ "ఆదిలోనే వారికి నచ్చచెప్పకోలేక పోయాను. ఇలా నిలవతీసి అడిగితే యిప్పుడేం చెప్పకోగలనూ? కాక, జగత్ప్రభువులతో చర్చ సాగించడం అనుచితం" అంటూ వినయ విధేయతలు కనపరిచాడు శంకరప్ప.

అవ్యవధానంగా "కనక, తమ అభీష్టం సెలవిప్పించండి" అన్నాడు అప్పలనర సింహరాజు.

"తప్పనిసరి కావడంవల్ల విన్నవించుకుంటున్నాను అయితే, నాకొక తృప్తిలేకపోలేదు. అదేమిటంటే? ఎదటవున్నది మహాసముద్రమే కాని నాచేతిలో వున్నది బుడ్డిచెంబు మాత్రమే. మరి ప్రకృతం మహాప్రభూ? నేను నిరుపేదను నిరుపేదలకు కావలసినవి కూడూ గుడ్డానూ. వీటిలో యేలినవారు నాకొక్క అన్నంముట్టుకు పెట్టిస్తే, అదే మహా మేరువుగా సంతోషిస్తాను."

ఈమాటనేప్పుడు శంకరప్ప చాలా నిర్లిప్తత కనపరిచాడు.

అదిచూసి అందరూ మొగమొగాలు చూసుకున్నారు.

శాస్త్రీ యాజులూ "కొంపదీసి యేదో కాస్త మాన్యం కోరేస్తారా యేమిటి శంకరప్పగారు?" అనుకుంటూ ఆదుర్దాపడిపోయారు.

ఈ ధోరణి గుర్తించుకోలేక మహారాజు తనకేసి చూడగా, అప్పలనరసిహరాజు "విందాం ప్రహోప్రభూ!" అన్నాడు.

"మనవి చేసుకుంటున్నాను" అని శంకరప్ప, మాట అప్పలనరసింహంరాజు కందించి, మహారాజుకేసి తిరిగాడు.

"నా యిష్టక్రీడ చదరంగం. దానివల్లనే యేలినవారికి నా యెడల ఆదరభావం కలిగింది."

"చిత్తం" అన్నాడు మహారాజు.

"కనక నా కోరిక దానికి సంబంధించే వుండడం వుచితం."

"సెలవిప్పించండి."

"చదరంగానికి అరవైనాలుగు గదులు. మొదటి గదిలో వొక వడ్లగింజ వుంపించండి. తరవాత రెండో గదిలో రెండు, మూడో గదిలో నాలుగు, నాలుగో గదిలో యెనిమిది – యిలాగ వెళ్ళినకొద్దీ రెట్టింపుచేయిస్తూ నాకు వడ్లగింజలు దయచేయించండి మహాప్రభూ!"

ఇలా అని శంకరప్ప వొక్క క్షణకాలం మహారాజు కేసి చూశాడు. తరవాత సన్నిహితులకేసి చూశాడు. చివరికి సభ అంతా కలయచూశాడు.

కాని, వొక్కరూ తనమాట బోధపరుచుకున్నట్టు లేకపోగా మందహాసం చేస్తూ, కనపడీ కనపడనట్టొక మాటు తల పంకించుకున్నాడు.

శాస్త్రికీ యాజులికీ కూడా అది బోధపడలేదు; కాని, "యిందులోకూడా గొప్ప చాతుర్యం వుంటుంది. వుండి తీరుతుంది" అనుకుని, యింతలో శంకరప్ప ధోరణిచూసి "వోస్! వుందోయ్!" అన్నట్టొకరూ "ఓహో! వుండకేమోయ్!" అన్నట్టొకరూ తల లెగరవేసుకున్నారు.

అప్పటిదాకా కమిలి, కుమిలి, వుడికి, మాడిపోతూ వుండిన దివాన్జీ "పుట్టెడుగింజ లయితే పారబోస్తాను – పట్టుకుపో" అనుకుని తలకాయ విసిరేసుకున్నాడు.

ఉండుండి "మళ్ళీ మనం మధ్యాహ్నం కలుసుకుందాం" అన్నాడు మహారాజు.

"చిత్తం చిత్తం" అన్నాడు శంకరప్ప.

ఇద్దరూ సింహాసనం దిగారు.

సభ అంతా ఉద్రేత్తుగా లేచింది.

అర్ఘులదగ్గిర కళ్ళతో సెలవు పుచ్చుకుని మహారాజు వాస గృహానికి వెళ్ళిపోయాడు.

## 30

గద్దె దిగీదిగడంతో అప్పలనరసింహరాజూ, విజయరామరాజూ శంకరప్పని కౌగిలించుకున్నారు.

శాస్త్రీ యాజులూ పాదాభివందనం చేశారు.

మూర్తి మొదలయినవారు వచ్చి ముట్టడించేశారు.

ఇక్కడ యిది యిలా జరుగుతూ వుండగా, సేనాధిపతి వచ్చి కనుసన్న చేసి, అప్పలనరసింహరాజుని యెడంగా తీసుకువెళ్ళాడు.

"చిత్తగించారా?"

"సెలవిప్పించండి."

"రాణీదారుకి దేవిడీమన్నా అయిపోయింది. పెద్దాపురంలో వుండడానిక్కూడా సెలవులేదు."

"ఒ–క–టి."

"దివాన్జీవారి విషయం సందేహాస్పదంగా వుంది. కేవలమూ దేవిడీమన్నా కాకపోవచ్చుగాని–"

"రెండు పూర్తి చేయిస్తా రనుకున్నాను."

"కావాలనేనా తమ నిశ్చయమున్నూ?"

"ఇంకా–మెల్లిగా–"

"నిజమే కాని–మనిషికి పరశ్యోయ స్వహానం–"

"లేశ మయినా వుందిటండీ?"

"లేదు లేదు."

"ప్రత్యక్షశయ్య కనపరిచిన బులుసు రామగోవింద శర్మ గారినికూడా యిలాగే అగౌరవపరిచారు కాదుటండీ ఈయన?"

"ప్చ్!"

"గొట్టుముక్కల రామభద్రరాజు మామయ్యగారు పూనుకుని రాకపోతే అలివేణికి ప్రవేశం కలగనిచ్చునుటండీ ఈయన? నృత్యం విషయంలో పెద్దాపురం రాజసభకి అది తెచ్చిన పేరుప్రతిష్ఠలు మరే రాజసభకి మరే నర్తకి తేగలిగిందండీ?"

"జ్ఞాపకం వుంది."

"రామతీర్థం వైణికులు పరమశివశాస్త్రిగారు విసిగిపోయి ముందుకి సాగిపోడాని క్కారణం ఈయన కాదుటండీ? వారు చిక్కనవోలు దాటి వెళ్ళక పూర్వమే యేనుగు భీమరాజుగారు మహారాజులుం గారికి సంగతి విన్నవించి వుండకపోతే, అప్పుడు పెద్దాపురం సంస్థానాని కెంత అప్రతిష్ఠ వచ్చి వుండేదండీ?"

"నిజమే!"

"ఢిల్లీ అత్తరు వర్తకుడు షుకురల్లీఖాను, గులాబీ అత్తరుసీసా కోటగోడకి వేసి కొట్టడానికి క్కారణం ఈయన కాదుటండీ?"

"అవును."

"లాహోరు వస్తాదు దళపతిసింగు 'ఇంకెవరూ లేరూ?' అంటూ కాలుదువ్వి తొడ చరిచి మీసంమీద చెయ్యి వేసుకున్నప్పుడు, యీారంకి వీరావధానులుగారు జబ్బచరిచి నిలవకపోతే, పెద్దాపురం రాజ్యం నామరూపాలు నిలిచి వుండునుటండీ? నల్లపరాజు వెంకటపతిరాజు దద్దయ్యగారు అడ్డుకున్నారు కనక సరిపోయింది; కాని, అవధానులుగారిని ఈయన కోటలో అడుగు పెట్టకుండా చెయ్యాలని చూశారు కాదుటండీ?

"యథార్థమే!"

"అప్పుడదా? ఇప్పుడిదా? ముందైనా ఈయన బుద్ధి వక్రించకుండా వుంటుందని హామీ వుందా? అయినా మహారాజులుంగారింకా వోపికపట్టడం బాగుందా?"

"తమరు సెలవిప్పించింది యేదీ కాదనను. ఈయన్ని సమర్థించాలేను; కాని, లెక్కల్లో వున్న ప్రావీణ్యమూ, వసూళ్ళలోవున్న శ్రద్ధా ఈయన్ని కాపాడుతున్నాయి. అయితే కళలన్నా, విద్యలన్నా మహారాజులుంగారు చెవికోసుకునేటప్పుడు ఆ విషయాలలో ఈయన కలగజేసుకోకుండా వుంటే బాగుండిపోవును."

"మహారాజొక్క మాటు గట్టిగా మందలిస్తే?"

"తమ కాసందేహం అక్కర్లేదు. ఇవాళ మహారాజు వీరభద్రావతారం తాల్చేశారు."

"నిజంగా?"అని కనుబొమ్మ లెగరవేసుకుంటూ, తలవూపుతూ అడిగాడు అప్పల నరసింహరాజు. మహారాజు దివాన్జీయెడల ప్రాతికూల్యం చూపించ లేడని అతని నమ్మకం. అంచేత యిది వినేటప్పటికి కతనికి చాలా చాలా ఆశ్చర్యం కలిగింది.

"ఆ వుగ్రరూపం చూసి నేనే జంకిపోయాను."

"జవా బేమయినా–"

"కిమన్నాస్తి. అసలు కన్నెత్తి చూడకలిగితేనా?"

"అలాగేం?"

"ఈ జన్మలో పోదు దివాన్జీగారికి ఆ వుదుటు."

"తమ కలా తోచింది."

"తోచడ మేమిటి, మరొక రయితే యీ పాటికి వుద్యోగం వదులుకుని–"

"అంతపని కాదులెండి ఈయనవల్ల"

"నిజమే, కాని, కొన్నాళ్ళపాటు మొగం చూపించలేరు."

"ఐతే, యిందుకే సంతోషిద్దాం ఇప్పటికి."

ఇంతలో చల్లా జగ్గప్ప వచ్చి పిలవగా సేనాధిపతి "సెలవు" అంటూ లోపలికి వెళ్ళిపోయాడు. అప్పలనరసింహరాజు శంకరప్ప దగ్గిరికి బయలుదేరాడు.

## 31

అప్పటికి జాము పొద్దుంది.

పెద్దాపుర ప్పట్నం అంతా కోటలో వుంది.

కోట అంతా సభాభవనంలో వుంది.

సభ అంతా లక్ష్మీ సరస్వతీ లాస్యం చేస్తున్నారు.

ఒకవిధంగా, క్షణాలు యుగాలూ, మరోవిధంగా యుగాలు క్షణాలూ అయిపోతున్నాయి.

సముద్రతీరాన లాగ ఒకవైపున తరంగ కల్లోలమూ వినబడుతోంది; మరోవైపున గాంభీర్యమూ విరాజమానం అవుతోంది.

ఈ స్థితిలో, సభలో వున్నవారి కందరికీ యెవరికి వారికే గుబగుబలాడి పోయింది మనస్సు.

ఉత్తర క్షణంలో చల్లా జగ్గప్ప ద్వారంలో అడుగుపెట్టాడు, గంభీరంగా చూస్తూ.

అతగాణ్ణి చూసి చోపుదారులు బరాబరులు చేశారు.

ఆ సందట్లో వేత్రహస్తులు ప్రవేశించారు.

అప్పుడు జరీవస్త్రాలూ, కాశ్మీర దుశ్శాలువులూ, సింహతలాటం మురుగులూ, భుజబందులూ, కెంపుల కంఠమాలా, మకర కుండలాలూ, బంగారపు గోవతాడూ, రవ్వల వుంగరాలూ ధరించి, నడికట్టున కందనోలి కటారితో, అపరమన్మధు డయిపోయిన తంగిరాల శంకరప్ప చెయ్యి పట్టుకుని, రెండు పక్కలా గుబ్బెతలు వింజామరలు వీస్తుండగా, శ్వేతచ్ఛత్రం వహించి మరొకతె అడుగుల్లో అడుగులు వేసుకుంటూ అనుసరిస్తూ వుండగా, వాళ్ళ వెనక, సాక్షాత్తూ శ్రీమన్నారాయణ మూర్తిలాగ భాసిస్తూ మహారాజు విజయం చేశాడు.

వెంటనే సభ్యులందరూ వుబ్బెత్తుగా లేచి నుంచున్నారు.

ఈ అడావుడిలో, దంతపుబలమూ, దంతప్పనిచేసిన చదరంగం బల్లా పట్టుకుని విరిబోణీ, రత్నఖచితమైన చంద్రహాసం పట్టుకుని రంగనాయికా వచ్చారు.

తరవాత, షరా బనుసరిస్తుండగా సేనాధిపతి వచ్చాడు.

అప్పటి కప్పుడే మహారాజు శంకరప్పతో సింహాసనం అలంకరించాడు.

ఆ సన్నివేశం, సూర్యచంద్రులిద్దరూ ఒక్కమాటే – ఒక్కచోటే వుదయించిన ట్టుంది.

సభ అంతటా విలక్షణతేజ స్సావరించినట్టూ అయింది

దాంతో, సోత్సాహులై సభ్యు లందరూ కూచోగా, వుద్రిక్తులై వందిమాగధు లొక్క గడియసేపు కైవరాలు చేసి వోసరిల్లారు.

☆ ☆ ☆

"ఏమి, లెక్క తేలిందా?" అని అడిగాడు మహారాజు.

"చిత్తం, తేలింది మహాప్రభూ! అయితే, వారి కోరిక తీర్చాలంటే పెద్దాపురం రాజ్యంలోనే కాదు, త్రిలింగదేశం అంతటా వరాసగా నూరు సంవత్సరాలు పండిన ధాన్యం అయినా చాలదు" అంటూ షరాబు కాగితం మహారాజు కందించాడు.

"అయ్యో!" అని చకితు డైపోయాడు మహారాజు.

శంకరప్ప యేమీ యెరగనట్టు చల్లగా మొగం వంచుకున్నాడు.

విజయరామరాజు "నేను మనవి చేసుకున్నానుకాదూ?" అన్నట్టు అప్పల నరసింహరాజు కేసి చూశాడు.

శాస్త్రీ యాజులూ విజయ గర్వం ప్రకటించుకున్నారు.

తరవాత, వొక్కక్షణం ఆలోచించి మహారాజు అందుకున్నాడు:

"శంకరప్పగారూ!"

"చిత్తం మహాప్రభూ!"

"వడ్లగింజలతో కూడా నన్నోడించేశారు తమరు!"

"తమరంతమాట సెలవిప్పించడం–"

"ఇదేమంతమాటా? ఆటలో తమ రెంతవారో, మాటలో అయినా నేనంతవాణ్ణి కాలేకపోయాను. అయితే వత్సవాయి వారిలో నేటివరకూ ఆడితప్పినవారు లేరు;

కనక తమరు కోరిన ధాన్యానికి బదులు మా రాజ్యమే సమర్పించుకుంటున్నాను, స్వీకరించండి!"

ఇది విని, సభ్యులు స్తబ్ధులయిపోయారు.

"ధర్మమా జగత్ప్రభూ?" అంటూ మోడ్పుకేలితో నమ్రుడైనాడు శంకరప్ప.

"ఏమీ, యెందుకు కాదూ?"

"నేను పుట్టినప్పూరే తూర్పూ పడమరా యెరగనే, నా సంసారం నిర్వహించుకోడమే నాకు చేతకాదే, నేనీ విశాల రాజ్యం యేమి చేసుకోనూ?"

"తమరది యేమయినా చేసుకోండి. నేను మాట అనేశాను. అది జరిగి తీరవలసిందే."

"నమ్మేలినవారి మాట వరహాలమూటే, అది చెలామణీ అయిపోవలసిందే. అయితే, తమరు చెల్లించవలసింది నాకు దయచేసినమాటేగాని మరోమాట కాదు మహాప్రభూ!"

"నేను మాట మార్చలేదే?"

"మార్పించారు జగత్ప్రభూ!"

ఉలిక్కిపడి "నిజమా?" అన్నట్లు అప్పలనరసింహరాజు కేసి చూశాడు మహారాజు.

"అవు"నన్నట్టు మొదట మహారాజుకి మందహాసం అందించి, అప్పలనరసింహరాజు, తరవాత శంకరప్పకేసిచూసి "సెలవిప్పించండి" అన్నాడు.

"జగత్ప్రభువులు నాకు వాగ్దానం చేసింది రాజ్యంలో వుండుకున్నది యేదయినా సరే అనే కాని, రాజ్యానికి రాజ్యమే కా"దన్నాడు శంకరప్ప.

అది విని మహారాజు విభ్రాంతుడైనాడు.

"అదీ సంగతి. శంకరప్పగారు సర్వతోముఖ. ప్రజ్ఞావంతులు ఇక వారిదగ్గర చాతుర్యానికీ, ఔచిత్యానికీ కొదవ యెలా వుంటుందీ?" అని మహారాజుతో విన్నవించి, అప్పలనరసింహారాజు, శంకరప్పని చూసి "కనక తమ వాంఛితార్థం యేమిటో సెలవిప్పించండి" అన్నాడు.

వెంటనే శంకరప్ప "ఒక బ్రాహ్మణ కుటుంబం సుఖంగా జీవించడానికి చాలినంత వృత్తి దయచేస్తే నాకదే మహామేరువు జగత్ప్రభూ!" అన్నాడు.

రాజబంధువులూ రాజపురుషులూ తేరుకున్నారు.

అప్పలనరసింహరాజూ, విజయరామరాజూ అది కూడా గుర్తించి చకితులైనారు.

సభ్యులు ఆ చివరనుంచి ఈ చివరికి విసిరేసినట్టయారు.

శాస్త్రి యాజులూ నిరుత్సాహపడిపోయారు.

మహారాజు సభ అంతా కలయచూశాడు. అందరి యింగితమూ గుర్తించాడు.

శంకరప్ప వేసినయెత్తు కూడా గమనించి "శంకరప్పగారూ!" అంటూ మెల్లిగా అందుకున్నాడు.

"నేను అనేక కళలలోనూ, అనేక శాస్త్రాలలోనూ ఆరితేరిన అనేకమందిని సందర్శించి, వారి వైదుష్యం గ్రహించి ఆనందించి వున్నాను; కాని, తమలాగ నాకు పారవశ్యం కలిగించినవారు లేరు. తమ వైదుష్యం సర్వతోముఖంగా వుంది. తమ సాన్నిధ్యం నా కనేక విధాల వుత్తేజనం కలిగిస్తోంది."

శంకరప్ప నమ్రుడైనాడు.

"మరి ప్రకృతం. ఒక పనివాడొక సంవత్సరం క్రిందట యీ బలమూ, యీ బల్లా తయారు చేసుకువచ్చాడు. ఇంతటి పనివాడితనం నేనిదివరకెప్పుడూ చూడలేదు. యోచించగా యివి తమ కోసమే నిర్దేశించబడ్డవా అనిపిస్తోంది. కనక తమ రివి వుపయోగించండి."

శంకరప్ప అవి అందుకుని, కళ్ళకద్దుకున్నాడు.

"మరిన్నీ, చదరంగం బుద్ధిబలానికి సంబంధించినదే అయినా, అందులో యుద్ధతంత్రం అంతా నిగూఢంగా వుంది. ఆ ఆటలో నిపుణులైన వారు సేనాధిపత్యాని కర్హులు. సేనాధిపతికి చంద్రహాసం ప్రధానవస్తువు కనకనూ, నల్లచెరువు దగ్గిర పందిని పొడిచినప్పుడు తమరు కనపరచిన ధైర్య సాహసాలూ, శూరత్వమూ తమ అర్హతను వెల్లడించాయి కనకనూ, తమరు యీ చంద్రహాసం కూడా వినియోగించండి."

శంకరప్ప అది కూడా అందుకుని కళ్ళకద్దుకున్నాడు.

తరవాత వొక్కక్షణం వూరుకుని "శంకరప్పగారూ!" అని సంబోధించాడు మహారాజు.

"చిత్తం మహాప్రభూ!"

"తమ కోరిక తీర్చలేకపోయాను."

"తమరలా సెలవిప్పించవద్దు, నేను వడ్లగింజల కోరిక వుపసంహరించుకున్నాను మహాప్రభూ! వృత్తిమాత్రమే—"

"అదెంత పెద్దదో యిదంత చిన్నది. రెండూ నా శక్తికి అతీతాలే. కాగా, నేను తమ కోరిక తీర్చలేకపోవడమే మిగిలింది. ఇక మధ్యేమార్గం తొక్కకతప్పదు. మా రాజ్యంలో 'తుని' అని ఒక గ్రామం వుండడమూ, ఇలాంటి వైషమ్యం యేర్పడ్డప్పుడు, మహామహులనుకూడా వొడ్డెక్కించడానికి, దాన్ని పురస్కరించుకుని వొక ధర్మసూత్రం యేర్పడి వుండడమూ తమరు వినేవుంటారు. దాన్నిబట్టి తమరు మొదట కోరిన వడ్లగింజలూ కాక, తరవాత కోరిన వృత్తీకాక, నేను తమకి సర్వలక్షణసంపన్నమైన వొక సర్వాగ్రహారం సమర్పించుకుంటున్నాను."

శంకరప్ప, మొదట నమ్రుడై అంజలిబంధంతో ఆ మాట అందుకుని తరవాత "ఏలినవారి నిర్ణయం మహౌదార్య లక్ష్యంగానే కాక శాస్త్రసమ్మతంగా కూడా వుంది. ఏమంటే? క్షత్రియకుమారునికి విశాల సామ్రాజ్యం యెలాంటిదో, బ్రాహ్మణకుమారునికి సర్వాగ్రహారం అలాంటిది. కనక మహాప్రసాదం మహాప్రభూ!" అంటూ చాలా ఆనందించాడు.

దీనిమీద అప్పలనరసింహరాజేదో అందామని లేవబోతూ వుండగా, మహారాజు ఇంగితం కనిపెట్టి, షరాబు లేచి నుంచున్నాడు.

"ఏలినవారు, శంకరప్పగారికి అందోళికాది పరివారం యేర్పాటు చేయించారు. వారికోసం మన పట్నంలో వొక దివ్యభవంతి కూడా నిర్దేశించి సర్వసిద్ధంగా వుంపించారు."

సభ వుత్సాహతరంగితం అయిపోయింది.

"మరిన్నీ, ఏలినవారికి శంకరప్పగారి దర్శనం కావడానికి హేతుభూతురాలు

పెద్దమ్మగారు, కనక ఆమెకి నూటపదహారు రూపాయల బహూమానమూ సాలీనా నాలుగు మలకపుట్ల ధాన్యం బరాతమూ యేర్పాటయింది."

ఇది విని "ధన్యుణ్ణి" అంటూ చేతులు యెగరవేసుకుంటూ వుచ్చైస్వరంతో పలికాడు శంకరప్ప.

"పెద్దమ్మగారి ద్వారా యేర్పడిన హేతువు కార్యరూపం తాల్చడానికి సాధనభూతులు కొంపెల్ల రామశాస్త్రిగారూ చిలుకూరి వెంకప్ప యాజులుగారూను. కనక, వారికిద్దరికీ, చెరొక నూటపదహారురూపాయలూ బహూమానించారు ఏలినవారు."

శాస్త్రీ యాజులూ లేచి, నమ్రులైనారు.

శంకరప్ప వారికేసి తిరిగి వంగి నమస్కరించాడు.

మహారాజు శంకరప్పకేసి చూశాడు.

వెంటనే శంకరప్ప "ఒక్కమనవి" అన్నాడు.

"సెలవిప్పించండి."

"ఈ నా అభ్యుదయానికి శ్రీ దాట్ల అప్పలనరసింహరాజు బహద్దరువారూ, శ్రీ భీమవరపుకోట నాన్నగారూ—"

మాట సగంలో అందుకుని, మహారాజు "మేమే వారూ, వారే మేమూనూ. ఇదంతా వారి యేర్పాటే. తమ వుద్దేశం యింకా యేమిటీ?" అని అడిగాడు.

"అంతే అంతే, మరేమీ లేదు మహాప్రభూ! శంకరప్ప సర్వాంగీణంగా సత్కరించబడ్డాడు జగత్ప్రభూ!" అని, శంకరప్ప, మాటిమాటికీ వారికి అంజలి బంధంతో నిర్దేశిస్తూ చంటిపిల్లాడిలాగ ఆనందపారవశ్యం అనుభవించి, ఒక్క గడియ సేపు నిరర్గళవాగ్ధాటితో తన ప్రస్తావనచాతుర్యం కూడా చూపించి, అందర్నీ సంతోషవిహ్వాలులను చేశాడు.

## 32

శంకరప్ప అలాగ వూరుకున్నాడు.

అంతే.

వెంటనే సమ్మోహనాస్త్రంయొక్క పుంఖధ్వని లాగ యిలా వుపాంగం వినవచ్చింది.

దాన్నుజ్జీవింపచేస్తూ మద్దెలగాడు చాటువేశాడు.

అవ్యవధానంగానే తాళాలు గర్జించాయి.

కన్నుమూసి తెరిచాటప్పటికి, యెగిరివచ్చి, అలివేణి, "సా" అంటూ పతాకహస్తంతో నృత్యం ప్రారంభించింది.

సభ్యులలో, అలివేణి నృత్యం అనేకమాట్లు చూసిన్నీ, వాహ్ అని ప్రశంసించిన్నీ తృప్తి యెరగనివారు కొందరు.

"నాటికి మళ్ళీ నేడు" అంటూ చారెడేసి కళ్ళుచేసుకున్నవారు కొందరు.

"అది మన కళ్ళబడుతుందా?" అని తపస్సు చేస్తున్నవారు మరికొందరు.

మొత్తానికి వారందరూ కళ్ళప్పగించి వూరుకున్నారు.

అంతటితో వూరుకోక "చెల్లాయి యివాళ వొళ్ళు మరిచిపోతుంది" అనుకున్నాడు శాస్త్రి.

"అగ్రహారీకులైన శంకరప్పగారి వైభవాలకు మొదలు" అనుకున్నాడు యాజులు.

☆ ☆ ☆

ఎడమచేతి తర్జనితో లలాటం తుడుచుకుని, అంజలిబంధంతో అలివేణి నమ్రురాలయింది.

పరవశులై వుండిపోయిన సభ్యులు, ఒక్క క్షణానికిగాని నృత్యం అయిపోయిన సంగతి గుర్తించలేకపోయారు.

తలయెత్తి అబగా చూసింది; కాని, శంకరప్ప మెప్పుచూపులతో లజ్జిత అయి, అలివేణి మొగం వంచేసుకుంది.

ఆమె మొగం ప్రఫుల్లపద్మం అయి వుండడం గుర్తించి, రంగనాయిక శాస్త్రికేసి సాకూతంగా చూసింది.

శాస్త్రి రంగనాయిక కేసి చూసి, వొక్కమాటు రెప్పలల్లార్చి మొగం పక్కకి తిప్పుకున్నాడు.

యాజులు తల పంకించుకున్నాడు.

"ఎదుటకూచుని మహావిద్వాంసుడు చూస్తున్నాడన్న ఉత్సాహంతో, అలివేణి, యివాళ వొళ్లు మరిచిపోయింది" అన్నాడు విజయరామరాజు, జనాంతికంగా.

"అదీ సంగతి. కోట్లిచ్చినా కళాశీలి కలాంటి ఆవేశం కలగదు మరి" అన్నాడు అప్పలనరసింహరాజున్నూ అలాగే, జనాంతికంగా.

ఇది యిలా జరుగుతూ వుండగా చల్లా జగ్గప్ప మహారాజు దృష్టిపథానికి వచ్చాడు, మెల్లిగా.

వెంటనే "జగ్గప్పా!" అని పిలిచాడు మహారాజు.

"చిత్తం మహాప్రభూ!" అంటూ జగ్గప్ప మరింత ముందుకి వచ్చాడు.

"పొద్దున్న యేమన్నారూ శంకరప్పగారూ?"

"ఏనుగెక్కేగాని గుర్రం యెక్కి వేంచెయ్యనన్నారు మహాప్రభూ!"

"ఏం చేశావు మరి?"

"మొగసాలలో యేనుగు సిద్ధంగా వుంది మహాప్రభూ!" ఇలా అని జగ్గప్ప సింహద్వారం కేసి చూశాడు.

ద్వారంలో, తొండం పైకెత్తుకుని భద్రగజం ఘీంకారం చేసింది, శంఖం వురుముతున్నట్టు!

దగ్గిర వుండి మహారాజు శంకరప్పని గజారోహణం చేయించాడు.

వెంటనే వింజామర చేత పుచ్చుకుని, అలివేణి కూడా యేనుగెక్కేసింది.

*(1941 ఆంధ్రవారపత్రిక నుంచి)*

★ ★ ★

# "శుభికే! శిర ఆరోహ"

"పూరీ పాసెంజర్లో వస్తున్నా" నని యేలూరి నుంచి గంగమ్మ రాసిన వుత్తరమూ "నాలుగ్గంటల రెయిలు కార్లో వస్తున్నా"నని కాకినాడ నుంచి రంగమ్మ రాసిన వుత్తరమూ, ఆవేళ ఆదివారం కావడంవల్ల వొక్క డెలివరీలోనే అందాయి.

"టపా చూసుకునే మేడమీదికి వెడదా" మనుకుని ఆఫీసుగదిలోనే కూచుని వున్నాడు జగ్గప్ప.

ఏ కక్షిదారో, యే బంధువో, యే మిత్రుడో, యే తెనుగు రచయితో రాసిన మామూలు జాబులే వస్తాయనీ, వెంటనే మేడమీదికి వెళ్ళి సుఖంగా నిద్రపోవచ్చుననీ అనుకున్నాడతను.

కాని, దినదినమూ యెన్నో వచ్చే వుత్తరా లివాళ రెండే రావడమూ, ఆ రెండయినా "కజ్జాకి వస్తున్నాం కాసుకో" అన్నట్టిలాగ శ్రీముఖా లయి వుండడమూ చూసి తెల్లపోయి, ఉన్నట్టుండి కుర్చీ కంటుకుపోయా డతను.

ఆ వుత్తరాలతోపాటే వచ్చి బిందెరొట్టెలాగ మేజామీద పడివున్న లా రిపోర్టు పాకెట్టయినా అతణ్ణి ప్రకృతిలోనికి తేలేకపోయింది.

ఈ స్థితిలో తాంబూలప్పళ్ళెం పట్టుకుని రత్తమ్మ చక్కా వచ్చింది.

గుమ్మంలో అడుగుపెట్టాటప్పటికే ఆ జడావస్థ కనపడగా "యేమిటా?" అని పరిశీలించడంలో నిశితాలయిన ఆమె చూపులతో ఉద్బుద్ధుడయినా డతను.

ఉత్తరక్షణంలో, ఉభయులూ, ఉత్తరాలూ తాంబూలమూ మార్చుకున్నారు.

చూస్తూ చూస్తూవుండగానే, అతని పెదవులు రాగ రంజితాలు కాగా, ఆమె మొగం భావ శబలితం అయింది.

చూసిచూసి వుత్తరాలు బల్లమీద విసిరికొడుతూ "గంగమ్మ వదిన యింత పంతగొట్టుపని చేస్తారనుకోలేదు నే"నంటూ రుస రుస లాడిందామె.

"మరి రంగమ్మక్క మాత్రం తక్కువచేసిందా?"

"సరే, ఈవిడగా రివాళ ముహూర్తం పెట్టుకున్నట్టావిడకేం తెలుసునండీ పాపం?"

"ఇది జాలిపడవలసిన సంగతే అయితే, ఆవిడ సంగతి యీవిడకు మాత్రం యేమితెలుసూ?"

ఇది విని ముందు చురుగ్గాచూసి, తరవాత నిదానించి, చివరికి "పోనీ, మన మిప్పుడు చెయ్యవలసిం దేమిటో మీకు తెలుసా?" అని ఆత్రంగా అడిగిం దామె.

దానిమీద "అదీమాట" అంటూ బల్లగుద్ది, కుర్చీకంటుకుపోయినవాడల్లా సరిగా కూచుని "యిక చెప్పు" అంటూ సావధాను డయినా డతను.

"సరే" అంటూ అప్రయత్నంగా విసుక్కుందామె.

ఏదో ముంచుకు వచ్చేస్తున్నట్టూ, అయినా అదేమీ గమనించకుండా అతను జాప్యం చేస్తున్నట్టూ, కనపడి చిరాకు వచ్చిం దామెకి.

దీంతో మనస్సు చెదిరిపోయి అసలే మరిచిపోయింది.

చివరికి, చకితనేత్రాలతో అప్రయత్నంగా గుమ్మంకేసి చూసి, తలుపులు, దగ్గిరసానే వుండడం గుర్తించి దిటవు తెచ్చుకుని, అతనికి కొంచెం దగ్గిరగా వెళ్ళి, కంఠం నొక్కుకుని "గంగమ్మ వదినతో నేను వేగలేనండీ!" అంది దీనంగా.

"మరి రంగమ్మక్కమాట?"

"చాటున చెప్పకోవాలి. వో–ట్టి అమాయికురా లావిడ. నేనంటే ప్రాణం యిస్తుంది కూడానూ!"

"కనక?"

"మేనరికం నాకిష్టం లేదనుకుంటున్నారేమో మీరు?"

"కనక, అన్నాను."

" మా అపేక్ష లెలాంటివో మీ అపేక్షలూ అలాంటివే. మిమ్మల్నీ మిమ్మల్నీ దూరం చెయ్యాలని కాదు–"

"తరవాత యేమిటో చెప్పమంటున్నా" నన్నాడు కొంచెం నిలవతీసినట్టు, జగ్గప్ప.

దానిమీద ముందు ఆమె చకిత అయింది.

ఒక్క క్షణం అతనికేసి రెప్పవెయ్యకుండా చూసింది.

చివరికి, ఆసందుబాట్లో వొక నిశ్చయానికి వచ్చి, ధైర్యమున్నూ పూని "రంగమ్మ వదినతో వియ్యం అందడం మీ కభ్యంతరం లేకపోతే సుమండీ!" అంటూ బుంగమూతి పెట్టుకుని, కుర్చీపీట అతనికి మరీ దగ్గిరసా తీసుక్కూచుంది.

ఆ మాటలో "మన యిద్దరి చూపూ వొకటే" అన్న ధిలాసా కనపడి, బిగపట్టుకున్న శ్వాస ఆడినట్టయి తేలికపడి "అయితే, మరి, గంగమ్మక్క కేమిటీ చెప్పడం?" అని జిజ్ఞాసతో అడిగా డతను.

అవ్యవధిగా విరోధించి అడిగినట్టు కాగా దీనికి బదులు చెప్పలేక పోయిందామె.

"ధోరణి చూడగా, వీలుతప్పితే, రగడ పెంచడానికే వస్తున్నట్టు కనబడుతుంది గదా గంగమ్మక్క?" అని మళ్ళీ అడిగా డతను.

అందుకూ ఆమె బదులు చెప్పలేకపోయింది.

"పైపెచ్చు, మా అమ్మ, గంగమ్మక్కనే పూసుకువస్తుంది కదా?" అన్నా డతను, అపాయం తర్జనితో నిర్దేశించి చూపిస్తున్నట్టు.

"అవును సుమండీ!" అంటూ కుంగిపోయింది రత్తమ్మ.

అన్నదే కాని, అనాలనీ అనుకోలేదు, అన్నట్టున్నూ యెరగ దామె.

ఎదురొమ్ముమీది కుంపటిలాగ, షష్ఠి గడియలూ కలిసివుండక తప్పని అత్తగారు, కత్తులు దూసుక్కూచున్న దనే భ్రాంతి మనస్సు కలిచేసి, హృదయం బద్దలు కొట్టేసి, మెదడున్నూ కరిగించేసిందామెకి.

ఆమె స్థితి గ్రహించి తానూ అలాగే అయిపోయినట్టు మరి మాట్లాడలేక పోయా డతను.

ఏదో వెతుకుతున్న ట్టిద్దరి చూపులూ ఆత్రంగా దుముకులాడసాగాయి.

ఈ స్థితిలో "నాన్నారోయ్!" అంటూ తలుపులు తోసుకుని లోగుమ్మంలో అడుగుపెట్టి, అక్కడ తల్లికూడా వున్నందున మళ్ళీ తలుపులు దగ్గిరసా లాగి గిరుక్కున మళ్ళీ చక్కాపోయింది వారి రెండోపిల్ల, అన్నపూర్ణ.

దీంతో వారిద్దరూ మళ్ళీ ప్రకృతిలో పడ్డారు.

"అన్నపూర్ణ అయితే గంగమ్మక్కమంకుతనమూ, ఆవిడకొడుకు టుక్కూ చా-ప్పగా కుదురుస్తుం"దన్నా డతను,

"అసలు, పెళ్ళాడితేనా?" అని యెదు రడిగిందామె.

దీనిమీద, వొకరితరవాత వొకరి కిద్దరికీ చిరునవ్వు వచ్చింది, దొంతరలుగా.

మళ్ళీ అంతలో గాంభీర్యం తెచ్చుకుని "నా మాట అలా వుంచండి. పెద్దమ్మాయికి అతను సుతరామూ తగడండీ! దాన్నతను బతకనివ్వడండీ!" అంది రత్తమ్మ.

ఈ మాట అన్నప్పు డామెకంఠం గద్గదిక మయింది.

మంచుతెర కప్పిన తామరపువ్వు రేకల్లాగ ఆమెకళ్ళు చెమ్మగిల్లిపోయాయి.

ఇదిచూసి, అతనూ ఆర్ద్రకంఠు డయి "గంగమ్మక్క మాట అలా వుండగా, మా అమ్మకూడా నీమీది కోపాన గంగమ్మక్కకీ తాసికలు చెప్పి బాధపెట్టించదూ పెద్దమ్మనీ?" అన్నాడు జాలిగా.

ఈ మాట వినీ వినడంతోటే "మీ అమ్మ కడుపుచల్లగా, వున్నమాట అన్నారండీ మీరు! అందరి వాలకమూ మీకూ తెలుసండీ! ఇక భయంలేదండీ! నా చిట్టితల్లి కీగండం గడుస్తుందండీ! నా బెంగ తీరిందండీ!" అంటూ అతి ప్రేమగానూ, అతి వాత్సల్యంతోనూ అతని చేతులు గట్టిగా పట్టుకుని వూపిరి తీసుకుందామె.

దీంతో అతను ముగ్ధుడయినాడు.

అరమూతలు పడ్డ అతని కళ్ళకి, జానకమ్మకీ గంగమ్మ కొడుక్కీ హస్తికీ మశకానికీ వున్నంత అంతరం కనపడింది.

పురోడాశం తీసుకువెళ్ళి కుక్కకి పెట్టినట్టున్నా తోచి స్వగతంగా సీత్కారం కలగ్గా కనుబొమలు ముడిపడ్డాయి.

వెంటనే వొక నిశ్చయానికి వచ్చి "ఇక చాలు, అంతా నేను చక్క చేస్తాను. నువ్వు బెంగపెట్టుకోకు, వెళ్ళు. ఉత్తరాలు మాత్రం మా అమ్మకో మాటు చూపించు" అంటూ తాను లేచి, బల్లమీద వుత్తరాలు చేతిలో వుంచి, ఆమెని లేవదీశాడతను.

ఆమె కళ్లు ఆనంద విస్ఫారితా లయినాయి.

కాని, వుత్తరాలు అత్తగారికి చూపించడం మాట వచ్చేటప్పటికి, ఒకవైపునుంచి కార్యసిద్ధి అవుతూ వుండగా మరో వైపునుంచి కార్యహాని తురుముకు వస్తున్నట్టు తోచి, మొదట ఆమె నిర్విణ్ణ అయిపోయింది.

అయినా, జగ్గప్ప మొగంమీది దృఢదీక్ష గుర్తించి మనస్సు కుదుటపరుచుకుని చివరి కావుత్తరాలు మరో మాటు చూసుకుంటూ, అడుగులు మెల్లిగా వేసుకుంటూ వెళ్ళిపోయిందామె.

ఆమె గుమ్మం దాటేదాకా వుండి "చిన్నమ్మా!" అని పిలుస్తూ తరవాత అతనూ విసురుగా వెళ్ళిపోయాడు.

అరుగుమీద కూచుని జగ్గప్పా పురోహితుడూ జానకి పెళ్ళి విషయమే మాట్లాడుకుంటూ వుండగా, మోటారు వచ్చి పోర్టికోలో ఆగింది.

"ఎప్పు డెప్పు"డనుకుంటూ లోగుమ్మంలో యెదురుచూస్తూ నుంచుని వుండిన ముసలమ్మ, వొక్క అంగలో కారు దగ్గిరి కురికి "వచ్చావా అమ్మా?" అంటూ కారులో వుండగానే గంగమ్మ చేతులు పట్టుకుని ప్రేమ గుమ్మరించేసింది.

గంగమ్మ, కొడుకుని కూడా తీసుకురావడం చూసి, జగ్గప్ప "భారీ యెత్తుమీదేవచ్చా" రనుకుంటూ తలపంకించుకున్నాడు.

"మామయ్యతో మరెవరో వున్నారు. ముసుగు సరిచేసుకోవమ్మా" అని గంగమ్మకి మెల్లిగా చెప్పి, ఆమె కొడుకు, స్వయంగానే అవతలి తలుపు తెరుచుకుని దర్జాగా కారు దిగాడు.

ఈలోపున, కంఠం నొక్కుకుని, కళ్ళు తిప్పుకుంటూ "రంగి కూడా యివాళే వస్తోందే, మించిపోయినట్టూ" అని ముసలమ్మ సాగతీసుకుంది.

కొడుకు చెప్పిన మాటమీద సవరించుకోవా లనుకునిన్నీ, యీ మాట విని వులిక్కిపడి, సగం జారిపోయిన ముసు గలాగే వుంచేసుకుని "అదెందుకే యిప్పుడు శనిలాగా?" అని మెల్లిగానే రుంజుకుంటూ కొడుకుకంటే నింపాదిగా కారుదిగింది గంగమ్మ.

కారు తిరగవేసుకుని కొడుకువచ్చి కలుసుకున్నాక, తల్లి బుజాన చెయ్యివేసుకొని గోటుగా బయలుదేరిం దామె.

వారు మెట్లమీద అడుగు పెట్టాటప్పటికి లేచివచ్చి "వచ్చారా" అని అక్కనీ, మేనల్లుణ్ణీ పలకరించాడు జగ్గప్ప.

గంగమ్మ, అందుకు జవాబుగా మొదట చిరునవ్వు మొలిపించుకుంది.

తరవాత "ఇవాళ, బండి అరగంట లేటు" అని చెప్పి, కొడుక్కేసి చూసింది; కాని అతను చిరునవ్వుమాత్రం ప్రసారించి వూరుకున్నాడు.

ముగ్గురూ అరుగెక్కారు.

గంగమ్మా, ముసలమ్మా సింహద్వారం దగ్గిరసా నుంచోగా, గంగమ్మ కొడుకు జగ్గప్ప కెదురుగా నుంచున్నాడు.

జారిపోతుందా అన్నట్టు వొదులు వొదులుగా బిళ్ళగోచీపెట్టి పంచెకట్టుకునీ, దానిమీద మోకాళ్ళదాకా పల్చని బెంగాలీ లాల్చీ వేసుకునీ, దానిమీద హిందూస్థానీ పొట్టికోటు తొడుక్కునీ, నెత్తిన లేసుగుడ్డ టోపీ పెట్టుకునీ వున్నాడతను.

బీడీ వొకమాటు నోట వుంచుకుని పీలుస్తూ, వొకమాటు తీసేసుకుంటూ, మధ్యమధ్య రకరకాలుగా పొగ విడుస్తూ, ఫ్రెంచి కట్టింగు మీసాలు కూడా సవరించుకుంటూ పోజుమీద పోజుకూడా మారుస్తూ వున్నాడతను

"ఈవిడ మా పెద్ద అక్కగారు. ఇతను మా మేనల్లుడు" అంటూ వారిని పురోహితునికి పరిచయం చేశాడు జగ్గప్ప.

"చిత్తం చిత్తం, అక్కయ్యగారినిచూసి పదేళ్ళయింది. అప్పుడయినా, అప్పుడే నాకు తమ ఆశ్రమం లభించడంవల్ల కొత్త అయిపోయింది. నాటికి నేడూ మళ్ళీ వారి దర్శనం. చాలా సంతోషం" అని వ్యాగీసలాడుతూ బదులు చెప్పాడు పురోహితుడు.

"మొన్నటిదాకా కతలకత్తాలో చదివాడు, కాని ప్రస్తుతం కాశీలో చదువుతున్నాడితను."

మళ్లీ "చిత్తం చిత్తం" అని జగ్గప్పకి వినయం నివేదించుకుంటూనే గంగమ్మ కొడుకేసి తిరిగి "మీ పే రెవరు నాయనా"? అనడిగాడు పురోహితుడు.

"రామేష్" అని చెప్పాడు గంగమ్మ కొడుకు.

అరవైయేళ్ళ పురోహితున కిది తెలుగు జాతిలో వినపడి వుండని పేరు.

ఉలిక్కిపడ్డాడతను.

ఇది గుర్తించి, చుర చుర చూసి, మొగం పక్కకి తిప్పుకున్నాడు జగ్గప్ప.

దాంతో కొంచెం పురెక్కి "యేమిటి నాయనా?" అంటూ చెవులోరజేసుకుని మళ్లీ అడిగాడు పురోహితుడు.

"రామేష్" అన్నాడు కరుగ్గా, గంగమ్మ కొడుకు.

ఈ మాటు కొంచెం పెంకితనం కనబరిచా డతను.

పైగా, యీ మాటు పేరు చెప్పినప్పుడు షకారం కొంచెం దీర్ఘంగా పలికి, దాంతో చిన్న యీలవంటి సన్నని ధ్వని కూడా పుట్టుకు వచ్చింది.

జగ్గప్ప తనలో నవ్వుకున్నాడు.

రెండుమాట్లు విన్నా ఆ పేరేమిటో అర్థం చేసుకోలేక గంగమ్మకేసి తెల్లపోయి చూసింది ముసలమ్మ.

"వోట్టి కూపకూర్మాలు" అన్నట్టు మొదట కొడుకేసి సగర్వంగా చూసి, తరవాత, తన అలతి నవ్వుతో ముసలమ్మ మొగం పులిమింది గంగమ్మ.

"బాగుంది నాయనా!" అని రామేష్‌ని అభినందించి, ముసలమ్మ కేసి చూస్తూ "తాతగారిపేరు —" అంటూ మాట తేల్చేశాడు పురోహితుఁడు.

అది పుండుమీద కారపుగుండ కొట్టినట్టయింది ములసమ్మకి.

దాంతో "మధ్య నువ్వేమిటయ్యోయ్?" అన్నట్టొక చురుకుచూపు పురోహితునిమీద పారేసి, ముసలమ్మ ధుమ ధుమలాడుతూ మొగం పక్కకి తిప్పుకుంది.

ఈ సందుబాట్లో – రామేష్ "ముసుగు సరిజేసుకో" అన్నట్లు తల్లి కేసి చురుగ్గా చూడడమూ, కంగారుపడుతూ ఆమె ముసుగు ముందుకి లాక్కోడమూ గబగబా జరిగిపోయాయి.

అది కూడా చూసి మెరుపు కొట్టినట్టయి, పురోహితుడొక్క అడుగు వెనక్కి వేశాడు.

"ఇక వీళ్ళ నిక్కడ వుండనివ్వడం మంచిదికా"దని వ్యూహించి, జగ్గప్ప, లోపలికి పదమందా మనుకుంటూ వుండగా "ఇదిగో, వదినగారే? ఎన్నాళ్ళ కెన్నాళ్ళకి!

దయచెయ్యండి, దయచెయ్యండి" అంటూ వూచలాగ వచ్చి, రత్తమ్మ, గంగమ్మ చెయ్యిపట్టుకుని లోపలికి తీసుకు వెళ్ళింది.

"రావోయ్, నాయనా!" అని పిలుస్తూ వారి వెనక ముసలమ్మా, వొక్కపీల్పు పీల్చి బీడీ పోర్టికోలోకి విసిరేసి ములసమ్మ వెనకనే రామేష్ లోపలికి వెళ్ళారు.

చిరునవ్వు నవ్వుతూ పురోహితు డేదో అనబోయాడు: కాని అంతకి ముందే "చిన్నక్కయ్యగారు కూడా వస్తున్నారు, పెద్ద స్టేషనుకి వెళ్ళు" అని డ్రయివరుకి ఆజ్ఞాపించి, కూడారమ్మని పురోహితుణ్ణి కళ్ళతో పిలిచి, సన్నజాజి పాదకేసి దారీతీశాడు జగ్గప్ప.

"చిత్తం" అంటూ వినయం కనపరిచి, జగ్గప్ప కొంచెం అవతలకి వెళ్ళేదాకా నుంచుని, తరవాత బర్రుమనిపించుకుంటూ కారు నడిపించుకుపోయాడు డ్రయివరు.

## 3

గంగమ్మా రంగమ్మా వచ్చింది పెళ్ళికూతురి చూపులకేగాని, ఆరాత్రి భోజనాల బంతి పెళ్ళిబంతిలాగే వుంది.

ముసలమ్మా గంగమ్మా రామేష్ వొకపక్కనీ, జగ్గప్పా రత్తమ్మా జానకీ అన్నపూర్ణా, రంగమ్మా ఆమెకొడుకు రామేశమూ వొక పక్కనీ కూచున్నారు.

"ఈ యేర్పాటు మా అమ్మదా?" అని రత్తమ్మని కళ్ళతో అడిగి, జగ్గప్ప, మొగం వంచుకుని ముసిముసి నవ్వులు నవ్వుకున్నాడు.

"మొగపెళ్ళివారు కామోసు నాయనోయ్!" అన్నట్టు కొడుక్కేసి చూసి, రంగమ్మ, కళ్ళల్లోనే నవ్వుకుంది.

రామేష్‌కేసీ, గంగమ్మకేసీ, కొంటె చూపులుగానూ ముసలమ్మకేసి కోరచూపులు గానూ, అన్నపూర్ణ నేత్రావధానం చేస్తోంది.

చూపు లిటే వుంచి గంగమ్మా రామేష్ ఊ హిందీలో మాట్లాడుకుంటున్నారు.

అదిచూసి "మీ వియ్యపు రాలెంత తెలివయిందో చూసుకోం" డన్నట్టొకమాటూ "మీ అల్లు డెంత గొప్పవాడో తెలిసుకున్నారా?" అన్నట్టొకమాటూ, ముసలమ్మ, జగ్గప్పని విడిచి రత్తమ్మనీ రత్తమ్మని విడిచి జగ్గప్పనీ డెకాయించినట్టు చూస్తోంది.

ఇది యిలా జరుగుతూ వుండగా, అందరికీ వ్యంజినాలూ అన్నమూ వడ్డించి, రామేష్‌కి మాత్రం గోధుమ రొట్టెలూ, బంగాళాదుంపల వేపుడూ, పంచదారా వడ్డించింది వంటలక్క.

అందుకే జగ్గప్ప వింతపడుతూ వుండగా "ఇప్పణ్ణుంచీ అలవాటు కాకపోతే ముందుముందు కష్టం, జానకమ్మకు్కూడా రెండురొట్టెలు వెయ్యవమ్మా!" అని పురమాయించింది ముసలమ్మ, వంటలక్కకి.

అది విని యీ బంతి వారందరూ యేకకాలంలోనే చకితులయినారు.

ఎగిరిపడి అన్నపూర్ణ జానకమ్మ కేసి చూడగా, జానకమ్మ ములసమ్మ మొగాన చూపులతో మెటికలు విరిచి మొగం వంచుకుంది.

జగ్గప్పా, రత్తమ్మా లోపల్లోపల నవ్వుకున్నారు.

"మా కేమాత్రమో వున్నాయి సుమండీ! అయితే మాత్రం కూచుని తినమా? అంచేత వచ్చాం మేముద్యోగంకోసం" అని చెప్పి సుందరమ్మ, మొగం పక్కకి తిప్పకుని కళ్ళు చికిలించుకుంది.

క్షణంలో మళ్ళీ యిలా చూస్తూ "మీ కెన్నాళ్ళయిందీ ఈ యోగం పట్టి?" అనడిగింది.

"మూడేళ్ళయిందండీ! కలరా వచ్చి యెత్తుకుపోయింది నా దేవుణ్ణి. ప్రయివేట్లుచెప్పి పోషించేవారు మమల్ని."

"నాకూ అంతే అయింది. ఆసుపత్రి మింగేసిందాయన్ని."

అప్పటికి బిందె తోమడం అయిపోగా, రత్తమ్మ, తన పంచా కొడుకు పంచా కూతురి పరికిణీ వుతుక్కోసాగింది.

వెంటనే సుందరమ్మ, రెండు చేతులతోనూ నీళ్ళు చిమ్ముకుంటూ "బాబోయ్, బాబోయ్" అని యెగిసెగిసిపడుతూ మొలలోతుకి వెళ్ళి నుంచుని "అబ్బ! చలిచలి, వేన్నీళ్ళేగాని యెరగనైతిని నిన్నటి దాకా"అంటూ కంఠం దాకా మునిగిలేచి వొళ్ళు తోముకోసాగింది.

## 2

ఎలెక్ట్రిక్కు కార్పొరేషన్ దగ్గిర యెదురుపడి "సినీమాకేనా వెడుతున్నారు?" అనడిగింది, సుందరమ్మ.

అప్పుడే విప్పిన గ్లాస్కోమల్లు మడత కట్టుకుని, సువాసన నూనె రాసుకుని తల చక్కగా దువ్వుకుని, జారుముడి వేసుకుని వుందామె

రత్తమ్మ కట్టుకున్నదిన్నీ చాలా పరిశుభ్రంగానే వుంది; కాని, అది నీరుకావి పంచె.

ఆమె కూడా తలదువ్వుకుని జారుముడి వేసుకునె వుంది

"కాదండీ, నేనున్న విద్యమానంలో నాకు సినీమా కూడానా? మార్కండేయ స్వామిగుడికి వెడుతున్నాను."

"మీ అబ్బాయి కేమయినా వుద్యోగం–"

"ఇంకా దొరకలేదండీ! కాని, వుద్యోగం ఆశ వొదులుకున్నాడు నా నాయన. మరి మీ అబ్బాయికి దొరికిందా?"

"ఎందరెందరో యిస్తాం రమ్మన్నారు; కాని మావాడే వొప్పకోలేదు."

"అదేం?"

"దిక్కుమాలిన వుద్యోగాలు కానీ – ఈ వుద్యోగాలిచ్చే వాళ్ళకి, అగత్యమే కాని బుద్ధి వున్నట్టు లేదండీ"

"ఏం జరిగిందేమిటీ?"

"ఒక జమీందారన్నాట్ట – ఇచ్చేది పదిహేను రూపాయీలుట సుమండీ, ఇంతాచేస్తే. రాత్రింబగళ్ళు తనని కనిపెట్టుకుని వుండాలిట, చుట్టలూ సిగరెట్టులూ నోటికందిస్తూ. పైగా, సంవత్సరందాకా జీతం యెక్కువ చెయ్యమని అడగననీ, రెండేళ్ళకి తక్కువ కాకుండా నౌకరీ చేస్తాననీ రాసికూడా యివ్వాలిటండోయ్!"

"ఆయనే కాబోలు, నా నాయనతోనూ అలాగే అన్నాట్ట"

"ఇంకో వర్తకుడున్నాట్ట. కానయితే యిరవై రూపాయిలిస్తాడుటలెండి. అయితే, నెలకిరవైదినాలు సికిందరాబాదనీ, శ్రీకాకుళం అనీ, బందరనీ తిరుగుతూ వుండాలిట. ఊళ్లో ఉండిన పద్దినాలూ తన యింటో కూచుని వుత్తరాలకు నకళ్ళు రాయాలిట, విన్నారా?"

"నా నాయనతో అటు కర్నూలు దాకానూ, యిటు భద్రాచలం పైకీ కూడా వెడుతూవుండాలన్నాట్ట ఆయనే కాబోలు!"

"మరో పెద్ద ఆస్తిపరుడున్నాట్టండీ! 'వడ్డీ కట్టడంచేతవునా?' అనడిగాట్ట- బి.ఏ.ని అదా అడగడం చెప్పండీ, పోయేకాలం కాకపోతే? తీరా, అందుకయినా సరే అని సిద్ధపడితే-"

"జీతం లేకుండా మూడుమూసాలు పనిచెయ్యాలన్న మాటేనా మీరు చెబుతున్నది?"

"మీ అబ్బాయికీ అయిందీ అది?"

"ఆ!"

"ఇంకోటి కూడా అన్నాట్ట. మీ అబ్బాయి చెప్పాడో లేదో మరి. తన కొడుక్కీ తన మనుమడికీ యింగ్లీషుకూడా-"

"అదెందుకో తెలుసా?"

"వాళ్ళకి యింగ్లీషురాకపోతే మనకి ఇంగ్లీషు గుమాస్తా యెందుకంటారుటండీ, చూశారా?"

"డబ్బున్న వాళ్లెన్ని చిలకపలుకు లయినా పలుకుతారు, చూసేం చెయ్యగలమూ మనమూ?"

"చూసేం చెయ్యగలమా? వాళ్ళకే వుందా మహా! ఊరికే కూచోడం యెందు కనిగానీ - మా యింటో కాఫీ ఖర్చుకి చాలదు, వాడిస్తా నన్నది, తెలుసా మరి?"

"మీ మాట యేమోగాని, మాకు మాత్రం కొన్నాళ్ళపాటు అది మహామేరువయి వుండేది; కాని రాత్రిళ్ళు, తరుచు, తన యింటి దగ్గర పడుకోడం కూడా తప్ప దన్నాట్ట కాదూ?"

"మరేటండోయ్! కళ్ళూ కాళ్ళూ మన్నుతాయా ఆ అబ్బికీ? బ్రాహ్మణ పిల్లాడు - బిఏ - తన యింటికి కాపలా వుండడమా?"

"అలా వుంది కాలం!"

"ఎవరో సినిమావాళ్ళుటండీ! రాత్రి వొంటిగంటదాకా రెండాటలకూ కథ చెప్పా లన్నారుట. తడికలు పుచ్చుకుని కుర్రాళ్ళు వీధివీధికీ సరిగా తిరుగుతున్నారా లేదో చూడడానికి, మధ్యాహ్నంపూట అంతా వాళ్ళ వెనకవెనకనే తిరుగుతూ కూడా వుండాలిట. మరి జీతం-"

"ఇరవయ్యేగా?"

"మీ అబ్బాయీ వెళ్ళాడూ, అక్కడికీ?"

"వెళ్ళాడమ్మా, వెళ్ళాడు."

"ఒక ప్లీడరుటండీ? తన కొడుకులకు రాత్రీ పగలూ ప్రయివేట్లు చెబితే అన్నంపెట్టి బట్ట యిస్తాడుట. తనకే కాని మరెవరికి కుటుంబం లేదనుకున్నాడు కామోసు వెర్రినాయన!"

"ఆయనే కాబోలు! మావాడికి, జీతమే కావాలంటే పదిహేను రూపాయలిస్తా నన్నాట్ట; కాని తనకోసం, కోర్టుకి కాఫీ పట్టుకువెడుతూ వుండాలిట!"

"బ్రాహ్మణ జన్మేనా వాడిదీ?"

"నవ్వుకొని వూరుకుంటే కాదండీ! ఇలాంటి వాళ్ళకి తగినట్టు గడ్డి పెట్టకపోతే యింకా పెచ్చిపోతారండీ!"

"ఎవరో నౌకరు పెట్టకపోరు, మన కెందుకూ?"

"ఇంకో వర్తకుడున్నాట్ట. బ్రాహ్మడేట. కొత్తగా కూరల అంగడి పెట్టాడుటండీ! ఊళ్ళో యింటింటికీ తిరిగి, కూరల కొనుక్కునే వాళ్ళని అందరినీ తన అంగడికి మళ్ళించాలిట. అలా మళ్ళిస్తే – ఆ వచ్చిన వాళ్ళు తనపేరు చెబితే – వాళ్ళు కొన్న కూరలతో వచ్చే లాభంలో నూటి కయిదు రూపాయిలు–"

"కావడి బుజాన వేసుకునీ వూళ్ళో తిరిగి అమ్ముకురావాలనలేదు, నయమే కాదూ?"

"బాగా చెప్పారు. మరి మీ అబ్బాయి ఏమిచేశాడూ?"

"ఏటి కద్దపడ్డాడండీ!"

"అంటే?"

"ఆదిలో, దినాని కొక రూపాయి కిడుతుందనుకున్నాట్ట; కాని, నౌకవారం అయింది ప్రవేశించి, పదిరూపాయలు వచ్చా యంటూ పొంగిపోతూ పట్టుకు వచ్చాడు నా నాయన."

"మావాడు చిల్లరపనులు చెయ్యడు సుమండీ! పుట్టింది బ్రాహ్మణ పుట్టుకాయె. ఆపైని బి.ఏ. కూడాను. అసలు, మాకు లోటూ లేదు. మంచిపని దొరికితేనే, ఎప్పటికైనా."

"మీ కేమమ్మా బంగారు పిచికలు. మరి వెడతా, స్వామి దర్శనం చేసుకుని, నా నాయన యింటికి వచ్చాటప్పటికి వంట చెయ్యాలి."

"నేనూ వెళ్ళాలి, ఆలస్యం అయితే టిక్కట్లు దొరుకుతాయో లేదో? ఏదో కొత్త ఫిలిం వచ్చిందిట. ఇక అవి ఫేషన్లు కావుట, పాటలు కావుట, నృత్యాలు కావుట – బాబోయ్.. ......"

## 3

ఇద్దరూ మార్కండేయస్వామి గుడిదగ్గిర కలిశారు

"గుళ్ళోనుంచి వస్తున్నారా?" అనడిగింది రత్తమ్మ.

"లేదండీ, బజారుకి వెళ్ళాను, గ్లాస్కోమల్లుతానులు రెండో మూడో పుచ్చుకుందా మని. రేపు రమ్మన్నాడు వర్తకుడు. ఇలా తిప్పడమే కాదు, వొక్క తానుకంటే ఎక్కువ యివ్వడుట. ఇక ముందు దొరకడమే కష్టంటండీ!"

"ధర పెరిగిపోయినందుకే యిబ్బందిగా వుండగా, అదోటి కూడానా?"

"ఏమి చెప్పకోనండీ? ఆదికాలాన, నేను, మధుర చీరలూ, బెంగుళూరి చీరలూ, కంచి చీరలూ, పుల్లంపేట చీరలూ, ఉప్పాడ చీరలూ తప్ప మరొకటి యెరుగను. ఈ యోగం పట్టాక, కొన్నాళ్ళు నుంచి గ్లాస్గోమల్లు కడుతున్నాను, ఇక ముందెలాగో మరి?"

"చిక్కుగానే వుండేటట్టుంది. వద్దు వద్దు అంటూ వుంటే, నిన్న చెల్లెలికి నాలుగు పరికిణీ గుడ్డలూ, నాలుగు చొక్కా గుడ్డలూ, నాకోసం మూడు మెట్టూరు మల్లు పంచెలూ తెచ్చి పడేశాడు మా నాయన. మీరన్నట్టు, ముందు ముందు దొరకడం కష్టమేట!"

"బాగా కిడుతోంది కామోసునేం?"

"ఆ, స్వామి దయవల్ల. చెప్పవద్దూ? రెండు వారాలనుంచి నా నాయన దినానికి రెండున్నర సంపాదిస్తున్నాడు."

"దినానికి రెండున్నర తెస్తున్నా డంటే జ్ఞాపకం వచ్చింది విన్నారా? ఎవరో బ్రాహ్మణపిల్లాడుటండీ! బి.ఏ కూడానుట; కాని శూద్రకుర్రాడు లాగ తాపీపని చేస్తున్నాడుటండీ, మావాడు చెప్పి యెంతో యిదయాడు, అదేం కర్మమండీ?"

"......అయితేనూ? మీ చేతిని గాజులు రెండు జతలే కనపడతాయేం? నాలుగు జత లుండేవి కాదూ?"

"ఉండేవి, నిజమే – ఇప్పుడూ వున్నాయి; కాని బరువనీ, దినమ్మా యెందు కనీ రెండు జతలే పెట్టుకుంటున్నాను, ఊరు పాతబడింది కనక."

ఇలా అంటూనే సుందరమ్మ, పైటచెంగు కంఠం చుట్టూ సవరించుకుంది, బాగా కమ్మేటట్టు.

దాంతో, ఆ లౌక్యం కనిపెట్టేసి, రత్తమ్మ "అదేం, గోవర్ధనం గొలుసేదీ?" అనడిగేసింది.

"సరదా పడితే మా చిన్నబ్బాయి మెడలో వేసి వచ్చాను" అంది సుందరమ్మ, మొగం వంచుకుని.

"మీ అబ్బాయికి వుద్యోగం–"

"చెప్పు లరిగేలాగ – చెప్పులంటే బూడ్సులు సుమండీ! మావాడు దేశవాళీ చెప్పులు తొడుగుతాడా మరీ? అవి అరిగేలాగ తిరుగుతున్నాడు. కాళీలూ వున్నాయిట కావలసినన్ని; కాని వొక్కటీ దర్జా అయింది కాదుట. చూస్తూ చూస్తూ నాసిరకం పనిలో ప్రవేశించడం యెలాగండీ, బియ్యే అయాక కూడానూ."

"మనస్కరించకపోతే యెలాగా ప్రవేశించడం?"

"కానయితే, రెండు నెలలు పూర్తికావస్తోంది ఇక్కడికి వచ్చి. అయినా–"

"కష్టమే, ఉప్పుతో తొమ్మిదీ కొనుక్కోవాలి. డబ్బుపెట్టి. అయినా, వొక్కటీ మంచిది దొరకదు. నెయ్యీ మజ్జిగా చూస్తూన్నారా?"

"బాధగానే వుందండీ!"

"అన్నట్టు, మీ కోడలికి గాజులు పెట్టించారా?"

"విన్నారా? అయిదోమాసం రేపటితో వెడుతుంది. సంతోషంకొద్దీ నెల తప్పగానే రాశాం. వెంటనే వచ్చి పుట్టింటివారు తీసుకు చక్కాపోయారు వారే

పెట్టించుకుంటా రనుకున్నాం గాజులు. ఇంతకీ, ఎంత గతి కడుక్కుపోయినా గాజులు పెట్టించుకోడం పుట్టింటివారే. అవునంటారా కాదంటారా చెప్పండీ?"

"లోక ధర్మం అంతేగా?"

"మా అబ్బాయి, పెళ్ళాన్ని విడిచి క్షణం వుండలేడు. వారానికోమాటు వెళ్ళి వారందినాలుండి వస్తూనే వుంటాడు. మొదటే వాడితో చెప్పకోవచ్చునా? చెప్పకుంటేసిగ్గు – తీరా, అయిదోనెల వెళ్ళిపోతుందనగా, నాలుగుదినాల కిందట వాడితో పంపేసి వూరుకున్నారు"

"అదేం?"

"వారికి ఆనవాయితీ లేదుట!"

"పా–పం!"

"పాపమో పుణ్యమో – వారు చేసిం దదీ. దాని మీద రెండుచేతులా నోరు మూసుకుని మేమే పెట్టించుకున్నాం నిన్న. మాకు తప్పతుందిటండీ?"

"ఎలాగో వొకలాగ లాంఛనాలు–"

"ఎలాగో వొకలాగ యేమి కర్మం, రాజాగా జరిగించుకున్నాం, మాకు మాత్రం తీరవద్దుటండీ?"

"అదే నేనన్నదీని. అయితే, తల్లీ తండ్రీ–"

"రానూ వచ్చారు గాజులు పెట్టించిన ఉత్తరక్షణాన తీసుకునీ వెళ్ళారు మళ్లీ"

"అయ్యో, అంత తొందరయేమీ? ఇవాళ తీసుకువెళ్ళగూడదూ?"

"నేనే కాదు, ఇరుగూ పొరుగూ కూడా అలాగే అడిగారు, వింటేనా?"

"మరి మీ అబ్బాయి–"

"అయితే, నేనూ వస్తాను పదండి అంటూ వెంటపడ్డాడు మావాడు మనలో మనమాట, మా వాణ్ణి నేనే పంపించాను సుమండీ!"

ఇలా అని, సుందరమ్మ, ముక్కూ మూతీ తిప్పకంటూ చురుగ్గా చూసింది.

"తెలిసింది కాదు, నిన్ననే వచ్చి మీకోడల్ని చూస్తును" అంది రత్తమ్మ.

"చూద్దురుగాని చూద్దురుగాని – మరిపోవాలి. ఇవాళ చింతామణి నాటకంట. పెందిరాడే రెండు మెతుకులు నోట్లో వేసుకుని – నా చిన్నకొడుకు గంటనుంచి తొందలు విడిపిం చేస్తున్నాడు."

ఇలా అంటూనే సుందరమ్మ తుర్రుమంది.

రత్తమ్మ, ముందు రిచ్చపడి, తరవాత గుడికి వెళ్ళింది.

## 4

ఇద్దరూ మిషన్ ఆసుపత్రి ఆవరణలో యెదురుపడ్డారు.

"ఇలా వచ్చారేం?" అనడిగింది సుందరమ్మ.

"మా బంధువుల్లో వొకమ్మాయికి రాకరాక కడుపు వచ్చింది. ఎందుకయినా మంచిదని పురిటికి ఆసుపత్రికి వచ్చారు. చూసి వస్తున్నాను."

"పురుడు వచ్చిందా?"

"ఆ, నాలుగు దినాలయింది వచ్చి. గుమ్మడి పండువంటి పిల్లాడు పుట్టాడు. పుట్టింటివారూ, అత్తింటివారూ పొంగిపోతున్నారు, పెన్నిధి అబ్బినట్టు."

"అబ్బురమా? అయితే, అందరికీ అలాంటి పుట్టింటివారు దొరకవద్దూ?"

"అదేమిటండీ, కూతురు బాగుచూసి ఆనందించని పుట్టింటివారుంటారా లోకంలో?"

"అయ్యో, అడిగారూ మా వియ్యాలవారి సంగతి?"

"అదేమిటండీ?"

"అదేమిటంటే? మా కోడలికి వొళ్ళంతా నీరు పట్టింది. అక్కడి డాక్టరు భయపెట్టాడు. తీసుకువచ్చి మా యింటిమీద పడేశాడు తండ్రి."

"పురుడు వచ్చిందా?"

"ఇంకాలేదండీ! తల్లీ తండ్రీ మాత్రం వచ్చి మా నెత్తిమీద కూచున్నారు, కోరి వింత వింత కూరలూ పచ్చళ్ళూ చేయించుకుంటూ."

"శాబాసు"

"కూతుర్ని కనిపెట్టికుని తల్లీ, గోదావరి రేవులు కనిపెట్టుకుని తండ్రీ కూచుంటారు. ఎక్కడో పనికిమాలిన సంబంధం వచ్చిపడింది మాకు. చచ్చిపోతున్నాను, వారిని కూచోపెట్టి మేపలేక."

"మీ అబ్బాయికి వుద్యోగం—"

"ఇంకా దొరకలే దండీ! ఏమిటేమిటో వున్నాయి; కాని మావాడు పెద్ద మనుష్యుల దగ్గరే కాని – అదయినా దర్జాగా కూచుని పురమాయింపులు చేసే పెద్ద గుమాస్తాపనే కాని చెయ్యడండీ! నాలుగు రాళ్ళు పైగా కూడా దొరుకుతూ వుండాలి. అలాంటిది వచ్చినప్పుడే అని చూస్తున్నాడు."

"మా కలా సాగదండీ మరీ! మా అబ్బాయి యేటికడ్డపడ్డాడు సుమండీ! దినానికి మూడు రూపాయిలు తెస్తున్నాడిప్పుడు. ఎవరో పెద్దరెడ్డిగారుట, పెద్ద పెద్ద కంట్రాక్టులు చేస్తూ వుంటారుట వారు. నాలుగులక్షలకు వొప్పుకుని పెద్ద ఆసుపత్రి కట్టిస్తూన్నారు టిప్పుడు. జీతానికి రమ్మంటున్నారు వారు, పైని వుండి పనులు చేయించడానికి నా నాయన్ని."

"కూలీల మీద మేస్త్రీ పనా?"

"ఏమిటో చెప్పాడు – ఆపేరు జ్ఞాపకం లేదు. కానీ – నువ్విలా రా తల్లీ! ఇది నా చిట్టితల్లి. మీరు మార్కండేయస్వామి గుడి దగ్గిర కనపడ్డారూ? ఆవేళ, మధ్యాహ్నం యెండవేళ, యెవరో వొకావిడ రెండు జతల గాజులూ, గోవర్ధనం గొలుసూ అమ్ముకుందిట బజార్లో. అప్పు డక్కడే వుండిన మా అబ్బాయి, పాతిక రూపాయిల లాభం యిచ్చి అవి కొనేశాడు. ఇదిగో, ఆ గాజులు చెరిపించి, దీనికి రెండుగాజులూ, మిగిలిన బంగారంతో చెవులకు దిద్దులూ లోలకులూ, ముక్కుకి బేసరీ నిమ్మగుత్తీ చేయించాడు. గొలుసు మెరుగుపెడుతున్నాడు పనివాడు."

"డబ్బంతా యిప్పుడు కూలీలదేనండీ, ఏం, చేయించక?"

"......అదేం, మీ చేతిని వుంగరమూ, తక్కిన గాజుల జతలు రెండూ కనపడవేం?"

"అలాంటివి చూస్తే ఆసుపత్రివాళ్లు డబ్బు దోచేస్తారు. అంచేత, తీసి దాసివచ్చాను."

"రాత్రి యిక్కడ పడుకోవాలి కాబోలు. పాపం, పాత బట్టలతో వచ్చారు."

"అవునండీ!"

"కోడలి కేమయినా సుళువుగా వుందా?"

"ఏం, వుండకా? వారం దినాలకీ సూదిమందుకే తొంభై రూపాయిలయినాయి సుళువుగానే తిరుగుతోంది, యివాళో రేపో పురుడు వస్తుందంటోంది దొరసాని."

"మంచి ముహూర్తాన మీ అబ్బాయి కొమాళ్ళ తండ్రి కావాలి. మరి వెడతానండీ!"

"నడుస్తూ వుండండి. నేనూ వస్తాను. స్థానమూ, గగ్గయ్యా వచ్చారుట సావిత్రి ఆడడానికి. ఇది తప్పితే మళ్ళీ యెన్నాళ్ళకో గాని దొరకరు"

రత్తమ్మ తెల్లబోయింది. చేసేది లేక చక్కాపోయింది.

## 5

ఇద్దరూ జయా టాకీసు ప్రక్కన కలుసుకున్నారు.

రత్తమ్మ, తెల్లని మల్లుపంచె కట్టుకుని వుంది

ఆమె మెడలో గోవర్ధనం గొలుసూ, చేతులకు బంగారు గాజులూ మిలమిల మెరుస్తున్నాయి.

ఆమెకూతురు పువ్వుల పరికిణీ, గళ్ళ -ఫ్రాకూ తొడుక్కుని వుంది

ఆమెకున్నూ, చేతులకు గాజులూ, చెవులకు దిద్దులూ లోలకులూ, ముక్కులకు బేసరీ నిమ్మగుత్తీ వున్నాయి

సమీపాన, రత్తమ్మ కొడుకు ఎవరితోనో మాట్లాడుతూ నుంచున్నాడు

సుందరమ్మ, మాసికలు వేసిన పాతపంచె కట్టుకుని వెల వెలపోతున్నట్టుంది; కాని రత్తమ్మని చూసి గంభీర్యం తెచ్చుకుంది.

ఆమె చిన్నకొడుకు, జంతికల దుకాణం దగ్గిర నుంచుని తల్లికేసి చూస్తూ ఊటలూరుతున్నాడు.

"అదిగో, సూటువేసుకుని దొరటోపీ పెట్టుకున్నాడూ అతనే నండీ నా నాయన! రెడ్డిగారు నెలకి నూట యాభై రూపాయి లిస్తున్నా రిప్పుడు" అంది రత్తమ్మ

"కూలీల మీద మేస్త్రీకి అంత జీతం యిస్తారా యెక్కడైనా?" అనడిగింది సుందరమ్మ, బుగ్గను నొక్కుకుంటూనూ కళ్ళు తిప్పుకుంటూనూ.

"మేస్త్రీ కాదు, సూపర్వైజరుగా!"

"తాపీ పనివాడి కంత మంచి ఉద్యోగం యిస్తారా యెవరయినా?"

"అంత మంచిపని యిస్తారా" అని వింతా, "అంత పెద్ద జీతం యిస్తారా" అని ఆశ్చర్యమూ యెందుకూ? అది మనిషి బుద్దిని పట్టీ, తాహతుని పట్టీ, నడతని పట్టీ వుంటుంది. ఆ రెడ్డిగారి దగ్గిరే – వొక బ్రాహ్మణపిల్లాడు – బి.ఏ కూడానట – అట్టెండరుగా చేరాట్ట, ఆరుమాసాలు తిరిగితిరిగి నౌకరీ దొరక్క ఎవరికో ఎస్టిమేటు కాగితం యిచ్చి, వివరాలు చెప్పి, జవాబు త్వరగా పంపమన్నారని చెప్పిరమ్మన్నారుట

రెడ్డిగారు అంటే, ఆ బ్రాహ్మణ బిఏ. 'నే నలాంటి నామోషీపనులు చెయ్య' నన్నాట్టండీ! అదేమిటండీ, అట్టెండరుగా చేరాక మిడిసిపాటు కాకపోతే?" అని ముదలకించి చురుగ్గా చూసింది రత్తమ్మ.

"ఏమో, నే నేమెరుగుదునూ?" అంది సుందరమ్మ, మొగం పక్కకి తిప్పేసుకుని

"అప్పు డక్కడ వొక పెద్దమనిషి వున్నాట్టండీ!" అంటూ మళ్ళీ అందుకుంది రత్తమ్మ, మరికాస్త దగ్గిరసావెళ్ళి

"ఆయన, ఆ పిల్లాడి పుట్టుపూర్వోత్తరా లన్నీ యెరుగునట ఇంతా చేస్తే, ఆ అబ్బాయి తండ్రి వంటబ్రాహ్మడు టండీ! ఎందుకో అపరేషను చేయించుకుని, చీము పట్టగా విషమించి, ఆసుపత్రిలో దిక్కుమాలినచావు చచ్చాడుట అతని తండ్రి ఆ అబ్బాయి తల్లి, మొగు డ్లొప్పుడూ ససిపెట్టలేదుట సినీమా తార ల్లాగ వేషాలు వేసుకుని షష్ఠిగడియలూ వూరమ్మట తిరుగుతూ వుండేదిటావిడ ఒకమూల, మొగుణ్ణి, ఆసుపత్రిలో కిందికి దింపుతూ వుండగా, మరో మూల, ఆవిడ, నాటకశాల దగ్గిర టిక్కట్టుకోసం స్వయంగా యెగబాకుతోందిట ఇదంతా యేకరువుపెట్టి, 'ఎస్టిమేటు పట్టుకు వెళ్ళడం నీ బతుక్కి నామోషీ అయిందా' అని డెకారించాట్ట, ఆ పెద్దమనిషి, ఆ పిల్లాణ్ణి దీనిమీద రెడ్డిగారు 'నువ్విక మా కక్కర్లేదు, దయచెయ్యి' అని సాగనంపేశారుట ఆ పిల్లాణ్ణి బ్రాహ్మడయితే మాత్రం, నీతీ జాతీ లేకపోయాక పూజిస్తారుటండీ లోకులూ?"

సుందరమ్మకి మాట రాలేదు.

కాలి బొటనవేలితో నేలమీద రాస్తూ మొగం వంచేసుకుందామె

అప్పుడు, సుతారంగా తల పంకించుకుని, రత్తమ్మ "ఆవేళా — మనం ఆసుపత్రిలో కలుసుకున్నామూ?" అంటూ మళ్ళీ అందుకుంది

"అక్కణ్ణుంచి నే నింటికి వెళ్ళాటప్పటికి, నా నాయన రెండు జతల బంగారు గాజులూ, వొక రాళ్ళ వుంగరమూ కొనుక్కువచ్చాడు. అంత క్రితమే యెవరో వొకావిడ అమ్ముకుందిట అవి. మళ్ళీ పాతిక రూపాయీలు లాభం యిచ్చి అవిన్నీ కొనేశాడు నా నాయన 'పెళ్ళిలో, నీ పెళ్ళానికి పెట్టుకుందువు గాని దాచుకో నాయనా' అన్నాను నేను; కాని యెంత చెప్పినా నా మాట వినక 'నేను నాన్నబదులూ నీబదులూ నిన్నే సంతోషపెట్టాలి నా పెళ్ళినాటికి నేను మళ్ళీ సంపాదించుకో లేకపోను, నువ్వే పెట్టుకో' అని గాజులూ గోవర్ధనం గొలుసూ నేను పెట్టుకునేదాకా బలవంతం చేశాడు నా నాయన ఇదిగో చూశారా?"

ఇలా అడుగుతూ వొకచేత గొలుసు యెత్తిపట్టుకుని, గాజులు కనపడ్డాని కొక చెయ్యి ముందుకి చాపి, మరీ దగ్గిరసా వెళ్ళింది రత్తమ్మ, కాని సుందరమ్మ కిక్కురుమనలేదు.

రత్తమ్మకి చిరునవ్వు వచ్చింది; కాని అది అపుకుని ఆమె "నేను నాయన మాట తీసెయ్యలేకపోయానండీ! ఉంగరం మాత్రం నా బలవంతాన అతనే పెట్టుకుంటున్నాడు సుమండీ! మొలిచినట్టు సరిపోయింది అతని అనామిక కది అతను సొంతంగా చేయించుకున్నట్టే అమరింది అది. మార్కండేయస్వామి దయవల్ల మాకిక లోటు లేదు. నా నాయనకి, వెయ్యి నూటపదహార్లూ వెండి చెంబూ వెండి

కంచమూ పట్టుతాపితాలూ యిస్తామనీ, నాకూ నా చిట్టితల్లికీ చెరో నూటపదహార్లూ తక్కిన లాంఛనాలూ యిస్తామనీ – యెవరో కాకినాడ కాలేజీలో ప్రొఫెసరుట, తన కూతుర్ని చేసుకోమంటూ నిన్ననే వచ్చారు. ఏలూరినుంచి, ఆయన వుండగానే 'రేపు పెళ్ళికొడుకు చూపులకు వస్తున్నా' మని గుమాస్తాచేత కభురుచేశా రొక ప్లీడరుగారు. తొందర ఎందుకని మే మింకా యెవరికీ మాట యివ్వలేదు ఇద్దరు పిల్లలూ రజస్వల అయిన వాళ్ళేట. బంగారు బొమ్మలు కూడానట. ఏలూరిపిల్ల బాగా పాడుతుందిట గాని, కాకినాడపిల్ల ఎలాంటి పురాణమూ కూడా ఎంచక్క చెబుతుందిట. నా నాయన పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి సుమండీ? ఏదీ, నాయనా, యిలా రావోయ్! బాగుందేమో చూస్తారు, నీ వుంగరం వొకమాటు సుందరమ్మగారికి చూపించు. పాపం, మన మంటే యెంతో అపేక్ష ఈవిడకు" అంది కళ్ళు చికిలించుకుంటూ.

సుందరమ్మ మొగం యెత్తలేదు

ఇటయినా తిప్పలేదు

మాట్లాడలేదు.

నుంచోనే లేదు.

ఒక్క అంగలో వెళ్ళి చిన్న కొడుకు రెక్కపట్టుకుని వొక్క గుంజు గుంజింది ఆమె.

ధుమధుమ లాడుతూ, వాణ్ణి బరబరా యీడ్చుకుపోతూ రెండో అంగలో నాళంవారి సత్రం దాటేసింది.

చిరునవ్వు నవ్వుకుంటూ, తల పంకించుకుంటూ, చూస్తూ వూరుకుంది

అప్పటికి తల్లి దగ్గిరికి వచ్చి, తాపీమేస్త్రీ రామదీక్షితులు బి.ఏ, ఇదేమిటో అర్థంకాక , తల్లిని విడిచి సుందరమ్మనీ, సుందరమ్మని విడిచి తల్లినీ చూస్తూ నిలిచిపోయాడు.

ఇదంతా చూసి పక పక నవ్వుతున్నట్టు, జయా టాకీసు వారి లౌడ్‌స్పీకరు బర్రు మంది.

*(1947 ఫిబ్రవరి ఆంధ్రశిల్పి నుంచి)*

[1–12–46 తేదీ నవోదయ సంచికలో ప్రకటితమైన శ్రీ రావూరి గోవిందాచారిగారి "కూటికోసం" అనే చిన్నకథ చదవగా, తోచిన కథ యిది.]

★ ★ ★

# గులాబీ అత్తరు

ఒక్క అడుగు వేస్తే దివాంజీ కనపడతాడు.

అతగా డొక్కమాటు తమకేసి చూస్తే చాలునని ఆత్రపడుతూనూ, అతని కటాక్షం ఆశించీ, అతని అనుగ్రహం యెదురుచూస్తూనూ, అతని ఆలంబనం నమ్ముకునీ, అతనిచేత "సరే"అనిపించుకోడానికి తగ్గ యెత్తు లాలోచించుకుంటూనూ; అయినా, అతని లోభగుణం మాత్రం లోపల్లోపల గర్హించుకుంటూనూ ఆ గదిలో పరివేష్టించి వుండిన ఆశ్రితులూ, పౌర ప్రముఖులూ, రాజ బంధువులూ, రాజ పురుషులూ కొందరక్కడికే కనపడుతున్నారు

వారిలో కొందరు తనకేసీన్నీ చూశారు

అలాంటి చోట నుంచుని, మొదట వొక్ఖమాటు గదిలోకి తొంగిచూసి, తరవాత నిటారుగా నుంచుని, నుంచున్న వెంటనే తాపీగా రెండుచేతులూ చాపి, గభీమని బిరడా తీసి సీసా గాలివాటాన పెట్టాడు షుకురల్లీఖాను, తల వెనక్కి విరుచుకుంటూ

బిరడా తీశాడు, అంతే, వెంటనే బిగించేశాడు

కాని, ఆ క్షణమాత్రానికే అతని చుట్టూ వుండిన జవానులు తుళ్ళిపడి మత్తెక్కుతున్న ట్టయిపోయారు.

లోపల వుండిన పెద్దమనుష్యులు, ఉలిక్కిపడి యెగ వూపిరి తీసుకుంటూ యిటు చూశారు

దివానుకి పక్కగానూ కొంచెం వెనకవాటుగానూ నుంచునివుండి, అతని రాతలు ఓరకంట చూస్తున్న రాణేదారున్నూ చకితుడై "వచ్చాడా?" అన్నట్టొక మాటు గుమ్మంకేసి చూసి, మళ్లీ మొగం వంచుకున్నాడు, సాలోచనగా

అప్పటి కప్పుడే చర్రున మొగంపైకెత్తి "ఏయ్! ఏమిటీ కంపు?" అంటూ గద్దించాడు దివాంజీ, దగ్గుకుంటూనూ తీక్ష్ణంగా చూస్తూనూ

దీంతో పండువెన్నెట్లో కటికచీకటి రేఖ విరిసినట్టయింది

కొంచెం ఘాటుగానే వుండినా, హృదయంగమమైన వట్టివేళ్ళ అత్తరు కమ్మదనం దివాంజీకి కంపుగా తట్టడంచూసి లోపలివా రందరూ మొగమొగాలు చూసుకున్నారు, ఉబికిన నవ్వు కళ్ళల్లో కుక్కుకుంటూ

"అరే, అరే" అనుకుంటూ మొగం పక్కకి తిప్పుకుని, రాణేదారు పెదవి కరుచుకున్నాడు, తన రసికత గుర్తించ మన్నట్టొక రాజబంధువు కేసి బెల్లించి చూస్తూ.

జవానులున్నూ అందుకు వింతపడి, అపవారించి పెదవులు కరుచుకున్నారు.

ఖాను కొయ్యే అయిపోయాడు.

కంపు అన్నమాట అపశ్రుతిగా కనపడిం దతనికి

మాంచి పరువైన యాభైయేళ్ళ వయస్సున్న, అత్తరు సౌరభం కంపుగా వెలపరించుకునే మనిషి కనపడడం అతని కిదే మొదటిసారి

మొన్న మొన్ననే – రెండు మాసాలపాటు నానాపాట్లూ పడిగాని గోలకొండకోటలో అడుగు పెట్టలేకపోయా డతను.

అసలు, వజీరు దర్శనమే కాలేదు – నెలా పదిహేనుదినాలు పడిగాపులు పడివుంటేనేగాని.

ఆ ప్రయత్నంలో, నిజంగా, తల ప్రాణం తోకకు వచ్చిం దతనికి; కాని దర్శనం యిచ్చాక మాత్రం యీ వట్టివేళ్ళ అత్తరుకే ఆ వజీ రెంత ముగ్ధుడయిపోయాడు?

అప్పుడక్కడ వున్నవారున్నూ ఎంత సంబరపడ్డారూ?

తరవాత, నవాబున్నూ యెంత మెచ్చుకోలేదూ?

మరి యిక్కడ, పెద్దాపురంలో, అడుగు పెట్టిననాడే కావలసిన భోగట్టా అంతా దొరికిపోయింది.

మర్నాడు రాణేదారు ప్రసన్ను డయిపోయినాడు.

మూడో నాడే కోటలో ప్రవేశం దొరికింది

అయితే, అంత సౌలభ్యానికీ చివరి కిదా పరిణతి?

హిందువులలో విభ్రమవిలాసాలకు తగినంత విలవ లేకపోవడం అతనెరుగును.

పోనీ అంటే, నిర్లిప్తత కూడా అంతంతగానే వుండడమున్నూ అతనెరుగును

అయితే మాత్రం యింత తల్లకిందులా?

ఇంతకీ అత్తరు సువాసన చెడుకంపుగా బాధపడే మనిషి, రాజు తరవాత రాజంతవాడయి వుండడమా?

రాచ రీవికి ఇది ప్రశంసావహమా?

దీనివల్ల, మహారాజు ప్రాభవం విషయమూ, వైభవం విషయమూ దివాంజీకి లక్ష్యం లే దనుకోవాలా? లేక మహారాజు ప్రవృత్తి కూడా యిలాంటిదే అనుకోవాలా?

ఇది మిక్కిలీ అసంభావ్యంగా కనపడిం దతనికి.

"చివరి కేది యెలా సంభవిస్తుందో?" అని అనుమానమున్నూ పట్టుకుంది.

ఇంతమాత్రాన నిరాశ చేసుకోలేదుగాని చేసుకోక తప్పదేమో అన్నట్టు జవాన్లకేసి అభావదృష్టులు పరిపాడతను.

ఈ స్థితిలో "ఏయ్ జవాన్?" అని పిలిచాడు రాణేదారు, ద్వారంకేసి చూస్తూ.

"చిత్తం బాబయ్యా!" అంటూ వెంటనే లోపలికి వెళ్ళి జవాను "డిల్లీ నుంచి అత్తరు వర్తకు డొకడు వచ్చి దర్శనం కోరుకుంటున్నాడండి" అని విన్నవించాడు.

దీనిమీద "అతనే, నేను మనవి చేసుకున్న సాయిబేనండి" అన్నాడు రాణేదారు, మెల్లిగా; కాని, దివాంజీ మొగం పైకెత్తలేదు.

పైపెచ్చు "దివాణంలోనే అంగడి తెరుస్తా డటనా సాయిబు?" అని ముదలకించాడు, కొంచెం కటువుగా.

ఇది విని ఖాను తెల్లపోయాడు.

జవానే కాదు, రాణేదారు కూడా జంకిపోయాడు, అందుకు ప్రత్యుత్తరం చెప్పడానికి.

కాని "చిత్తగించారూ?" అంటూ వొక బోసినోటి శాస్త్రులు మాత్రం అందుకున్నాడు, తన ప్రతిభ చూపించడానికి మాంచి అవకాశం దొరికిందన్న ఊత్సాహంతో, నలుగురికేసీ చూస్తూ.

అయితే, అప్పుడు కూడా దివాంజీ మొగం పైకెత్తి చూడకపోగా, అతణ్ణే మాత్రం వుద్దేశించి, ఒక్కొక్కమాట కొక్కొక్క పెద్దమనిషికేసి చూస్తూ "దివాణంలోనే అంగడి తెరుస్తాడటనా? అంటే చెప్పలేనుగాని, అతను చేసిందాల్లో మంచి భావుకత మాత్రం కనపడుతోంది. ఏమంటే? రాణేదారుగారి పరిచయ వాక్యాలవల్ల అతను ఫలానా అని మాత్రమే తెలుస్తుంది అతని సామర్థ్యం అజ్ఞాతంగానే వుండిపోతుంది ఆ విషయం తనకి తానై చెప్పుకోడం యెవరికీ రసికతాముద్రకాదు అంచేత, తన అత్తరుసువాసనతోనే తన విషయం యావత్తూ విశదపరుచుకున్నా డతను ఇది చాలా గొప్పగా వుంది. ఢిల్లీలో మసులుకుంటున్న మనిషి కిదొక లెక్కా మరి? అక్కడ యెంతంతలేసి ఉమ్రావులున్నారు? వారిదగ్గిర మసులుకునే మనిషి సామాన్యుడయివుంటాడా? చాలా బాగుంది. తప్పకుండా చూడతగ్గవాడతను" అన్నాడు శాస్త్రులు, చివరి మాట రాణేదారు కందచేస్తూ

అయినా, దివాంజీ మాట్లాడలేదు

చూడనే లేదు.

రాస్తూరాస్తూ వుండిన కలంమాత్రం కిందపెట్టేసి పొడుంకాయ అందుకున్నాడతను, అంతే!

"ప్రవేశపెట్టు" అన్నాడు రాణేదారు, సరే అనేమాట దివాంజీ ప్రకటపరచే పద్ధతి అని తెలుసు కనక.

ఈ మాటమీద దివాంజీ కనుబొమలు ముడిపడ్డాయి

ఏదోవొక గంభీరాలోచన అతనిబుర్రలో ప్రవేశిస్తూ అది కళ్ళల్లో తళుక్కుమంది.

తన రసజ్ఞత అంతా వ్యర్థం అయిపోయినందుకు కించపడుతున్న శాస్త్రులు అదిచూసి ఉలిక్కిపడ్డాడు

అప్పటికప్పుడే వొక్క అంగలో లోపలికి వెళ్ళి "దివాంజీ వారికి కోటి సలాములు. నేను ఢిల్లీనుంచి వచ్చానండి, ఏలినవారి పాదాలు వెతుక్కుంటూ" అన్నాడు ఖాను, చేతులూపుకుంటూనూ, మూడుమాట్లు వంగిలేస్తూనూ.

"ఏమి పని?" అనడిగాడు దివాంజీ దర్పంగా, అతని సలాములు కళ్ళతో అందుకుని.

"నే నత్తర్లు తయారుచేస్తాను మహాప్రభూ! దక్షిణ దేశంలో, గోల్కొండ తరవాత పెద్దాపురం వొక్కటే చూడతగ్గది అని విన్నాను, రెక్కలు కట్టుకువచ్చి వాలాను, తమరు కటాక్షించాలి"అని వేడుకున్నాడు ఖాను

"రెక్కలుండడమే వస్తే యెక్కడో వొకచోట వెళ్ళి వాలక, ముడుచుక్కూచుంటాడా మరి యెవడయినా?" అని ముదలకించాడు దివాంజీ

అందులో వున్న దెబ్బ ఖాను గుర్తించకపోలేదు; కాని "తమరు సరిగా సెలవిప్పించారు మహాప్రభూ! ఏమంటే, రెక్కలున్నందుకు వినియోగం, యెక్కడ సరసులుంటే అక్కడ వెళ్ళి వాలడమే కనకనే నాలుగు తరాలనాడు, మా కుటుంబం, పారశీకదేశం విడిచి డిల్లీవచ్చి వాలింది. వచ్చాక కూడా సైన్యంలో చేరడానికెన్ని అవకాశాలు తటస్థపడినా, పేరుతెచ్చిన కళాజీవిక విడిచిపెట్టలేక అత్తరులే తయారుచేసి డిల్లీ పాదుషాల ఆదరగౌరవాలు పొందుతోంది" అన్నాడు, ధోరణి మార్పించదలిచి

దీంతో "కావచ్చు" అన్నాడు దివాంజీ, కొంచెం వడి మళ్ళి; కాని చూపుల్లో మాత్రం సారళ్యం అంకితం కాలేదు.

"మా నాయనగారి సెలవుపొంది, నేను, దక్షిణదేశ ప్రభువులను సేవించుకోడానికి వచ్చాను. గోల్కొండ నవాబుగారూ, అక్కడి వజీర్లూ మా పరిశ్రమ గుర్తించి మిక్కిలీ ఆదరించారు"

"ఇంకేం?"

"ఇంకేమంటే మనవి చేసుకున్నాను గదా, గోల్కొండ తరవాత పెద్దాపురమే చూడతగ్గదని విన్నానని? ముందు తమరిది చిత్తగించకోరుతున్నాను"

ఇలా అని, ఖాను, మూత తెరిచి వొక చిన్నపెట్టె దివాంజీ సందుకా పెట్టెమీద వుంచాడు.

లోభాగాన, ఎర్రని ముఖమల్ గుడ్డ అతికించిన చక్కని పెట్టె అది.

అందులో వొక చిన్నసీసా.

చక్కని నగీషీపనితో యెంతో ముచ్చటగా వుందది.

సీసాలో సగానికి పైగా అత్తరు వుంది.

అది చూసి అక్కడివారందరూ గుటకలు మింగారు

"అది మల్లె అత్తరు మహాప్రభూ! అందులో వున్నది రెండే తులాలు; కాని రెండువసంతాలకు తయారయిందది"

"వోస్!"

"మా వస్తువు మర్యాద మాకు మేమయినా చెప్పకోడం ధర్మం కాదు, చిత్తగిస్తే తమకు తెలియందీకాదు. అయితే మొగం కొంచెం యెడంగా వుంచి మరీ మూత తీయించండి మహాప్రభూ!"

దీనిమీద, అక్కడివారందరూ తమ ఘ్రాణేంద్రియానికి ఏకాగ్రత అలవరచుకున్నారు; కాని "మాట్లాడాటప్పటికి ముందు మూత తియ్యడమేపనా మాకు?" అనడిగాడు దివాంజీ, దురుసుగా

ఖాను మళ్లీ కుతకుత లాడిపోయాడు.

అయితే, అధికార దర్పం వొక్కొక్క మనిషిలో ఎలాంటి పశుప్రవృత్తి రేకెత్తిస్తుందో అతనికి తెలుసు

లక్షల కొద్దీ అధికారులతో నిండివుండిన డిల్లీ నగరంలో, అతను, మొదట అర్జించింది యీ పరిజ్ఞానమే.

ఇలాంటి వాటికి నసాళం అంటేటట్టు బదులు చెప్పడమూ అతనిచేతనవును.

మరొక పనిమీద వచ్చివుంటే అత నందుకు సందేహించకా పోవును.

కాని, యిప్పు డలా చేస్తే కార్యం భంగపడుతుంది.

పారితోషికం కంటే, తన అత్తర్లకు దేవదుందుభులు మోగడం అతనికి మిక్కిలీ అగత్యం.

అది, రాజు యెదుట పడగలిగితేనే సిద్ధిస్తుంది.

రాజసభలు కంటకభూయిష్ఠాలూ, హింస్రకమృగాకీర్ణాలున్నూ

పాలకోసం రాయి మొయ్యాలి.

అంచేత, అత నోపికపట్టాడు.

ఇంతేకాదు.

అలాంటి దురుసు మనిషిని, అందుకు తగ్గట్టు మాట్లాడి అంతకంటే యెక్కువగా నొప్పించడం కంటే, తగ్గి మాట్లాడి, దారికి తెచ్చుకుని, పిడికిట పట్టుకుని ఆడించడం కూడా వ్యవహర్తల లక్షణమే

ఈ నిశ్చయంతో అతను "ఏలినవారి—" అంటూ ప్రారంభించాడు; కాని మాట సగంలోనే కలగజేసుకుని, రాణేదారు "దివాంజీవారు అది సావకాశంగా చిత్తగిస్తారు. ముందు నువ్వు వచ్చిన పనేమిటో మనవిచేసుకో" అని అందించాడు

"చిత్తం, చిత్తం" అంటూ మరోపెట్టె తెరిచి దివాంజీ యెదట వుంచాడు ఖాను, రాణేదారు సమయ స్ఫూర్తికి కళ్ళతో మెప్పు చూపిస్తూ

లోభాగాన ఆకుపచ్చ ముఖమల్ గుడ్డ అతికించిన చక్కని పెట్టె అది.

ఎర్రని అత్తరుతో, అపురూపమైన నగిషీపని చేసిన చిన్న సీసా వొకటి, కోటికిరణాల జాతిరత్నం లాగ మెరిసిపోతోంది, అందులో

అక్కడివారు దాని చక్కదనానికి ముగ్ధు లయిపోయారు; కాని దివాంజీ అటు చూడనే లేదు

అందుకున్నూ నరాలు తోడేసినట్టయిపోయాడు; కాని యేమీ యెరగనట్టు "ప్రభువులకు తెలియంది లేదు" అంటూ ప్రారంభించాడు ఖాను

"పెద్దాపురం ప్రభువులకు నజరుపెట్టుకుందా మని తయారుచేశా నది గోల్కొండ నవాబుగారికి వట్టివేళ్ళ అత్తరు మిక్కిలీ ప్రియం అని తెలిసి అదెంత శ్రద్ధగా తయారుచేశానో, పెద్దాపురం మహారాజులుంగారికి గులాబీ అత్తరు మిక్కిలీ ప్రీతిపాత్రం అని తెలిసి యిది అంత శ్రద్ధగానూ తయారుచేశాను ఆ సీసాలో వున్నది వొక్కటే తులం — దాని నిమిత్తం కాశ్మీరం జాతి పువ్వులు వాడాను డిల్లీ పరిసరాల్లో పారశీక జాతులే యెక్కువ. కాశ్మీరజాతి చాలా అరుదుగా దొరుకుతుంది అంచేత, ఆ కాస్త అత్తరూ తయారుకావడానికి ఖరాగా రెండేళ్ళు పట్టింది మహాప్రభూ" అని వివరించి చెప్పాడతను.

ఇది విని అక్కడివారు, దాని విశిష్టతా విలవా వూహించుకుని చాలా ఆనందించారు; కాని "ఆశ్చర్యమా?" అనడిగాడు ముందు దివాంజీ, మెల్లిగా

"గొప్ప వస్తువులు తయారుచెయ్యాలంటే గడియల్లో సాగుతుందా మరి?" అంటూ ఖాను పరిశ్రమ మెచ్చుకున్నాడు తరవాత.

కాని "యెంతకి కిట్టింది పాపం?" అనడిగాడు చివరికి, జాలిపడుతున్నట్టు బెల్లించి చూస్తూ.

ఖాను నిర్విణ్ణు డయిపోయాడు.

అది గుర్తించి, కళ్ళంతా గర్వం చేసుకుని, తలపంకించుకున్నాడు, దివాంజీ.

అతగాడి నిర్విణ్ణతా, ఇతగాడి గర్వరేఖా చూసి, అక్కడి పెద్దమనుష్యులందరూ చకితు లయిపోయారు.

అనేక రాజసభలూ, ఎన్నో నవాబు దర్బారులూ చూసి, సమస్త మర్యాదలూ అనుభవించిన షుకురల్లీఖాను, అనేక శోధనలకు తట్టుకోగలిగిన ఆ కళాశీలి, యీ కొత్త దెబ్బకు వూగిపోయిన్నీ, మహారాజు మిక్కిలీ సరసుడని విని వున్నాడు కనక, రాజదర్శనంతో యీ మనోవైకల్యం అంతా పోతుందని ఆశించుకుని, అత్తరు సౌరభం కంపుగా భావించిన అధికారి దగ్గర యింతకంటే రసికత వుంటుం దనుకోడం తనదే తప్పని తనకి తానే మందలించుకుని, అప్పటికి చేసేది లేక, యీ నిర్విణ్ణతా, దీంతో పుట్టిన కోపమూ, ఆ వెంటనే వచ్చిన యేవగింపులూ అణుచుకుని, వినయమున్నూ తెచ్చుకొని, "అది నజరువస్తువు మహాప్రభూ! దక్షిణదేశాని కంతకీ జాతిరత్నం శ్రీవత్సవాయి ప్రభువు నిమిత్తం ఉద్దిష్ట మైనదిన్నీ ఈ కారణాల వల్ల దాని కిట్టింపు ధర అడగడం మాకు మన్నన కాదండీ!" అన్నాడు, కళ్ళతో బాధ కనపరుస్తూనే.

దీనిమీద "మరి మా ప్రభువులను మీరెంతగా గౌరవిస్తున్నారో మాకు తెలియడం యెలాగా?" అనడిగాడు దివాంజీ అమాయకత్వం నటిస్తూ.

"పెద్దాపురం రాజసభలో యిలాంటి వస్తువుల విలవలు కట్టగలవారు లే రని నే ననుకోగలనా మహాప్రభూ?"

"మా ప్రభువు కోసం ఉద్దిష్టమైన వస్తువు వారి సెలవు పొందకుండా విప్పి చూడడం మాకు ధర్మమే అనుకోనా నేను మరి?"

"మరి ప్రభువుల సన్నధికి —"

"అది సరే నయ్యా! మేము వారి భృత్యులం కదా, మేమూ కొన్ని విధులు నిర్వర్తించుకోవాలేమో?"

ఎగిసిపడి "ఇదా విధినిర్వహణం?" అన్నట్టు చురుగ్గా చూశాడు, బోసినోటి శాస్త్రులు, కీగంట.

ఇదలా జరుగుతూ వుండగానే "నేను మనవిచేసుకునేది అదే మహాప్రభూ!" అన్నాడు ఖాను.

"ఒకరితో మనవిచేసుకోడానికీ, సొంతానికి సత్యం గుర్తించడానికీ చాలా అంతరం వుంది. మీ ఢిల్లీలో, వజీర్లు, ఎవరే వస్తువు తెచ్చినా దాని మంచిచెడ్డలు తెలియకుండా అది పాదుషావారి సన్నిధిని వుంచనిస్తారా?"

తల తాటించుకుంటూ దివాంజీ యిలా అడిగాటప్పటికి, ఖాను, నిలువునా నీరయిపోయాడు.

వట్టివేళ్ళ అత్తరు సౌరభంతో అతని యెడల మిక్కిలీ అనురక్తులయి వుండిన పెద్దమనుష్యులు యీ మడత పేచీ గుర్తించి నిర్విణ్ణులయినారు

రాజబంధువులలో వొకాయన, అపవారించి, దివాంజీ యెడల నిరసన భావం కనపరచగా, బోసినోటి శాస్త్రులు నుదుట "రాత" అన్నట్టు వేలితో పాముకొని మొగం వంచుకొన్నాడు.

రాణేదారు ఇదంతా గుర్తించాడు.

వెంటనే ఖాన్నుణ్ణి సంబోధించి "దివాంజీవా రిప్పుడు చాలా తొందర పనిలో వున్నారు. ఇప్పటికి వెళ్ళిపో, మరోమాటు దర్శనం చేసుకుందువుగాని" అన్నా డతను.

"ఇది బాగుంది" అన్నట్టందరూ తలలూపుకున్నారు.

అంతమంది పెద్ద మనుష్యులకు తన యెడల సానుభూతి వుండినందుకు తృప్తిపడి, మళ్ళీ సలాములు చెప్పి, బుర్రవంచుకుని వెనక్కి అడుగులేస్తూ బయలుదేరాడు ఖాను.

గుమ్మం దాటాటప్పటికే రెండు పెట్టెలూ తెచ్చి వొక జవాను అతని చేతిలో వుంచాడు.

ఆ రాత్రి తెల్లవార్లూ కంటికి నిద్రలేదు, ఖానుకి.

నోటికి ముద్దకూడా పోలేదు

బుద్దిన్నీ మందగించిపోయింది.

కళ్ళు మూసుకున్నా తెరుచుకున్నా దివాంజీ చికిలింపు చూపులే కనపడసాగాయి.

కిట్టింపుధర చెప్పమనడం ఒక్కటే జ్ఞాపకం రాసాగింది.

దీంతో, క్షణక్షణమూ యీ పోట్లు తింటున్నట్టే బాధ పడిపోయా డతను.

ఐతే, లోక ప్రవృత్తి యేకముఖంగా వుండదు, సత్యమే.

ముక్కుకు సూటిగా వెడదామంటే యెవరికీ సాధ్యమూ కాదు, నిజమే.

దీనికి సాయం, ప్రతిఘటనలు తటస్థించితేనే జీవితానికి పరిణతి.

ప్రతిఘటనలు అతిక్రమించగలిగితేనే జీవితానికి విజయమున్నూ. కాని, వొక్కొక్క జీవితానికి హృదయమే పునాది అయితే, మరొక్కొక్క జీవితానికి మేధస్సు ప్రధానం అయివుంటుంది.

ఎక్కడ మేధస్సు ప్రధానమో అక్కడ అనుభూతి తక్కువయి పోతుంది.

అక్కడ సానుభూతిన్నీ పూజ్యమే.

ఏ జీవితానికి పునాది హృదయమో అది కళాబంధురం.

అక్కడే కళలకు పరిణతి.

అక్కడే కళలకు వినియోగం.

అక్కడే తన్మూలంగా ఆనందానుభవమున్నూ.

అలాంటి ఆనందం తాననుభవించాలన్నా, ఇతర్లకు కలిగించాలన్నా ఆ కళాశీలి మహామేధావి అయివుండాలి.

మహా తపశ్శాలిన్నీ అయివుండాలి.

కళావేత్తృతలోనే–కళాసాధనలోనే తనజీవితం పరిపక్వం చేసుకుంటూ వుండాలి.

ఏమంటే?

ఎవరి సంకల్పం విశుద్ధమో, ఎవరి హృదయం కళామయమో, ఎవరి దీక్ష అలోకసామాన్యమో, ఎవరి ప్రాప్యం లోక కళ్యాణమో ఆ కళాశీలుల నిర్మాణాలే ద్వంద్వ భూయిష్ఠమైన భౌతికజగత్తులో ధ్రువతారలయి మెరుస్తూ వుంటాయి.

నిజంగా ఖాను అలాంటి కళాశీలి.

అతని అత్తరు లలాంటి ధ్రువతారలు.

అయినా "అక్కర్లేదు", అని చెప్పేస్తే, వెంటనే అత నర్థమూ చేసుకో గలడు, సులభంగా నిరాశా చేసుకో గలడు, నిర్విచారంగా వెళ్ళిపోనూ గలడు; కాని యిదేమిటీ యీ వాలకం?

తన అత్తర్లకు విలవ కేవలమూ డబ్బే అయితే అందుకోసం అతనింత దూరం రానక్కర్లేదు.

ఉన్నవూరే కదలనక్కర్లేదు.

అసలు, ఢిల్లీనగరమే వొక మహాదేశం అంత.

అక్కడే యెందరో ప్రభువులూ, సంపన్నులూను.

వారిలో, ఎందరో రసికులు.

అతని అత్తర్లు కళ్ళకద్దుకునేవారు వారిలో మళ్ళీ వందలూ వేలూను.

అయితే, పెద్దాపురం ప్రభువు, శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీవత్సవాయి చతుర్భుజ తిమ్మ జగపతిమహారాజు రసికత ఢిల్లీలో గుబాళించింది.

ఢిల్లీ పాదుషా రసికతకు వంకలు దిద్దింది

ఖాను ఆగలేకపోయాడు.

దీక్ష పట్టాడు.

తపస్సులో కూచున్నాడు.

అపూర్వసాధన చేశాడు.

తహతహలాడిపోయాడు.

రెక్కలు కట్టుకువచ్చి వాలాడు.

కాని, షష్ఠి గడియలూ పువ్వులతోనే కాలంగడిపే అతనికి, ఇక్కడ ప్రభుదర్శనం గగనపుష్పం అయిపోయింది.

అపూర్వమైన జాతిరత్నం గులకరాళ్ళలో కూడుకుపోయి వుండిన ట్టనిపించిం దతనికి.

వచ్చి వచ్చి ముళ్ళ కంచెల్లోనూ, మురికి గుంటల్లోనూ పడిపోయినట్టు బాధపడ్డా డతను.

"అంత ఢిల్లీలోకూడా – అంతంతలేసి వజీర్లయినా చెయ్యలేని కుట్ర యిది" అని పరితపించా డతను.

బయటవుండగా పెద్దాపురం యెంత ఆశ కొలిపిందో, వచ్చి ప్రవేశించాక అంత దిగగుంజేసిన ట్టనిపించిం దతనికి.

దక్షిణదేశానికి దక్షిణదేశమే దుష్టమృగ సంకీర్ణం అయిన కీకారణ్యంలా తోచిందతనికి.

దీంతో "ముక్కూ మొగమూ యెరుగనిచోటికి రావడం మనదే బుద్ధి తక్కువ" అని పిసుక్కున్నాడతను.

కాని, తన భృత్యుల చేతిలో వొక కళాశీలి ఎంత క్షోభ పడుపోతున్నాడో మహారాజు కెలా తెలుస్తుందీ?

లోకంలో, యెక్కడా కూడా యిలాంటి అంతరువులు తప్పవంటే సమ్మతమే.

అయితే, ఎంతెంతలేసి ధర్మరాజ్యాలలోనూ, మహోదారులైన యెలాంటి ధర్మ ప్రభువుల పరిపాలనలోనూ అసంతృప్తి కలిగిం దంటే – వీవగింపు పొటమరిచిం దంటే – విరోధభావం పుట్టుకువచ్చిం దంటే – కల్లోలాలు చెలరేగాయంటే అక్కడి కార్యనిర్వాహకుల యిలాంటి అతి లౌక్యాలవల్లనే.

కాని, యేది యేమయినా, ఎంతచూసినా ఖాను కిక్కడ వొక్కటే ఫలితం.

అంచేత "సన్మానం మాట దేవు డెఱుగును, మర్యాదగా అయినా యిక్కణ్ణుంచి వెళ్ళగలమా?" అని బెంగ పట్టుకుం దతనికి.

ఇలా వుండగానే కోళ్ళు కూశాయి.

పనిలో పని కాకులు కూడా కూసేశాయి.

## 4

తెల్లవారడం తడవుగా వెళ్ళి రాణేదారు పాదాలమీద వాలాడు ఖాను.

ఇంతవరకూ అంత గొప్ప అత్తర్లు పెద్దాపురం కోటకు రాలేదు, రాణేదారుకి తెలుసు.

ఖానుకి మంచి సన్మానం జరగడం దివాంజీకి సుతరామూ యిష్టంలేదు, ఇదీ తెలుసు అతనికి.

బుర్ర యెగిరిపోడానికి కయినా వొప్పుకుంటాడు; గాని, ఖాను, కిట్టింపు ధర చెప్పడు, ఇదిన్నీ తెలుసు అతనికి.

చూశాడంటే, మహారాజు, ఖాను అత్తర్లు విడిచిపెట్టడు ఇది, ఆ సమయంలో, దివాంజీ దగ్గిర వుండిన వారందరూ గుర్తిం చేశారు.

రాణేదారు ఆలోచించాడు.

ఉండుండి "సాహసించగలవా?" అనడిగా డతను.

"మానం నిలిచేటట్టు లేదు. ఇక ప్రాణా లెందుకూ? ఆజ్ఞాపించండి" అంటూ ప్రాధేయపడ్డాడు ఖాను,

"ఇక నువ్వు కోటలో ప్రవేశించడం అసాధ్యం. ప్రవేశించినా ముందుకి వెళ్ళగలగడం అబద్ధం. వెళ్ళినా నిలిచి వుండడం దుర్ఘటం. ఇన్నీ జరిగితే మాత్రం నీ కోరిక సఫలం అవుతుంది, తప్పదు"

"సెలవిప్పించండి."

"మహారాజు, దినమ్మూ నాల్గుగడియల పొద్దువేళ పంచకళ్యాణి మీద కొండల్లోకి షికారు వేంచేస్తారు."

"సెలవిప్పించండి."

"కోట ప్రాకారం దాటకుండా నువ్వు వారి కళ్ళబడాలి. కనీసం నీ వట్టి వేళ్ళ అత్తరు నయినా వారి నాకర్షించాలి"

"సెలవిప్పించండి."

"దివాంజీవా రిదివరకే యిది వూహించి వుంటారు. ఇందుకు ప్రతిక్రియ ఆలోచించి వుంటారు. ఆజ్ఞలుమాత్రం యింతవరకూ పుట్టలేదు."

"సెలవిప్పించండి."

"నీకు అదృష్టం వుంటేనే ఆయన కిది మరుపు వస్తుంది మహారాజు పెట్టిపుట్టినా మరుపువస్తుంది. లేదూ, నువ్వు కోటలో ప్రవేశించలేవు"

"సెలవిప్పించండి."

"నావల్ల కాతగ్గ దింతే. ఇక యేటి కడ్డపడు."

ఖానుకి ఊపిరి తిరిగింది.

"నిన్న నేను దాఖలుచేసికున్నది చందినీ అత్తరు. ఇదిగో, యిదిన్నీ స్వీకరించండి, దివాంజీవారికి నామీద అనుగ్రహమూ లేకపోయింది, యిది వాడుకునే యోగ్యతా లేకపోయింది, యెవ రేమి చెయ్యగలరూ? తమరి చివరి వుపాయం చెప్పారు. బతికివుంటే నేను తమ మేలు మరువను."

ఇలా చెప్పి, మూడుమాట్లు వంగి సలాములున్నూ చేసి ఖాను వెళ్ళిపోయాడు.

ఖాన్ను, కోటలో ప్రవేశించాడు.

వంశధార దాటి అనుమానిస్తూనే పదడుగులున్నూ వేశాడు; కాని యింతలో "అరే, అరే" అని నాలుకలు కరచుకుంటూనూ, "ఎక్కడి కెక్కడి" కంటూనూ వచ్చి నలుగురు సిపాయిలూ అతణ్ణి అటకాయించారు.

ఖానుకి, వెంటనే రక్తం వుడుకెత్తిపోయింది.

చూపులు చెదిరిపోయాయి.

కాని, సప్రయత్నంగా నిలవరించుకుని "నేను దివాంజీవారి దర్శనానికి వెడుతున్నాను, నన్నెందు కడ్డుకుంటారూ?" అనడిగా డతను.

"ఇప్పుడు వీలులేదు పోపో" మన్నారు సిపాయీలు

"నేను పాతవాణ్ణే నయ్యా! నిన్న సాయంత్రం వొక పనిమీద మాట్లాడే వున్నాను. ఆ వ్యవహారం పూర్తిచేసుకోడానికే వెడుతున్నాను."

"అయితే, వెళ్ళి వారి లోగిటి దగ్గిరే కనిపెట్టుకుని వుండు, లోటేం?"

"పోనీ, రాణేదారుగారి కచేరీకి తీసుకువెళ్ళండి."

"వా రిప్పుడు దివాంజీగారి సన్నిధిని వున్నారు, నీకు కనపడరు."

"వారు వచ్చేదాకా కనిపెట్టుకుని వుంటాను."

"ఆ పని వారి యింటి దగ్గిర, కోటలో వల్లకాదు."

ఇలాగ యుక్తులమీద యుక్తులు కురిసిపోయాయి.

వాటిని ఒరుసుకుంటూ కాలంకూడా గడిచిపోయింది.

"ప్రాకారంలో నిలవగలిగితేచాలు" అని ఖానుకి సలహా.

లోపల్లోపల అతను ధన్యవాదాలు చెప్పుకుంటూనే వున్నాడు.

ముందుకడుగు పడనివ్వవద్దని సిపాయిలకు దివాంజీ ఆజ్ఞ.

అందుకు వారున్నూ మురిసిపోతూనే వున్నారు.

ఇంతలో, ఆ చుట్టుపట్ల పనిచేస్తున్న వారందరూ వచ్చి మూగారు.

వచ్చేపోయేవారున్నూ నిలిచిపోయారు.

చూస్తూ వుండగానే, మహారాజు చదరంగం సహచరులూ, దశావతారీ స్నేహితులూ వచ్చారు.

వారున్నూ నిలిచిపోయారు.

పాటకజనమేకాక, పెద్దమనుష్యులున్నూ పోగయినందుకు ఖాను సంతోషించాడు.

"ఏమిటేమిటి?" అన్నారు కొందరు.

ఖాను తన అవస్థ అంతా చెప్పుకువచ్చాడు

దానిమీద, సిపాయిలూ తమ అసహాయస్థితి చెప్పారు.

ఇలాగ వొక్క గడియ గడిచింది.

"ఇంకో అరగడియ" అని యెవరో అన్నట్టయింది ఖానుకి.

కాని, అంతవరకూ అతణ్ణి అక్కడ నిలపగలిగినందుకు ఆనందిస్తున్న సిపాయీలు, మరొక్కడు పరుగుపరుగున వచ్చి యేదో చెప్పగా "ఇక దయచెయ్యి" అనడం ప్రారంభించారు.

"రాజు బయలుదేరుతున్నాడు. అంచేతనే వీళ్ళు పొమ్మంటున్నారు. ఇక గెంటుతారు"అని గుర్తించాడు ఖాను.

చిరవాంఛా, దీర్ఘశ్రమా యిలాగ వ్యర్థం అయిపోతున్నందుకు చాలా చాలా కుమిలిపోతున్నా డతను.

చివరి కతను, వుండిన వారిలో పెద్దమనుష్యులుగా కనపడుతున్నవారి నుద్దేశించి "పెద్దాపురం రాజ్యంలో కళాకారుల కిదీ సన్మానం?" అని నిక్కచ్చిగా అడిగాడు.

అంతే.

దాంతో అతని శరీరం వొణికిపోయింది.

కళ్ళెర్రబడ్డాయి.

చూపులు నిశితబాణాలయిపోయాయి.

ఈ స్థితిలో చర్రున గులాబీ అత్తరు పైకి తీశా డతను.

అందరూ చూపు లప్పగించేశారు.

"ఇది పెద్దాపురం ప్రభువుకోసం తయారుచేశాను" అంటూ, ముందు, సీసా చేతబుచ్చుకుని పెట్టె కిందికి విడిచి పెట్టేశా డతను.

తరవాత "నిద్రాహారాలుమాని తయారుచేశా" నంటూ మళ్ళీ అందుకుని "డిల్లీపాదుషావారు అటూ, పెద్దాపురం ప్రభువ్వారు ఇటూ' అన్న గౌరవభావంతో నా శక్తి అంతా వినియోగించి బొట్టుబొట్టుగా కూడబెట్టానిది. ఒక్కరాకతో దక్షిణదేశంలో నాపేరు నిలిచిపోతుందన్న పేరాసతో నా రక్తం అనుకుంటూ కూడబెట్టానిది. అయితే

'పెద్దాపురం ప్రభువు ఎంత సరసులో వారి పరివారం అంత విరసమైనది.' అని నేను ఇక్కడికి వస్తేగాని తెలుసుకోలేకపోయాను. గులాబీపువ్వు సౌరభం ఎంత దూరమో వ్యాపిస్తుంది; కాని దాని ముళ్ళప్రభావం ఉన్నచోటనేగాని వెల్లడికాదుగా? ఇది నాకు కాదు అమర్యాద. ఇది నా గులాబీ అత్తరుకున్నూ కాదు అగౌరవం. ఇది పెద్దాపురం మహారాజు కందించడానికి నాకిక మార్గాలులేవు అయితే, యిది వెనక్కి తీసుకువెళ్ళడం నాకేకాదు, మా కుటుంబానికే శిరచ్ఛేదం. ఇక నాకుండుకున్న తృప్తిఒక్కటే. దివాంజీవారి అతిలౌక్యంతో కనుమూసే మహారాజులుంగారి స్వచ్ఛకీర్తి, ఢిల్లీ నివాసి షుకురల్లీ ఖాను గులాబీఅత్తరు సౌరభంలో కలకాలమూ గుబాళిస్తూ, వుంటుంది. చాలు నాకిది" అంటూ పూర్ణ్వశ్వాసతో కోటగోడకి విసిరికొట్టాడతను సీసా.

సీసా భళ్ళుమంది.

సీసా పెంకులు ఘళ్ళున చెదిరిపడ్డాయి.

రాజసఖుల హృదయాలు రువ్వుమన్నాయి.

ఆ ప్రదేశం అంతా అత్తరు సౌరభంతో గుమ్ముమంది.

అందరూ ఆ పరిమళానికి మత్తెక్కుతున్నట్టయారు.

ఒక్క క్షణానికి తెలివివచ్చి అందరూ కళ్ళెత్తి చూశాటప్పటికి, హఠాత్తుగానూ అప్రయత్నంగానూ వెనక్కి తిరిగి చూసి ఖాను కొయ్యయిపోయాడు.

అదేమిటో అని అందరూ వెనక్కి తిరిగిచూడగా, పంచకల్యాణీమీద, శ్రీ శ్రీ శ్రీ శ్రీ వత్సవాయి చతుర్భుజ తిమ్మజగపతి మహారాజు అరకంట చూస్తూ సాక్షి వున్నాడు.

మోర పైకెత్తుకుని వుండి, పంచకల్యాణి, ఉండుండి సప్రయత్నంగా ఊపిరితీసు కుంటోంది.

☆ ☆ ☆

ఇప్పటికీ; ఆ ప్రదేశంలో, గులాబీ అత్తరు సౌరభం గుబాళిస్తూనే వుంటుందంటారు చూసివచ్చినవారు.

*(ఆంధ్రశిల్పి 1947 సెప్టెంబరు,*
*అక్టోబరుల సంయుక్తసంచిక నుంచి)*

[15 నిముషాలకు సరిపోయేటట్టు కుదించి 16–8–47 తేదీ సాయంత్రం 7.30 నిమిషాలకు మద్రాసు రేడియోలో చదివిన కథ యిది]

★ ★ ★

# మార్గదర్శి

"పంతులూ! వెయ్యి కా దిక లక్ష చెప్పు నువ్వు; కాని నౌకరీకోసం సిఫార్సన్నమాట మాత్రం నాదగ్గిర యెత్తకు. సబ్ జడ్జీగారు మా వియ్యంకులే కనక, నా మాట కొట్టెయ్యరంటే వొప్పుకుంటాను. అయినా నేను సిఫార్సు చెయ్యను.

"దాపరికం యెందుకూ? నీ విషయమయ్యే కాదు, మా వియ్యంకుడుగారికే కాదు. ఇప్పుడేకాదు – ఎప్పుడూ, ఎవరికోసమూ, యెవరికీ సిఫార్సు చెయ్యను

"చెయ్యకూడ దని నేను నిరుకుచేసుకున్నాను.

"ఒట్టే పెట్టేసుకున్నాను

"వారం దినాలనుంచి యిందుకోసం నన్నెందరో మొగమాట పెడుతున్నారు. మా వూరివాడే వొక బి.ఏ. వచ్చి నిన్ననల్లా నన్ను విసిగించేశాడు. నా శపథం ధర్మబద్ధం కాదుట. ఈ సంగతి నాచేత వొప్పిస్తానంటూ నాతో వాగ్వాదానికే సిద్ధపడ్డాడొక కోనసీమ యువకుడు; కాని నే నెవరికీ లొంగలేదు.

"వాళ్ళ కష్టసుఖాలు కూడా నేను వినిపించుకోలేదు.

"ఖండితంగా పొమ్మనేశాను వాళ్ళని.

"నిజమే – కాని నీ కోరిక తిరస్కరించిన్నీ నిన్నలా పొమ్మనలేకుండా వున్నాను నేను. నిన్ను చూసిన వేళావిశేషం యెలాంటిదో గాని, నీమీద నాకు దృఢమైన స్నిగ్ధానుభూతి యేర్పడుతోంది 'ఈ పిల్లవాణ్ణి దాస్యకూపంలో పడిపోనివ్వకు' అని యెవరో నన్నుద్బోధిస్తున్నట్టుంది గట్టిగా.

"కనక, నిన్ను పొమ్మనను, నువ్వు వెళ్ళనే వద్దు. వెడితే, యిందుకోసం నువ్వు మరివొకళ్ళ నాశ్రయిస్తావు. ఈ పట్టుపట్టు, చివరికి, ఎలిమెంటరీ స్కూలు మేష్టు అయినా సంపాదిస్తేగాని నువ్వాగేటట్టు లేదు.

"కూచో. ఈ పూట మనం ఏకబంతిని భోంచేదాం ఉండు

"నీ కళ్ళల్లో చక్కని వెలుగు కనపడుతోంది. నీ మొగాన అనన్య సామాన్యమైన వర్చస్సు లాస్యం చేస్తోంది. ఇకముందు నువ్వు సాటివాళ్ళందరిలోనూ చుక్కల్లో చంద్రుడులా వుంటావనిపిస్తోంది నాకు. అంచేత నిన్ను విడిచిపెట్టులేకుండా వున్నాను నేను.

"నువ్వు నౌకరీ చెయ్యడం సుతరామూ నాకిష్టంలేదు. అంత కర్మమేం నీకూ? కాకపోయినా, నీకిప్పుడు వచ్చిన గండకత్తెర యేమిటీ? కాలవ కింద రెండున్నర యెకరాల భూమి వుందంటున్నావు నీకు. ఏ పాతదో కొంపకూడా వుందంటున్నావు. ఇక నీకు వచ్చిన లోటేమిటోయ్? సంకురాత్రి వచ్చిందంటే చచ్చు సంభావన, పాతిక బస్తాల ధాన్యం తెచ్చి రైతులు నీ వాకట్లో గుమ్మరిస్తారు. పొద్దుపుగా

వాడుకో గలిగితే – వేషాలకి పోకుండా వుంటే – గుడ్డిగవ్వ సంపాదించకపోయినా నాలుగ్గోడల మధ్యా పడివుండి నువ్వూ మీ అమ్మా గుట్టుగా కాలం గడుపుకోవచ్చు. పెళ్ళాంగా రింకా రెండేళ్ళదాకా రారని నువ్వే చెబుతున్నావాయె. అయినప్పుడు, ఇలాంటి స్థితిలో దిగాలుపడిపోయి కాళ్ళు విరగదొక్కుకుంటానంటా వేమిటోయ్?

"ఇరవై యేళ్ళవాడవు నువ్వు, పూటకి గతిలేనివాడిలాగ, నిక్షేపం వంటి ప్రారంభజీవితం వొకళ్ళకి తాకట్టుపెట్టి కలుషితం చేసుకుంటా నంటావేమిటోయ్?

"ఎవడు చెప్పాడంట నీ కీ సలహా?

"నాకు తెలుసు, నువ్విదేమీ ఆలోచించుకోలేదు. మొన్నటి దాకా ప్రపంచం అంటే యేమిటో యెరక్కుండా తిరిగావు. నిన్న తండ్రి లేనివాడవయిపోయావు. ఇవాళ, సబ్ కోర్టులో కాళీ వచ్చిందని విన్నావు, సరియెగబడ్డావు.

"ఇంతేకాదూ?

"సరే, నీ ప్రయోజనం నువ్వు చూసుకున్నావు, మరి నా ప్రతిజ్ఞ?"

## 2

"స్కూలుఫైనలు పరీక్షల్లో నెగ్గావు. నవయౌవనంలో ప్రవేశించావు. మనసులో వున్నది చక్కగా విప్పి చెప్పగల వాగ్ధార కనపడుతోంది నీదగ్గిర. దీనివల్ల తరతరాలుగా సంచితమైన బ్రాహ్మణ ప్రతిభ నీ దగ్గర యెంతమాత్రమూ తక్కువగా లేదని స్పష్టమవుతోంది. ఇక వున్నదల్లా వొక్కటే లోటు.

"అది ఆత్మగౌరవం లేకపోవడం.

"దాని క్కారణం ఆత్మవిశ్వాసం కలక్కపోవడం.

"ఆత్మజ్ఞానం అంటే యేమిటో యెరక్కనే పోవడం"

"పోనీ, నువ్వీస్థితికి వచ్చావు గదా! నీ వూహాలూ, నీ వుద్దేశాలూ, నీ కోరికలూ, నీ సంకల్పాలూ, నీ ప్రయత్నాలూ, నీ దీక్షలూ దీనికెంతవరకూ కారణాలో యెప్పుడైనా చర్చించుకున్నావా నువ్వు?

"నేను" "నాది" అనే భావాలు ఆదినుంచీ వుంటాయి మనిషికి. అయితే నీ "అహం"కారానికిగల సత్తా యేపాటిదో, నీ "మమ"కారానికిగల దార్ఢ్యం యెంతటిదో యెప్పుడయినా చర్చించుకున్నావా నువ్వు?

"ఐహిక జీవితం జయావహంగా గడుపుకోవా లంటే ఆత్మజ్ఞానం యెంత అగత్యమైనదో, అంతమంది గురువులయినారు కదా, వొక్క రయినా చెప్పారా నీకు?

"మీ నాయన అయినా చెప్పగలిగాడా?

"ఊహూ!

"నువ్వే కాదు, నీవంటి వేలాదీ లక్షలాదీ యువకులు ఇలాగ తప్పుదారిలో పడిపోవడానికి, అదిగో, అక్కడ పుట్టింది హేతువు

"విజాతీయ విజ్ఞానబోధవల్ల రుచి మారిపోయిందే అనుకో. దానివల్ల స్వజాతీయ విజ్ఞానం లోపభూయిష్టంగా కనపడుతోందే అనుకో. పోనీ, ఆ విజాతీయతలో

వుండుకున్న విశిష్టతయేమయినా బోధపడిందా మనవాళ్ళకి? బుద్ధికి ఆ సంస్కారం అంటిందా? విజాతీయుల ఆ సత్తా యేమాత్రమయినా సంక్రమించిందా?

"దృక్పథం అయినా సరిగా మారిందా?

"అసలు వుద్దేశం యేమయినా, యే విషయం తెలుసుకోవాలన్నా అడ్డు లేకుండా సమస్త పరిభాషల తోటీ ఇంగ్లీషుభాష క్షుణ్ణంగా నేర్పిందే ప్రభుత్వం ఏ విషయమై కావాలన్నా అపారమైన వాఙ్మయం వుందే ఆ భాషలో? సర్వతోముఖమైన ఆ జాతి క్రమవికాసం యెలా సాధ్యపడిందో వివరించే చరిత్ర గ్రంధాలు వేలూ లక్షలూ వున్నాయే ఆ భాషలో? మన యింగ్లీషు విద్యావంతు లెంతమంది కళ్ళతో అయినా అవి చూస్తున్నారు? మన యింగ్లీషు విద్యావంతు లెంతమందికి మన దౌర్భాగ్యదశ అవగాహన అయింది? మన యింగ్లీషు విద్యావంతు లెంతమంది అందు కావేదన పొందుతున్నారు?

"కనుకనే మనవాళ్ళ కీ దాస్యప్రీతి. ఏ, బీ, సీ, డీలు వచ్చాయంటే చాలు – నౌకరీ మీదికి పోతుంది చూపు.

"నౌకరీకోసమే అసలు ఏ, బీ, సీ, డీలు ఆరంభించడం

"వర్ణధర్మం యేమిటి?" అన్న ఆలోచనలేదు "కుటుంబ సంప్రదాయం యెలాంటిదీ?" అన్న విచారణ లేదు. చదివిన శాస్త్రాలవల్ల కలిగే ప్రయోజనా లేమిటో అది గుర్తులేదు. రుచి అసలే లేదు.

"కళాశాల విడిచింది మొదలు – ఇక వొక్కటే ధోరణి, నౌకరీ, నౌకరీ నౌకరీ అని

"ఈ వింత గమనించావా? మున్సబు కరణాల కొడుకులకూ నౌకరీయే కావాలి. తహాసీలుదారు కొడుక్కీ, కలెక్టరు కొడుక్కీ, గవర్నరు కొడుక్కీ నౌకరీయే కావాలి. అగ్రహారీకుని కొడుక్కీ, మొఖాసాదారు కొడుక్కీ నౌకరీయే కావాలి. జమీందారు బిడ్డదాకా యెందుకూ, ఆ జమీందారుకే నౌకరీ కావాలి. అవధానులు కొడుకీ శాస్త్రి కొడుక్కీ నౌకరీయే కావాలి. వర్తకుని కొడుక్కీ, పెద్దకాపు కొడుకు నౌకరీయే కావాలి. చాకలి, మంగలి, తలారి – వీళ్ళ కొడుకులకూ నౌకరీ కావాలి. వంటబ్రాహ్మడి కొడుక్కీ, పురోహితుడి కొడుక్కీ నౌకరీయే కావాలి పది యిళ్ళల్లో భోజనానంతరం స్థలశుద్ధి చేస్తూ పొట్టపోసుకునే వితంతువుకొడుక్కీ నౌకరీయే కావాలి.

"చదువుకోవడమే తటస్థపడితే ముష్టివాడి కొడుక్కీ నౌకరీయే కావాలి. మరోటి పనికిరాదు.

"ఇన్ని తరహాలవాళ్ళూ ముసురుకోవడంవల్ల చివరికి ఈ నౌకరీకి 'ఉద్యోగం' అని ముద్దుపేరు.

"గవర్నరు భార్యా తన భర్త ఉద్యోగస్తుడనే చెప్పుకుంటుంది వెట్టివాని పెళ్ళామూ తన పెనిమిటి ఉద్యోగస్థు డనే చెప్పుకుంటుంది.

"ఈ వ్యామోహం యెంతవరకూ వెళ్ళిందో తెలుసా? తల్లి, తన కొడుక్కీ నౌకరీయే కావాలని కోరుకుంటూ వుంటుంది. అత్తగారు తన అల్లుడు నౌకరీ చేస్తూవుంటేనే అతనితో సంబరపడుతూ మాట్లాడుతుంది. కన్య, తనని

పెళ్ళాడేవాడు నౌకరీ చేస్తూ వుంటేనే మురిసిపోతూ పీటలమీద కూకుంటుంది పిల్లలు. తమ తండ్రి నౌకరీచేస్తూ వుంటేనే 'ఫలానా ఆయన బిడ్డలం' అని వెన్ను విరుచుకు తిరుగుతారు.

"కారణం?

"ఒకటి – రాజ్యాంగం ప్రజలచేతుల్లో లేకపోడం, అంచేత, గొప్ప పండితుడూ, మహాకవీ, అఖండశాస్త్రవేత్తా, పెద్దకాపూ, కోట్లకు పడగలెత్తిన వణిక్శిఖామణీ, సాటిలేని పారిశ్రామికుడూ, చివరికి, పత్రికా సంపాదకుడూ కూడా దలాయతుకైనా యెదురుచెప్పడానికి వల్లకాదు, దాసోహమ్మనవలసిందే. అక్రమమైన యీ అధికారదర్పం చూసే ప్రతీ ఏ, బీ, సీ, డీ కూడా నౌకరీకే యెగబాకడం.

"రెండు–ఫలితం విషయమై తనకేమీ బాధ్యత లేకపోవడం. సాధ్యమైనంతవరకూ వొళ్ళు దాచుకోడానికి వీలుండడం, 'యజమాని యేమంటే యేమిపోయింది. నెల తిరిగాటప్పటికి జీతం డబ్బులు చేతిలో పడతాయిగదా' అనే సిగ్గుమాలినతనం ముదిరిపోవడం.

"వృత్తులు నీచాతినీచాలు అన్న భావం అస్థిని పట్టిపోడంవల్ల వచ్చిన పుట్టిమునక యిది.

"స్వరాజ్యం నా జన్మహక్కు అని ఘోషించే జాతికుండవలసిన యోగ్యత యిదేనా? ఆధ్యాత్మికదృష్టే జీవంగా గల జాతి కనపరచవలసిన విశిష్టత యిదేనా?"

## 3

"నువ్వాశించే నౌకరీకి దొరికే జీతం నెలకిరవైరూపాయీలు. దానిపేరు మాత్రం గుమాస్తాగిరీ; కాని బంట్రోతుల క్కూడా యింతకంటే యెక్కువే జీతం. అయినా, నువ్వందుకే సిద్ధపడుతున్నావు.

"అంటే యేమన్నమాటా? నువ్వు చెమటవోడ్చి పని చెయ్యదలుచుకున్నా వన్నమాటే కాదూ? నీ అభిజాత్యం యేమయిపోయినాసరే అని సర్వానికీ తెగించావన్నమాటేకదూ? అయితే అవలంబించబోయేది యెలాగా వర్ణాశ్రమాచారం కానప్పుడు, మరో నాలుగు డబ్బులు యెక్కువ వచ్చేదే యెందుకు చేసుకోగూడదూ?

"ఉహూ, పనికిరాదు, ఉద్యోగమే కావాలి. నువ్వు పెద్ద కలెక్టరువో, జిల్లాజడ్జీవో, కనీసం తహాసీలుదారువో, కాదంటే పెద్ద ప్లీడరువో అయిపోతావనుకున్నారు మీవాళ్ళు. కాని నువ్వు బి.ఏ. వయినా కాలేకపోయావు – గుర్తించుకున్నావా? అలా కాలేకపోయినందుకు నీ చూపేమయినా మారిందా? జడ్జీపని యెలాంటి వుద్యోగమో సబ్ జడ్జీకోర్టులో నకళ్ళగుమస్తాపనీ అలాంటి వుద్యోగమే మనవాళ్ళ దృష్టిలో. కనకనే చివరికయినా కొట్టేద్దామని నువ్విలా అవస్థపడడం. అయితే, నువ్విప్పుడాశిస్తూ వుండిన నౌకరీకోసం బి.ఏలు కూడా పడిగాపులు పడివున్నారు, తెలుసా?

"గత్వా గత్వా నీకిది లభిస్తుందే అనుకో; కాని విధం చెడ్డా ఫలం దక్కదే? కానికూడుతిన్నా కడుపు నిండదే? ఒళ్ళు వంచి పనిచేసే కూలీలు కూడా యింతకంటే యెక్కువే సంపాదించుకుంటున్నారే? నువ్వు చదివిన చదువుకి, బతికి వున్నంతకాలమూ నౌకరీ చేసినా జీతం యాభైరూపాయలు మించదే?

ఏదయినా వృత్తిఅయినా, చిన్న వ్యాపారం అయినా పెట్టుకుంటే, మొదట మొదట బాగుండకపోయినా, పోను పోను ఐశ్వర్యవంతుడవు కావచ్చు నేమో యోచించుకున్నావా?

"బాడిత చేతబుచ్చుకుకొని దుంగలూ దూలాలూ చెక్కుతాడు వడ్రంగి. సమ్మెట యెత్తి యినుము సాగకొడతాడు కమ్మరి. మట్టి పిసికి కుండలు చేస్తాడు కుమ్మరి. నూలు వొడికి గుడ్డలు నేస్తాడు దేవాంగి. కలం పుచ్చుకుని మెడలు పడిపోయేటట్టు లెక్కలు రాస్తాడు గుమాస్తా.

"గ్రహించుకుంటే అంతా శ్రమే. రకంలో తప్ప రాశిలో భేదం లేదు. కాని, తక్కిన వారు స్వతంత్రులు. గుమస్తా మాత్రం—

"నౌకరు!

"బానిస!!

"ఈ భేదజ్ఞానం యేమయినా నీ తల కెక్కుతోందా?

"పూటకి టికాణా లేనివాడూ, ఆకస్మికంగా సంసారం మీదపడ్డవాడూ యిది బోధపరుచుకో లేకపోవచ్చు. బోధపరుచుకోకలిగినా యే అవకాశాలూ లేక నౌకరీకే సిద్ధపడవచ్చును.

"కాని, నన్నడిగితే, అవకాశం వుండీన్నీ బోధపరచుకోలేనివాళ్ళే మనలో యెక్కువ. మొన్ననే వొక బి.ఏ. ఈ విషయమై నాతో వాదానికి దిగాడు. అత నన్నదేమిటో తెలుసా? బి.ఏ. కావడానికి అతనికి చాలా పెట్టుబడి అయిందిట. బి.ఏ. కావడంతో తానొక గొప్ప అంతస్థుకి వచ్చినట్టేట. కనక, ఆ బి.ఏ. పట్టమే మళ్ళీ డబ్బుగా మారాలిట. ఉద్యోగం చేస్తేనే అది సాధ్యంట. ఏదయినా వృత్తి అవలంబించినా, వ్యాపారం ప్రారంభించినా దానికి మళ్ళీ పెట్టుబడి కావాలిట. తరుగులేని వొక సాధనం చేతికి చిక్కాక అది కాదని, మళ్ళీ యింకొక సాధనం సంపాదించుకోడానికి డబ్బు ఖర్చు పెట్టడం దండుగా, వో—ట్టి అవివేకమూట.

"బోధపడిందా?

"ఈరకం విద్యావంతులతో నిండి వుండిన మనదేశంలో వృత్తులూ, పరిశ్రమలూ పెంపొందడం సాధ్యమేనా? జీతం అంటే చదువుకోసం పెట్టిన పెట్టుబడి నూరూ వెయ్యీరెట్లు అయి మళ్ళీ చేతికి వచ్చేది అనుకునేవాళ్ళు జాతికీ దేశానికీ కూడా సర్వనాశనం సంఘటించే వుద్యోగం దొరికినా విడిచి పెట్టరన్న మాటే కదూ?

"తిన్నా గడిచిపోతుంది తినకపోయినా గడిచిపోతుంది దినం. తిన్నవాడు దొరికే తినడంలేదు, తిననివాడు దొరక్క మానడంలేదు. గ్రహించుకోగలిగితే దొరకడానికీ తినడానికీ అసలు సంబంధమేలేదు. తినడానిక్కావలసిన శక్తి వేరూ, దొరకడానిక్కావలసిన శక్తి వేరూను. ఈ రెండు శక్తులూ వుండినా పని చెయ్యాలంటే అందుకు మరోశక్తి కావాలి. కృత్యవిభాగం అనుసరించి ఇన్ని రూపాలుగా కనపడ్డా, అసలు, శక్తివొకటే!

"అయితే, శక్తిలేని మనిషిని చూపించగలవా నువ్వు? ఉన్నశక్తి వినియోగ పరుచుకోలేనివాళ్ళని మాత్రం నేనెంతమంది నయినా చూపించగలను మన ఆంధ్రుల్లో.

"ఇంతకీ—దరిద్రం అంటే డబ్బు లేకపోవడంకాదు, బుద్ధిలేకపోవడం. అడుక్కు తింటూ చెట్టుకింద కాలం గడిపేవాళ్ళని దరిద్రులంటుంది మన సంఘం. ఇది అర్థంలేనిమాట. వాళ్ళకి కావలసినంత శక్తి వుంది; కాని దానికి వినియోగం లేదు, అంతే"

"అలా లేకపోవడానికి సన్నికృష్టకారణం, వాళ్ళకి సిగ్గూ బిడియమూ లేకపోవడం, విప్రకృష్టకారణం, మన ఆధ్యాత్మిక దృష్టి. ద్రవ్యం ఉత్పత్తి చేసే శక్తిని, వాళ్ళు అడుక్కోడానికి – అంటే, శ్రమజీవుల పరిమిత సంపాదనలో కొంతభాగం దౌర్జన్యంగా దోచుకోడానికి వినియోగిస్తున్నారు. అయితే, మన సంఘానికి, ఈ తప్పు దిద్దుకునే శక్తే కాదు – గుర్తించుకునే శక్తికూడా లేదు. పైపెచ్చు, అడుక్కుతినే చిత్తవృత్తిని ప్రోద్బలపరిచే శక్తే వుంది.

"చెప్పవచ్చిం దేమిటంటే? పనిచెయ్యడానికి ఆక్షేపణా బద్ధకమూ లేనప్పుడు, భుక్తికి లోటులేని నువ్వు, ఇతర్లకు సేవ చెయ్యడం యెందుకు చెప్పు. నీవంటి ప్రతిభాశాలి, ఆ శక్తి నితర్లకు ధారపొయ్యడానికి బదులు తనకే యెందుకుపయోగ పరుచుకోరాదూ?

"ఇదీ నేనడిగే ప్రశ్న.

"పద్దెనిమిదో యేట యీ ప్రశ్నే నన్నెదురుకుంది. అప్పటి స్థితి తలుచుకుంటే యిప్పటికీ శరీరం గజగజ లాడిపోతుంది నాకు. ఈశ్వరానుగ్రహం వుంది కనక నే నెలాంటి దుర్దశ దాటుకువచ్చానో నువ్వెరగవు. నా మేడా నా అంగడీ చూస్తే అసలు నీకీ సందేహమే కలగదు. నరకయాతనల్లో కూడా అంత తీవ్రమైనది వుండదు. శివశివా! లోకంలో యెంతమంది దాని ఆక్రమణలో పడిపోతున్నారో! ఎదిరించి నిలవరించుకోగల శక్తివుండిన్నీ బుద్ధి లేక, దానికింద పడి యెందరు నలిగి పిప్పి పిప్పి అయిపోతున్నారో?"

## 4

"సెంటు భూమి లేదు. చేతిలో రాగి దమ్మిడీ అయినా లేదు. సంపాదన లేదు. ఇంకా ఆ చూపే కలగలేదు. అప్పుడే పదిహేడో యేదు వెళ్ళింది. ఇష్టం వచ్చినప్పుడు బడికి వెళ్ళడమూ, తరుచు ఆటలాడుకోడమూ తప్ప వేరేధ్యానమే లేదు. అలాంటి సమయాన, హఠాత్తుగా జ్వరం వచ్చి, అది సన్నిపాతించి, పద్దినాల్లో మా నాయన యెగిరిపోయాడు.

"ఆ పద్దినాలూ యెలా గడిచాయో, యెవరు గడిపారో నే నెరగను ఉండుండి ఒక్కొక్క కుటుంబంగా వచ్చిన చుట్టాలందరూ వొక్కక్షణంలో యెవళ్ళ యింటికి వాళ్ళు వెళ్ళిపోయారు. ఇవి వికృత రూపంతో మా అమ్మా, స్తబ్ధుణ్ణయిపోయి నేనూ మిగిలాం.

"అయితే, మా అమ్మ యెలాంటిదో యెరుగుదువా? మీ అందరి అమ్మల వంటిదీనా మా అమ్మ? అబ్బే, మా అమ్మ సాక్షాత్తూ ఆపార్వతీదేవి కాదుటోయ్?

"మా నాయన చనిపోయినందుకు నేను విచారించకపోలేదు; కాని తరవాత్తరువాత అది మరుపు వచ్చింది. మా అమ్మ పోయినప్పుడు మాత్రం పెద్ద సంసారి

నయివుండినా నాకు దుఃఖం దుర్భరం అయిపోయింది. ఆవిడ పోవడం యీ అరవై యేళ్ళ వయస్సులో కూడా నాకెంతో లోటుగానే వుంది. ఆవిడ జ్ఞాపకం వస్తే వొకందు కానందమూ ఒకందుకు దుఃఖమూ వూపేస్తాయి నన్ను.

"ఒకనాడు, చద్దన్నం తిని నేను వాకట్లో కూచున్నాను. వెనకటి ఉత్సాహం అంతా ఏమయిపోయిందో వుసూరుమంటూ వుండిపోయాను. భవిష్యత్తును గురించి ఇంకా ఆలోచన యేమీ పుట్టలేదు. ఏమిటో మందుతిన్నట్టయిపోయి కూచుండిపోయాను.

"అలాంటప్పుడు మా అమ్మ వచ్చి, పక్కనికూచుని, కొంతసేపు ఏమిటేమిటో బుజ్జగిస్తూ మాట్లాడింది. తరవాత, మెల్లిగా కంఠం సవరించుకుని, నెమ్మదిగా మాటతెచ్చుకుని 'పదికుంచాల బియ్యమూ, రసవర్గమూ, పది రూపాయల రొక్కమూ వున్నాయి. నెల దినాలు గడిచిపోయాయి. మరి తరవాత కాలం యెలా గడుస్తుందీ? ఏ మాలోచించావు తండ్రీ?' అనడిగింది లాలనగా. అలా అడగవలసివచ్చినందు కామెప్రాణం యెంత కొట్టుకుందో, ఏదో బాధా, విచారమూ, జాలీ, ప్రేమా, వాత్సల్యమూ చిందులాడుతూ వుండినాయి.

"ఎంత భేదమో గుర్తించావా? మా నాయన వుండినంత కాలమూ అన్నం కలిపి ముద్ద నా నోటి కందించిన మా అమ్మ, ఆయన పోయి, ఆపద్దినాలూ గడిచాటప్పటికి మాతృవాత్సల్యంలో నాకు కొత్తరుచి చూపించింది. అంటే యేమిటో తెలిసిందా? అంతవరకూ నా కడుపు తానే నింపడానికి పాటుపడిన మా అమ్మ అదిమొదలు నా కడుపు నేనే నింపుకోగలిగేటట్టు నన్ను దిద్దడానికి పూనుకుంది.

"నా కప్పు డొక సంగతి జ్ఞాపకం వచ్చింది. మా స్వగ్రామంలో మా యింటి పక్కని వొక బ్రాహ్మణ కుటుంబం వుండేది. మా అంత నిరాధారులు కారు వారు; కాని వున్నది చాలదు. చన్నీళ్ళకి వేన్నీళ్ళు సాయం అన్నట్టు, ఎంతో కొంత సంపాదించుకోవాలి. అలాంటి సంసారంలో కలరా వచ్చి యజమాని హారాత్తుగా కాలం చేశాడు."

"ఆయన కిద్దరు కొడుకులు. ఒకడు మైనారిటీ వెళ్ళినవాడూ, వొకడు వెళ్ళవలసినవాడూ, తల్లీ — ముగ్గురు మిగిలారు. ఒకనాడు, యాభైయేళ్ళు నిండిన తల్లి, రుసరుసలాడుతూ వచ్చి 'ఆ మహారాజు బతికివుండినంతకాలమూ కమ్మగా తిన్నారు. ఇక మీ గడ్డి మీరు తినండి' అని రుంజుకుంటూ చక్కాపోయింది. అప్పట్లో నాకది సరిగా అర్థం కాలేదు. అయినా, యెలాగో అనిపించింది. మా అమ్మ మాత్రం ముక్కున వేలుపెట్టుకుంది. 'కనిపెంచిన బిడ్డలనే అలా అనడం?' అంటూ చాల నొచ్చుకుందామె.

"మరి మా నాయన పోయినప్పుడు మా అమ్మ యేమందో యెరుగుదువా? సంసారభారం వహించవలసిన బాధ్యత నామీద యెంత చక్కగా మోపిందో అర్థం చేసుకున్నావా? ఆ వయస్సులో, సంసారసంబంధమైన పని యేమి చెప్పినా యెగిసిపడతారు కుర్రాళ్లు. మాతృత్వం అంటే, బుజ్జగించి వాళ్ళ నందుకు సిద్ధపడేటట్టు మెల్లిగా ప్రోత్సహించడంగాని ఆజ్ఞలు వెయ్యడంకాదు. లోకంలో, యిది చాలా కొద్దిమంది తల్లులకే తెలిసివుంటుంది. వారిలో మా అమ్మ నాయకమణి. అప్పడామె అన్నమాటలు నా కిప్పటికీ జ్ఞాపకం. 'తండ్రీ, బెంబేలుపడిపోకు' అందావిడ ముందు.

"ఎరుక లేదుగా? అదీ యీ మాంద్యాని క్కారణం' అన్నాడతను గూడా.

"అంగడి తెరుచుక్కూచునే దాకా నాకీ అనుభవం కలగలేదు కాని, ఆరుమాసాలు గడిచాటప్పటికి వడి అందుకుంది. అది చూసి 'అంగడిలో యే మూలా కాళీ కనపడగూడదు. నీకిక పరిమితి అక్కర్లేదు, ఏమి యెంత కావలిస్తే అంతా నాదగ్గిరనుంచి నిశ్చింతంగా పట్టుకువెళ్ళు' అంటూ చాలా ఔదార్యం కనబరిచాడు మారువాడీ. ఒక్కొక్కప్పుడు కొత్తరకాలు వస్తే అతని కతనే పంపేసేవాడు, చీటీ రాసి.

"సంవత్సరం తిరిగాటప్పటికి నా అంగడిలో తెరిపి వుండేదికాదు. రెండేళ్ళు కనుకున్న అక్కగారి బాకీ, మారువాడీ సలహాతో సంవత్సరానికే తీర్చేశాను. రెండేళ్లు దాటాక అతనే నాకు బొంబాయి కాతాలు కలిపాడు. చెన్నపట్టణం నాకు పెరటిదొడ్డి అయిపోయింది. మధురా, కోయంబత్తూరూ, సేలమూ, బెంగుళూరూ మొదలైనవి రాజమహేంద్రవరంలోనే పేటలన్నట్టయి పోయాయి. పూర్తిగా స్వతంత్రుణ్ణయినాను.

"బెంగ తీరింది నాయనా! బతికివుండినందుకు ఫలం కనపడింది. నువ్వీ స్థితికి రావడం నా కళ్ళతో చూసుకున్నాను. నా తండ్రీ, ఇక నాకు విచారమూ లేదు, లోటూలేదు' అంటూ మా అమ్మ బ్రహ్మానంద పరవశురాలయిపోయింది.

"అక్కగారు చాలా సంతోషించారు.

"అప్పటికి తెలిసింది బావగారికి శంభుశాస్త్రి ప్రయోజకత్వం, మెల్లి మెల్లిగా. చిట్టచివరి వాయిదా చెల్లగట్టినప్పుడు, మొట్టమొదటిమాటు 'బావా' అని సంబోధించి వీపు తట్టారాయన. 'అత్తగారు నిన్నేవుద్దేశంతో యీ వూరు తీసుకువచ్చారో అది నెరవేర్చావు నువ్వు. ఆవిడ ఆశలు పూరించావు. దారిద్ర్యం ఒక మృత్యువు. అది జయించినవాడి జన్మ సామాన్యమైనదికాదు. నీ సత్తా మాకిప్పటికీ చాలా స్వల్పంగానే తెలిసింది. మీ అక్కగారికే కాదు, నాకూ నువ్వు ఆత్మీయుడవే. నువ్వుకూడా నన్ను నీవాడికింద చూసుకో. కష్టసుఖాల్లో మేమున్నాము. మీరు బలగంలేనివాళ్ళుకారు. నా పలుకుబడి అంతా నువ్వు స్వేచ్ఛగా వాడుకో' అని యెంతో ఆదరంగా, ఎంతో ప్రేమగా, ఎంతో వాత్సల్యం కనబరిచారు.

"ఇంకొకటి చెబుతాను. పరపతికి నిదర్శనం అప్పుపుట్టడంకాదు, అణాపైసలతో అది తీర్చెయ్యగలగడం. మనస్సులో వుంచుకో' అని మహోపదేశం కూడా చేశారాయన."

## 26

"ఇక నాకు పెళ్ళాం తక్కువ, కదూ? అబ్బో, నీ కెప్పుడో తట్టివుంటుందీ సంగతి. అదిగో, ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నావు, నాకు తెలుసు. ఈకాలంవాళ్ళకి చదువుకంటే ముందు పెళ్ళి కావాలి. ప్రజ్ఞకంటే ముందు పెళ్ళాం కాపరానికి రావాలి

"వరుని మాటా, తల్లిదండ్రుల మాటా అలా వుంచు, తరవాత నాటకాల్లో తిరిగినా, కుర్రాడు ఏ ఫస్టుఫారమో చదువుతున్నాడంటే చాలు కన్యాదాత లిక నిలవనిస్తారుటయ్యా యిప్పుడూ?

"మా చిన్నతనం నాటికీ యిప్పటికీ అంతా భేదమే. ఇప్పుడు పెళ్ళి కొడుకుల తండ్రుల కెంతబింకం వుంటోందో, పెళ్ళికూతుళ్ళ తండ్రుల కంత బింకం వుండేదప్పుడు, ఇప్పుడు మగపిల్లలకు ధర పలుకుతున్నట్టు అప్పుడు ఆడపిల్లలకు పలికేది. సంప్రదాయం చూసుకునే వాళ్ళు మాత్రం, కాళ్ళు కడిగి కన్యాదానం చేసి 'దశపూర్వేషాం దశాపరేషాం' అనుకుని తృప్తిపడేవారు.

"డబ్బో, యోగ్యతో వుంటేనే మొగాడికప్పుడు పెళ్ళి అయేది. నా యెరికిన, నా యీడువాళ్ళెందరో బ్రహ్మచారులుగా వుండిపోయారు.

"ఏదో వొక యోగ్యత వుండినా పురుషునకప్పుడు ఇరవైయేళ్ళు నిండాకే పెళ్ళి. దీనికిసాయం పెళ్ళికూతుళ్ళు పదేళ్ళలోపువాళ్ళయి వుండేవారు. ఇరవై యేళ్ళుదాటాక అయినా పురుషులకు పెళ్ళిమాత్రమే అయేది, భార్యకాపరానికి రావడం పాతికేళ్ళు దాటాకే. అనేకులకు ముప్పయేళ్ళు వచ్చేదాకా పెళ్ళే అయేది కాదు. అంచేతనే అప్పుడు శిశుమరణాలు తక్కువ.

"అంచేతనే, అప్పుడు, స్త్రీలూ, పురుషులూ దీర్ఘాయుష్మంతులయి వుండేవారు.

"ఎవళ్ళమాటో యెందుకూ? నామట్టుకి నాకు ఇరవై నాలుగేళ్ళు నిండాకే పెళ్ళిచేసుకోవాలని సంకల్పం కలిగింది. మా అమ్మ కూడా అప్పటిదాకా ఆ విషయం ఆలోచించలేదు.

"నా కయినా, మారువాడీ ప్రోత్సాహంతోనే ఆ సంకల్పం కలిగింది.

"కొత్తరకాలు వచ్చాయని కబురు రాగా నేనొకనాడతని అంగడికి వెళ్ళాను అప్పటికొక సంపన్నుడు పెళ్ళికి బట్టలు కొంటున్నా డక్కడ. ఆ అంగడికల్లా నిగ్గయినవి రెండు పట్టుచీర లుండగా అందులో వొకటి పుచ్చుకున్నా డాయన. ఏమితోచిందో, వెంటనే నా చేతిలో పెట్టాడు రెండోది మారువాడీ.

"ఇది నీదగ్గిర వుంచు, అమ్మకం కోసం కాదుసుమీ' అని మాత్రమే అన్నాడప్పుడు.

"సాయంత్రం నా అంగడికి వచ్చాడు చిరా తియ్యమన్నాడు. చూశాడు, 'లక్ష దాటింది నీ వ్యాపారం. ఇక పెళ్ళి ప్రయత్నం సాగించు. హఠాత్తుగా స్ఫురించి అందుకోసం యిచ్చాను నీకాచీర. అంత మంచిచీర యింతవరకూ నా అంగడికి రాలేదు. జమీందార్లు మాత్రమే వాడుకో తగ్గది అది. నువ్వు వాళ్ళకి అప్పులు పెట్టే స్థితికి వస్తావు. కనక, నీ భార్య అది కట్టుకోవాలి" అన్నాడు, ఆనందబాష్పాలతో అతను.

"నాకు పారవశ్యమే కలిగింది.

"ఇక చిత్రం యేమి టంటే? నా పెళ్ళి విషయమై మా యింట్లో ఆలోచన ప్రారంభం అయినప్పుడే అక్కడ సోదెమ్మ అక్కయ్యగారికిన్నీ వాళ్ళ సావిత్రి పెళ్ళి విషయమై ఆలోచన పుట్టింది.

"అప్పటికి సావిత్రి వయస్సు పన్నెండు వెళ్ళి పదమూడో సంవత్సరం నడుస్తోంది, 'అయ్యో, పిల్ల కట్టుతప్పిపోతోంది, ఇంకా పెళ్ళి చేశారు కారేమిటమ్మా?' అంటూ ఆర్యాపురాని కార్యాపురం అంతా ముక్కుమీద వేలు పెట్టుకుంటోంది.

"మర్నాడు, మామూలుగా, మా అమ్మా సోదెమ్మక్కయ్యగారూ సావకాశంగా కూచుని కష్టసుఖాలు చెప్పుకోవడంతో, మా అమ్మ మారువాడీ అన్న మాటలు

జారవిడిచిందిట. సావిత్రి పెళ్ళిమాట అక్కయ్యగా రెత్తుకున్నారుట. ఆవేళ, ఆ సమావేశం ముగిశాటప్పటికి వారిద్దరూ వియ్యం అందాలనుకున్నారుట.

"ఆ మర్నాడు తెల్లవారాటప్పటికి అక్కయ్యగారి దగ్గిర నుంచి కబురు – నన్ను అంగడికి వెళ్ళవద్దని.

"ఎనిమిదింటికి భార్యాభర్తలిద్దరూ వచ్చారు. తొమ్మిదింటికి సంగతి సందర్భాలన్నీ తేలిపోయాయి. పదింటికి ముహూర్త నిర్ణయం జరిగింది. పదకొండింటికి ఆవేళ వారి యింటో మాకూ, మర్నాడు మా యింటో వారికీ విందులు జరిగాయి. మరో పదిహేను దినాలకు నా పెళ్ళి అయింది.

"సావిత్రి కాపరానికి వచ్చాటప్పటికే బజారులో నేను మేడ కట్టాను. మా పెద్దమ్మాయి పుట్టుకలకు పేటలో యీ మేడ కట్టాను. క్రమంగా, మహేంద్రవాడలో పదిపుట్ల భూమి కొన్నాను. సరాసరీ సీమనుంచే సరుకు తెప్పించసాగాను.

"అయిదారు లక్షలు విలువగల మా అంగడి యిప్పుడు మా పెద్దబ్బాయి సవరించుకుపోతున్నాడు. నా పెద్దకోడలు అగ్రహారీకుల ఆడబడుచు. నా రెండో కొడుకు గొదాముూ సంసారమూ నిర్వహించుకుపోతున్నాడు. అతని భార్యే మన సబ్జడ్జీగారి కూతురు. మూడోవాడి కింకా పెళ్ళికావాలి. సంబంధాలమీద సంబంధాలు వచ్చి పడిపోతున్నాయి. అతనిప్పుడు సీమలో డాక్టరు పరీక్షకు చదువుతున్నాడు. అక్కడికే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి, గుక్కతిప్పకోడాని కవకాశం లేకుండా.

"నా పెద్దల్లుడు బెజవాడలో యింత బట్టల వర్తకమూ చేస్తున్నాడు. నా రెండో అల్లుడు మద్రాసులో పెద్ద వకీలు.

"అదిగో, అదే మా నాయన తంబురా. చిన్నప్పుడు సంగీతం నేర్చుకోడానికి వెళ్ళి తంజావూరిలో సంపాదించాడది. తగినంత విద్య అంటలేదు గాని; దాని ఆసరాతోనే, దురన్న దుర్దానాలకు పోకుండా మా నాయన కుటుంబ గౌరవం నిలబెట్టుకోగలిగాడు.

"అదే యిప్పటికీ నాకు పిత్రార్జితం. మా నాయనపోయిన తరవాత వొక గాయకుడు పచ్చకాగితం వొకటి నా చేతిలో పెట్టి అది వులాక్కోపోయాడు కాని; నేను లొంగలేదు. అది విడిచిపెట్టడం మంచిది కాదనీ; దాని గంభీర నాదానికి ముగ్ధుణ్ణయి, శక్తి వచ్చాక నేను తరంగాలూ అధ్యాత్మరామాయణ కీర్తనలూ సక్రమంగా నేర్చుకున్నాను.

"మా నాయన ఫోటో లేదు. ఆయన పోయేదాకా నాకు అది లేదన్న వూహా తట్టలేదు. తరవాత యే మనుకుంటే యేమిలాభమూ?

"అదిగో, మా అమ్మ నవ్వుతూ నాకేసి యెలా చూస్తోందో చూడూ, ఆవిడ బతికే వుండగా, వెయ్యిన్నూటపదహార్లిచ్చి శిల్పిని గౌరవించి రాయించానాపటం.

## 27

"ఇదంతా యెందుకు చెప్పానంటే? ఆలోచించుకో, ప్రస్తుతం, అదేకాదు, నీకు మరో నౌకరీ అయినా దొరకడం కష్టం. దొరికినా వోపట్టాన స్థిరంకాదు. అయినా

జీతం పాతికరూపాయీలకు మించదు. నెలకి నూరురూపాయీల జీతం నువ్వు నీ జీవితంలో చూడవు.

"నౌకరీతప్ప, జటిలమైన యీ భౌతిక ప్రపంచంలో మరోదారి లేదూ బతకడానికీ?

"వినాశకాలం దాపరించడంవల్ల, జగద్గురుత్వం వెలిగించిన బ్రాహ్మణ జాతి నౌకర్ల జాతిగా తయారయిపోయిం దిప్పుడు. దీనివల్ల మనవాళ్ళేకాదు చెడడం, బ్రాహ్మలే అవలంబించడంవల్ల, అదేదో గొప్ప అనుకుని, మెరికల్లాంటి బ్రాహ్మణేతర యువకులు కూడా – పరమోత్కృష్టాలైన ఉత్పాదకశక్తీ ఉత్సాహశక్తీ ప్రభుశక్తీ బుద్ధిపూర్వకంగా చంపుకుని, ఉద్యోగాల కెగబాకి ఆత్మ వినాశం తెచ్చి పెట్టుకుంటున్నారు.

"అసలు, మానవజాతికి, బ్రాహ్మణధర్మాలే అస్వాభావికాలూ ప్రతికూలాలూ అని స్థిరపడ్డ యీ దినాల్లో ఇలాంటి అదర్శకత్వం బ్రాహ్మణజాతిని మరీ కుంగదీసేస్తోంది.

"కనక, నేనమ్మా బ్రహ్మ మొగంనుంచి వూడిపడ్డానని యెత్తెత్తి కాళ్ళు వెయ్యక, రైతాంగంతో సహకరించడం నేర్చుకుని వ్యవసాయం చేసుకో. లేకపోతే యేదో వర్తకం సాగించు. పెద్దయెత్తు యెత్తలేకపోతే, యే కాఫీ హోటలు దగ్గిరో కిళ్ళీదుకాణం పెట్టుకుంటే రాజాంగంగా బతకవచ్చు, పాతిక రూపాయీల పెట్టుబడితో. అది కూడా చేతకాదంటావా, వందచుట్టలూ డజనగ్గిపెట్టెలూ పుచ్చుకుని, పొద్దుటిపూట స్టీమర్లదగ్గిరా, మధ్యాహ్నం పడవల రేవుల్లోనూ కోర్టులదగ్గిరా, సాయంత్రం సినిమాల దగ్గిరా తిరుగు. అదీ యిష్టం లేదంటావా, కుట్టుమిషను పెట్టుకుని మా అంగడిదగ్గిర కూచో, మిషను నేను కొనిపెడతాను. అదీ కాదంటావా, కావెడుగుడ్డ లేవి కావాలంటే అవి యిస్తాను, వూళ్ళో తిరుగు. దమ్మిడీ పెట్టుబడి అక్కర్లేదు. పైగా యెప్పటి లాభం అప్పుడే పట్టుకుపోవచ్చు. చెరువంత మేడ మాది, జనం తక్కువగా వున్నాం. వొక చిన్నగదీ, వంటవసారా యిస్తాను, అద్దెయివ్వనక్కరలేదు, తలదాచుకో.

"కష్టపడు, బాగుపడు. అంతే కాని నౌకరీ యిప్పించమని నన్ను వేధించకు. నీ మొగం కలకల్లాడుతోంది, నీకు నౌకరీ కర్మం యేమీ? ఆ వర్చస్సు ధూళి ధూసరితం చేసుకోకు. కాలం గడిచిపోతోంది, లే, త్వరపడు.

"ఇంత చెప్పినా నీకింకా నౌకరీ వ్యామోహం పోదూ, ఫో–నా యెదట నుంచోకు, వెళ్ళిపో!"

*1928 జనవరి భారతి నుంచి*
*(సవరణలతో)*

[5–10–47 మొదలు ఆనందవాణిలో వరాసగా ప్రకటితమున్నా అయింది.]

* * *

# "కన్యాకాలే యత్నా ద్వరితా"

జౌము పొద్దెక్కింది.

చైత్రపున్నమి వెళ్ళింది కనక, అప్పటికప్పుడే యెండ చుర్రుమంటోంది.

రాయవరం నూరిళ్ళ వెలనాటి బ్రాహ్మణాగ్రహారంలోనూ వంట లయిపోతున్నాయి; కాని జానకమ్మ అప్పుడే మెల్లిగా చెరువుకి బయలుదేరింది.

చెరువుకి వెళ్ళడానికి దినమ్మూ ఆమె కిదే వేళ.

పైపనంతా దాసీపిల్ల చేసేస్తుంది కనక, యేడింటికి చిల్లర మడిపనులు కానిచ్చేసుకుని, యేడున్నరకి మొగుడితోపాటు చద్దన్నం తిని, అతనిచేత తొమ్మిదిన్నర అలారం పెట్టించుకుని, పుస్తకం పుచ్చుకునో, వీణ అందుకునో, గ్రామఫోను వేసుకునో, మొగుడు తీరుబడిగావుంటే యేచదరంగమో ఆడుతూనో కూచుంటుందామె.

వీటిలో యేదివుండినా ఆమెకిక నిద్రాహారా లక్కర్లేదు.

అయితే, అలారం వినపడిం దంటేమాత్రం యెక్కడికయిన పని అక్కడికే ఆపేసి; వెంటనే బిందె పుచ్చుకుని బయులుదేరుతుంది.

సాధారణంగా, ఆ సమయానికి చెరువుదగ్గిర యెవరూ వుండరు కాని; ఆవేళ మాత్రం పొరుగూరి ముసీలి బ్రాహ్మడొకడు స్నానం చేసి, తడిగుడ్డ నెత్తిన వేసుకుని చెరువులో నుంచునే జపం చేసుకుంటున్నాడు.

ఇంతలో తెమిలి వొడ్డెక్కేటట్టు కూడా లేడు.

అంచేత అతనుండగా చెరువులో దిగడానికి సిగ్గుపడి, అటూయిటూ చూస్తూ పావంచాలకు పక్కగా వుండిన రావిచెట్టుకింద నుంచుని వుండిపోయిందామె.

ఉండిపోయిం దంటే అప్పుడే అక్కడికి వెళ్ళింది.

వెళ్ళి, బిందె బోర్లించి దాని మీద కూచోడమా, నుంచునే వుండడమా అని ఆలోచిస్తూనే వుందింకా.

సరిగా, యీ సమయంలో పది పద్దెనిమిదేళ్ళ వితంతు వొకామె, వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ, ఎక్కడ దాటిపోతుందో అన్నట్టు కొంచెం వడిగా వచ్చింది.

వచ్చి, రేవులో ఆడవాళ్ళెవరూ లేనందుకు సంతోషించి "మహాబాగా దొరికా" వన్నట్టు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ జానకమ్మ దగ్గిరికి వెళ్ళి "నీపే రెవరమ్మా?" అని మెల్లిగానూ లాలనగానూ అడిగింది.

"జానకమ్మండీ పిన్నిగారూ" అని బదులు చెప్పింది జానకి, గునుస్తూ.

"మాటే ఆడదేమో" అని జంకుతూ వచ్చిన వితంతువు యీ మాటలో వున్న చెలికారం గుర్తించి పొంగిపోయి "నేను నీకు పిన్నిని కాను తల్లీ" అంటూ వాత్సల్యం కనపరిచింది.

"మరే మవుతారు?"

"తోడబుట్టినదా న్నమ్మా!"

ఇది విని జానకి చకిత అయింది.

"నెత్తిమీద పెట్టుకునేవాళ్ళూ, గారాంచేసేవాళ్ళూ లేని యింటోపడి మగ్గిపోతూ వున్న దురదృష్టవంతురాలిని, కనక, దయివుంటే అక్కయ్యా అని పిలు తల్లీ!"

ఈ మాట, ఆ వితంతువు, నాలుగు వేపులా చూస్తూ బెదురుతూ బెదురుతూ గద్గదికతో అంది.

"అయితే, మరీ సంతోషం. నాకు చెల్లెళ్ళేకాని అక్కలు లేరు. మిమ్మల్నే అక్కగా చూసుకుంటా నండీ!"

"అలా అయేటట్టుంటే ఇక మీరనడంయెందుకు, మరీ?"

ఈ వాత్సల్యానికి పొంగిపోయి, చిరునవ్వు నవ్వుతూ "నిజమే కాని కొత్తకాదూ?" అనడిగింది జానకి.

"నిన్ను నువ్వన్నాను కాదూ నేనూ?"

"అన్నారు, అంటున్నారు, నిజమేనండీ–"

"అదిగో మళ్ళీ అదేమాట!"

"అదే చెబుతున్నాను. నువ్వంటే నువ్వనుకోడం బాగానే వుంటుంది. నాకిష్టమే కూడానూ; కాని పాతపడేదాకా కొత్తవాళ్ళని నువ్వనడం యెబ్బెట్టుగా వుంటుంది."

"అక్కకీ చెల్లెలికీ కొత్తయేమిటమ్మా వెర్రితల్లీ! పోనీ యింతకీ వొప్పుకున్నావు గదా?"

"ఆ."

ఇలా అన్నప్పుడు జానకి లోలకులు కొంచె వూగిసలాడి చకచ్చకలీనాయి.

ఆ చకచకలు ఆమె బుగ్గలమీద లాస్యం చేశాయి.

ఆ బుగ్గలు చూసి ముగ్ధురాలయి, ఆవితంతువు, మమకారంతో ఆ బుగ్గలు పుణుకుతూ "వొాసే అక్కయ్యా అను ఏం, అంటావా?" అంటూ గునిసింది.

"వొాసే?"

"అవును. ఏంతప్పూ? మనం క్షత్రియులం కాముగా?"

జానకి మిడుతూ మిడుతూ చూసింది.

"మీ చెల్లెళ్ళు నిన్ను వొాసే అనరా యేమిటమ్మా?"

"అంటారు కాని; మీ రెందుకన్నారు కాదు మరీ?"

"నాకూ అలవాటు లేకే."

"ఇంకేం?"

"జరిగిపోయిందాని కేంగానీ – యిది మొదలు వొా అంటే వొాసే అనుకుందాం మనం. ఏమే చెల్లాయీ?"

ఇలా అడుగుతూ ఆ వితంతువు జానకమ్మ జబ్బలు పట్టుకుని వూపేసింది.

అవ్యక్తానందంతో జానకి "సంయే" అంది.

అందుకు చాలా సంబరపడి "యేదీ, వొక్కమాటల్లా పిలూ" అంటూ ముచ్చటపడింది వితంతువు.

వెంటనే "నీ పేరెవరే అక్కయ్యా?" అనేసింది జానకి.

కానయితే, యీ ప్రశ్నలో వుండవలసినంత చనువు లేకపోగా, కొంచెం సంకోచం కూడా కనపడింది. అయినా అందుకే బ్రహ్మానందపడిపోయి "హోయి హోయి! నువ్వలా పిలిస్తే నా ప్రాణాలు లేచివస్తున్నాయి. నా కళ్ళకి కొత్తవెలుగు కనపడుతుంది" అంటూ మురిసిపోయింది వితంతువు.

"మరి నీ పేరేమిటే?" అన్నట్టు చూసింది జానకి.

"అన్నట్టు నాపేరడిగావు నువ్వు. పాపం! నా సంబరంలో నే నామాట మరచేపోయాను. నా పేరు రంగనాయికమ్మ" అంది వితంతువు, జానకి యింగితం గుర్తించి.

ఇది విని యేదో జ్ఞాపకం చేసుకుంటున్నట్టు పక్కవాటుగా కిందికి చూసింది. జానకి.

"నీతో మాట్లాడాలని నెల్లాళ్ళనుంచి దోరిపోతున్నాను నేను. నువ్వూ వారూ కూడా చద్దన్నం తింటారు కనక,–"

అర్థోక్తిలో ఆగిపోయి "చెల్లీ, వొక్కమాట .............. అడగనా?" అని గుటకలు మింగింది రంగనాయిక.

"అడగవే" అనేసింది జానకి; కాని "యేమడుగుతుందో బాబూ?" అని అంతలో సంకోచపడింది.

దీనికి సాయం ముసిముసినవ్వులు నవ్వుతూ వొక్కమాటు కళ్ళల్లోకి గంభీరంగా చూసింది రంగనాయిక.

దాంతో సంకోచమూ బలపడి, వెంటనే ఉబలాటమూ పొటమరించగా, విలంబం సహించలేక "అడగవేమే?" అని ముదలకించింది జానకి.

"నువ్వూ వారూ యేకబంతేనా?"

"వోస్. అదా?"

ఇలా అని అవ్యవహితంగా నవ్వేసింది జానకి.

"అవునా? ఏమే చెల్లీ?"

"మరి–మరి–కూచునీదాకా వొదలరుకదా, యేం చెయ్యమంటావే అక్కయ్యా?"

"యేమిటో యెందుకు చెయ్యాలి చెల్లీ, పెళ్ళికూతురులాగ ల–క్షణంగా కూచోక? నువ్వంటే యెంతప్రేమా లేకపోతే వారలా పట్టుపడతారు?"

"అంచేతే, యెదురుచెప్పలేకపోతున్నానే!"

"తప్పతప్ప, యెన్నడూ యెదురు చెప్పకమ్మా!"

"................"

"అంత ప్రేమ చూపిస్తున్నందుకు వారి నోటికి గోరుముద్దలందించినా రుణం తీరదు, తెలుసా?"

ఇది విని సిగ్గుపడి మురిసిపోయి, జానకి వూగిపోయింది.

"నేను చాలామాట్లు చూశాను. చెప్పకుంటే సిగ్గు. ఏ మైసూరుపాకో, ఏ మిఠాయో రహస్యంగా తెచ్చి మా చిన్నన్నయ్య ముచ్చటపడుతూ మా చిన్న వదిన

నోటికందించబోతాడు; కాని, గుర్రాలక్కలాగ మొగం తిప్పేసుకుని, ఆవిడ, చెయ్యి చాపుతుంది."

"అయ్యో" అంటూ బుగ్గలు నొక్కుకుంది జానకి.

"అయ్యోఅంటే? ఎక్కడ కయినా వెళ్ళవలసివచ్చినప్పుడు మా అన్నయ్య వెంట నడవడానిక్కూడా ఆవిడకు సిగ్గేట."

"అదేం వులకమే మామ్మా?" అంటూ సాగతీసుకుంది జానకి.

"పుట్టుకతో రావాలిగాని నేర్పితే వస్తాయిటే ముచ్చట్లూ మురిపాలూనూ? ఎంత అదృష్టం వుంటే పెళ్ళానికి తగ్గ మొగుడూ మొగుడికితగ్గ పెళ్ళామూ దొరకనూ?"

చూసి చూసి, తలుచుకుని తలుచుకుని, మురిసి మురిసి చివరికి "చద్దన్నాలప్పుడే అలాగ. మధ్యాహ్నమూ రాత్రీ వారికే ముందు వడ్డించేస్తాను సుమా" అంది జానకి, కళ్ళు తిప్పుకుంటూ.

"ఇంతకీ; చెప్పవచ్చిం దేమిటంటే – " అంటూ మళ్లీ అసలుసంగతి అందుకుంది రంగనాయిక.

జానకి చెవులోరజేసుకుంది.

## 2

"మీ రిద్దరూ కూడా చద్దన్నం తింటారు కనక, నువ్వు పొద్దెక్కివస్తావు గదా అని దినమ్మా నేనూ అలాగే వస్తున్నాను. అయినా, నువ్వెప్పుడోకాని తారసపడ్డమే లేదు. తీరా తారసపడ్డనాడు ఆసమయాని కెవరో వుంటున్నారు."

"ఉంటేం?"

"ఇన్నాళ్ళ కివాళ లేచినవేళ మంచిది."

"ఒక్కమా టయినా చెప్పారుకారేం?"

"అదిగో, మళ్ళీ మీరంటున్నావే!"

"ఇంకా నలగలేదుకాదుటే మరీ?"

"అవునమ్మా, అవును."

"కొన్నాళ్ళదాకా మీ రని వొకమాటూ, ముభావంగా వొకమాటూ, నువ్వని వొకమాటూ –"

"అదీ వొక అందమేలే."

"..................."

"మా సోమిదేవి అక్కయ్యని సాగనంపుతూ దొడ్డితలుపు తీశాటప్పటికి నువ్వు కనపడ్డావు. కాళ్ళు గబగబలాడిపోయాయి. ఇక నుంచోలేకపోయాను. అక్కయ్యతో చెబుతూ చెబుతూ వున్నమాట గభీమని తుంచేసి, గెంటేసినట్టు దాన్ని బలవంతాన పంపేసి, వొక్క అంగలో లోపలికి వెళ్ళి బిందెపుచ్చుకు వచ్చేశాను."

"ఆవిడ యేమనుకున్నారో పా–పం!"

"ఏమనుకుంటుం దేమిటి? ఏమిటో అనుకుంటే మాత్రం యువతలివాళ్ళు తమ పని మానుకుంటారా యేమిటి? ఇక్కడికి నెల్లాళ్ళనుంచి అటుమటించి పోతూ వుండగా యివాళ దొరికావు కదా నువ్వు—"

"ఆవిడకు తెలుసా?"

"అమ్మో, తెలుసునేం? దేవుడికయినా తెలుసునేం? వాళ్ళకీ వాళ్ళకీ తెలిసేవుంటే వొంటిగా దొరక్కపోతావా అని నీకోసం కనిపెట్టుక్కూచోడం యెందుకే?"

"నిజమే నిజమే. నిన్ను చూసినప్పుడల్లా మాట్లాడించాలని నాకూ వుబలాటంగానే వుంటోంది; సాహసించ లేకపోతున్నాను. ఆ వేళా? ......... రాజేశ్వరస్వామి గుళ్ళోనూ? ........... ప్రదక్షిణం చేశాటప్పుడొకమాటు పక్కపక్కగా వచ్చాం జ్ఞాపకం వుందా? అప్పుడు ఏమయినా సరే పలకరించేద్దామని—"

"అప్పుడు నువ్వు పలకరించినా పలక్కే పోదును. ఆ వేళ నేను బుద్ధిపూర్వకంగా మూగనోము పట్టేశాను."

"ఏం?"

"వెనకాల మా అమ్మ —"

"తె—ల్లగా ముగ్గుబుట్టలాగ తలా ఆవిడా —"

"ఆవిడ మా పెత్తాతగారి కూతురు. మా వెంకు సోదెమ్మత్తయ్య. ఆవిడ పక్కనీ—"

"బచ్చలిపళ్ళరంగు పట్టుచీర కట్టుకున్నారూ—"

"ఆ, ఆవిడే మా అమ్మ."

"చెరువుదగ్గిర చాలామాట్లు కనపడ్డారు, ఆవిడా దొడ్డమ్మగారు?"

"మరే."

"నీళ్ళు ముంచిపెట్టి, ఆవిడ నాకోనాడు బిందె బుజానికెత్తారు తెలుసా?"

"అదెప్పుడే?"

"పద్దినాలు కాలేదింకా. అప్పుడే తల అంటుకోడంవల్ల చెర్లో నీళ్ళు పోసుకోవలసిన అవసరం లేకపోయింది. పైగా పట్టుచీర కట్టుకువచ్చాను పావంచాల కింద చేపలు ముసురుకుంటూ వుండడంవల్లా అక్కడి నీళ్ళు ముంచడానికిష్టం లేక – పోనీ అంటే చెర్లో దిగడానికి వీల్లేక —"

"హోహో, అలా జరిగిందా?"

"అడగాలనీ అనుకున్నాను; కాని, తీరా, అడిగితే ఏమనుకుంటారో బాబూ—"

"మా అమ్మ అలాంటిది కాదు సుమా!"

"నా అవస్థ చూసి జాలిపడ్డారు కామోసు పాపం, నే ముంచిపెడతాను తేవే అమ్మాయీ—"

"నువ్వేం చేశావు?"

"నేనేమీ చెయ్యకపూర్వమే – అనకముందే వొడ్డుకి వచ్చి బిందె వులాక్కున్నారు. 'ఇలా అందించండీ' అంటూవున్నా పైకెక్కి వచ్చి బుజాని కెత్తి వెళ్ళి మళ్ళీ స్నానం చేశారు."

"ఒక్కొక్కప్పుడు తిక్క తిప్పకోలేదు గాని; వొకళ్ళకి సాయం చెయ్యడం అంటే మా అమ్మ కెంతో సరదా."

"మొత్తానికి, నీ మొగం చూశాటప్పటికి యెక్కడో చూసినట్టు మాత్రమే కాదు, కొన్నాళ్ళపాటు వొకచోట కలిసే–"

"దృఢమైన ఋణానుబంధం యేదోవుంది మనకి. వెనకటి జన్మలో యిద్దరమూ వొక్క కడుపున పుట్టివుంటాం."

"నాకూ అలాగే తోస్తోంది."

ఇంతలో అలికిడి కాగా రంగనాయిక వెనక్కి చూసింది.

కుళ్ళూ కుళ్ళూ దగ్గుకుంటూ తూలుతూ తూలుతూ ఆ బ్రాహ్మడు వెళ్ళిపోతున్నాడు.

వెంటనే "యిక రావే" అంటూ ముందు రంగనాయిక యేనుగుగున్నలాగ బయలుదేరగా "పదవే" అంటూ హంసపిట్టలాగ జానకమ్మ వెనకాల అనుసరించింది.

హఠాత్తుగా కలిసిన యీ స్నేహాని కాశ్చర్యమూ, వొక్కమాటే దృఢపడిపోయిన యీ చుట్టరికాని కానందమూ, వీటి మూలంగా పుట్టిన నునుసిగ్గు దొంతరలూ – ఇవి వారి నిద్దర్నీ నీరవులను చేసేశాయి.

దాంతో, చివరి పావంచా మీదికి వెళ్లేదాకా రంగనాయిక వెనక్కి తిరిగి చూడలేకపోయింది.

జానకమ్మ కూడా ఈపక్కకీ ఆపక్కకీ చూస్తూనే నడిచింది.

చివరిపావంచామీద కూడా ఒక్కక్షణం వారలాగే నుంచున్నారు; కాని యింతలో యెవరయినావచ్చి యేకాంతం చెడగొడతారన్న ఆదుర్దాతో "రావే చెల్లీ" అంటూ ముందు రంగనాయికా, "యితాలాడడం నీకు చేతవును టే అక్కయ్యా?" అనడుగుతూ వెనకాల జానకీ చెర్లో దిగారు.

"నీకు చేతవునా?"

"మాతల్లే, ఎప్పుడు నేర్చుకున్నావమ్మా?"

"చాలా దినాలయింది. ఏమీ కష్టం లేదే అక్కా!"

"ఎవరు నేర్పారూ?"

"మా చిన్నన్నయ్య."

"ఈ చెరువంతా యీదగలవా?"

"హ–మ్మో" అంటూ గుండెలు నొక్కుకుంది జానకి

అప్పటికప్పుడే యిద్దరూ గుండెలలోతుకి వెళ్ళారు

వెళ్ళీవెళ్ళడంతోటే యిద్దరూ అభిముఖంగా తిరిగారు

అప్పుడొక్కమాటు కంఠందాకా మునిగి లేచి "వొక్కమాటు కౌగలించుకో నివ్వవు టే చెల్లాయీ?" అని ప్రాధేయపడుతూ రంగనాయిక చేతులు చాపింది

ఈ మాట జానకమ్మకి నిర్భరానందం కలిగించింది.

వెంటనే ఆమెకూడా చేతులుచాచి ముందుకి వెళ్ళింది.

ఒక్క క్షణంకాలం ఒకరిచేతల్లో వొకరు – వారిద్దరూ వెన్నలా కరిగిపోయారు.

ఆ వొక్క క్షణంలోనూ వారిద్దరూ కామమూ ప్రణయమూ కలిసిపోయినట్టూ, సౌఖ్యమూ ఆనందమూ మిళావయిపోయినట్టూ, స్వర్గలోకమూ సత్యలోకమూ మిళితమయినట్టూ, జీవాత్మా పరమాత్మా ఐక్యమయిపోయినట్టూ వున్నారు.

తరవాత రంగనాయిక "యేడుపు వస్తోందే" అంటూ కళ్ళల్లో నీళ్లు పెట్టుకుని గద్గదికతో "చెల్లీ" అని పిలిచింది.

"ఆ."

"................ ....."

"ఎందుకే అక్కయ్యా?"

"ఈ దయ బతికివున్నంతకాలమూ –"

ఇంతవరకూ అన్నాక, పెదవులు రావిరేకల్లాగ వొణికిపోగా రంగనాయిక మరి మాట్లాడలేక పోయింది.

"అదేమిటే అలా అంటావూ? నీ దయ లేకపోతే నేను మాత్రం బతగ్గలనుటే?" అనడిగింది జానకి.

ఇలా అడిగినప్పుడు జానకి కళ్ళున్నూ చెమ్మగిల్లాయి.

"ఏదీ, చేతిలో చెయ్యి వెయ్యి" అంటూ రంగనాయిక చెయ్యిచాపగా, జానకి ఆ చెయ్యి గట్టిగాపట్టుకుంది.

ఇంతలో దూరాన మాటలు వినపడ్డాయి.

ఎవరో చెరువుకే వస్తున్నట్టు కనపడింది.

ఉలిక్కిపడి వారిద్దరూ యెడంయెడంగా జరిగారు.

ఇదయేటప్పటికి, వొక వెలమయువతి యెవరిమీదో రుంజుకుంటూ వచ్చి, బిందె ముంచుకుని గబాగబా చక్కాపోయింది.

"నీతో మాట్టాడాలనీ–" అంటూ మళ్లీ అందుకుని రంగనాయిక జానకి దగ్గిరగా వెళ్ళింది.

"నీతో జతగా వుండాలనీ, నిన్ను చెల్లాయీ అని పిలిచి నీచేత 'హాసే అక్కయ్యా' అని పిలిపించుకోవాలనీ నేను తల్లడిల్లిపోతున్నాను. నీతో మాట్టాడ్డానికి వీలుకాక నా హృదయం దహించుకుపోతోంది. ఈ జన్మ కీసౌభాగ్యం అయినా దొరకదేమో అని యింటికి వెళ్ళాక తలనొప్పిగా వుందని వంక పన్ని గదిలో పడి దొర్లిపోతూ కుమిలికుమిలి యేడుస్తూ వుంటాను."

ఏమనాలో తోచక జానకి తలవూపి వూరుకుంది.

"ఎవరితో నయినా వెళ్ళబోసుకుంటే యీ బాధ కొంత అయినా తగ్గి వుండును; కాని నోరు విప్పడాని కిష్టంలేకుండా వుంది, విప్పలేకపోతున్నాను."

జానకి మళ్ళీ తల వూపింది.

"ఇలాగ వున్న దుఃఖం వున్నట్టే వుండగా కొత్తదుఃఖం వచ్చి యెప్పటి కప్పుడే గుండెల కెగతన్నుతోంది. చెల్లోయ్! చెబితే నమ్మవు. నటన అనికూడా అనిపిస్తుంది; కాని నేనొక్కొక్కప్పుడు మరణవేదన –"

రంగనాయిక యిలా అనేటప్పటికి జానకి హృదయం గుబగుబలాడి పోయింది.

వెంటనే "యిక చెప్పకే అక్కయ్యా! నేనా మాటలు వినలేనే, చెబితే నన్ను చంపుకుతిన్నట్టే, నా కాళ్ళల్లో వొణుకు పుడుతోందే" అంటూ ఆమె రెండుచేతులూ పట్టుకుంది జానకి.

రంగనాయిక దీంతో వూరట చెందింది. కాని జానకి కళ్ళు చూసి నిలవలేక "నువ్వుకూడా యేడుస్తున్నావే! మా తల్లివి కాదూ? ఊరుకోమ్మా!" అంటూ తన చేతులు విడిపించుకుని, యెడమ చేత ఆమెని పొదివిపట్టుకుని కుడిచేత ఆమె గడ్డం పుణుకుతూ బతిమాలింది.

ఇద్దరికీ మనస్సులు తేరుకున్నాయి.

జానకి యేదో అనబోగా అడ్డువచ్చి "యేదీ యేమయినా నువ్వు నాకు చెల్లెలివయినావు. నన్ను అక్కగా చూసుకుంటా నన్నావు. ఇక నాకేం లోటూ? ఇలాగయినా నువ్వే నే నని తృప్తిపడడానికి దేవుడు మార్గం చూపించాడు" అంటూ ఆమె కణతలమీద మెటికలు విరిచింది రంగనాయిక.

## 4

ఈ సమయంలో, అతి వయ్యారంగా వొక దేవాంగిరమణివచ్చి "వేసవికాలం అయితేమాత్రం చెర్లోదిగితే చలికాదుటండీ?" అనడుగుతూ బిందె ముంచుకొని, జవాబు కోసం వొక్కక్షణం చెవు లోరజేసుకుని వుండి, చివరికి నిరుత్సాహపడి "ఎరక్కపోయి పలకరించా" నని విసుక్కుంటూ చక్కాపోయింది.

ఆమె హఠాత్తుగా వచ్చినందు కులిక్కిపడి, మళ్ళీ వెంటనే వెళ్ళిపోయినందుకు దిటవుతెచ్చుకుని "ఇవాళ యేకాదశి" అంటూ రంగనాయికా, "నిన్ననే స్నానం" అంటూ జానకీ జారుముళ్ళు విప్పుకుని, పల్లెవాడు వలవేసినట్టు కేశపాశాలు నీటిమీదికి విసిరేసుకున్నారు.

దాంతో, చెరువంతా నాచు కమ్మిన ట్టయిపోయింది.

తరవాత, అంత లోతున వుండిన్నీ చేతులలో నీళ్ళు చల్లుకునే స్నానం చేసి అతికష్టంమీద మళ్ళీ వారు జారుముళ్ళు వేసుకున్నారు

ఇదయిన తరవాత, అప్రయత్నంగా యిద్దరూ మొగాలు వంచుకున్నారు.

మళ్ళీ వొకర్నొకరు చూసుకున్నారు.

జానకి చూపుల్లో "వెళ్ళిపోదాం" అన్నభావం మెరిసింది.

అది గుర్తించి కంగారుపడి "మొదట నన్ను మీవారి కివ్వడానికి నిరుకయింది" అంటూ అసలుగొడవ యెత్తుకుంది రంగనాయిక.

"ముహూర్తం వుంచడం కూడా జరిగిపోయింది"

"మరెందుకు తప్పిపోయిందీ?"

"నా అదృష్టం మంచిది కనక."

ఈ మాట అన్నప్పుడు రంగనాయిక యెంత నిశ్చలంగా వుందో, విన్నాక జానకి అంత చకితురా లయిపోయింది.

"ఏం, అలా అయినావేం?" అనడిగింది రంగనాయిక.

"నీ అదృష్టం –"

"అవును, నా అదృష్టం మంచిది కనకనే నేను మోడునయిపోయినా వారిని కళ్ళతో చూసుకుంటూ అయినా ఆనందించడానికి పెట్టిపుట్టాను కనకనే."

ఇది విని జానకి వొకవిధంగా తెప్పరిల్లింది.

"పెద్దదాన్ని కాకుండానే నాకీ దుర్గతి పట్టే యోగం రాసివుంది. నాకు పైసంబంధం అయింది కనక, వారు బతికి వున్నారు."

జానకి మిడుతూమిడుతూ చూసింది.

"మీవారి విలవ నాకు తెలిసిన ట్టెవరికి తెలుసూ? పక్క పావడి తీసుకుని, వుత్తరీయం జందెప్పేట్టుగా వేసుకుని వారు కనపడితే 'అదృష్టవంతులు' అనుకుంటూ నేనెంత పొంగిపోతానో యెవరెరుగుదురూ?"

"ఆ పాపిడి నేను దిద్దుతా నని యెరుగదు అక్కయ్య!" అనుకుని నవ్వుకుంది జానకి.

అలా సూర్యోదయం అయేటప్పటికి అతనిలా స్నానంచేసి పొడిబట్ట కట్టుకుని దక్షిణపువసారాలో కుర్చీపీట మీద కూచుంటాడు.

అద్దం చేతికిచ్చి యెదుటనుంచుని జానకి తలదువ్వుతుంది.

ఉండుండి అతను కదలాలనే కదులుతాడు

"ఉండండీ, కదలకండీ, అలా–అలా–సడే వంకరవచ్చింది ఇలా అయితే పాపిడీ దిద్దడం నావల్లకాదు బాబూ!" అంటూ ఆమె మూతి ముడుచుకుంటుంది.

"పొరపాటే కాని, యెరక్కచేశాను ఇక కదిలితే అడుగు. మాట తిరిగితే బుగ్గ కొరికెయ్యి" అని అతను క్షమాపణ చెప్పుకుంటాడు.

ఒకటిరెండు నిమిషాలు ఇలా సరాగాలు జరిగి, చివరికి రాజీ అయిపోతుంది.

ఇలాగ, దినాని కొక విధంగా నడుస్తుంది కథ

జానకమ్మ కదంతా జ్ఞాపకం వచ్చింది.

దాంతో, ఆమె మొగం వికసించింది.

అది గుర్తించి, కొంటె చూపులు చూస్తూ "నువ్వేనా తలదువ్వడం? .......... ఏమే చెల్లీ?" అంటూ బెల్లించింది రంగనాయిక.

సిగ్గూ ఆనందమూ పెనవేసుకుని జానకి మొగం పక్కకి తిప్పేశాయి.

"నువ్వే దువ్వుతావు, నాకు తెలుసు. అది నీ పనే కాకపోతే వారంత తిన్నగ పాపిడి దిద్దుకోగలరేం?" అంటూ మళ్ళీ బెల్లించింది రంగనాయిక.

"మరి – మరి ఇప్పుడింత సంతోషించేదానవు, అప్పుడు మీవాళ్ళు మరో సంబంధం తెస్తే నువ్వెందు కంగీకరించావూ?"

"నా కర్మం కాలిపోతే, నే నంగీకరించి వూరుకున్నా ననుకున్నావా యేమిటే? అప్పుడేం జరిగిందో యెరుగుదువా మరి?"

"ఏం జరిగిందమ్మా?"

"ఎంతయినా జరిగింది. ఇంతకీ ఆస్తి యేమాత్రమో –"

"జమీందారులా?"

"సడే! ఏటా అరువందలు వస్తాయిట."

"ఊహూ" అంటూ పక్కకి చూసింది జానకి.

"మీ ఆయనకి మూడువేలు వస్తాయి, నే నెరగనా?"

జానకి మొగాన గర్వరేఖ తళుక్కుమంది. అది మాటు చేసుకుంటూ "పోనీ, చదువు?" అనడిగిందామె.

"ఇంటర్ మీడియేటేగా? మీ ఆయన బి.ఏ. చదువుతున్నారు. ఆ కోతి, డాక్టరు పరీక్ష –"

"కోతా?"

"కోతయినా నయమే. చూడూ, నిడదవోలు స్టేషన్లో వుంటాయీ ............?"

"కొండముచ్చులా?" అనడిగింది జానకి చకిత అయి.

"అవయినా కొంత నయమే. వాటికి మొగమే నలుపు"

తన భర్త సొగసు కళ్ళకు కట్టినట్టయింది జానకమ్మకి.

మళ్ళీ ఆమె కళ్ళు మెరిశాయి; కాని మాట మార్చెయ్యదలిచి "అన్నదమ్ము లెందరూ?" అనడిగింది.

"అరువందల సౌభాగ్యానికి వాటాలు కూడా కావాలా యేమిటమ్మా?"

"అరువందలతో కూచుంటారా యేమిటే? డాక్టరైనాక దోచెయ్యడమేగా?"

"దోచేస్తానే వున్నాడుగా?"

జానకి నవ్వు అపుకోలేకపోయింది.

రంగనాయిక నవ్వింది.

"శాబాసు, ఆసంబంధం యెలా తెచ్చారే మీవాళ్ళూ?"

"తెచ్చి వూరుకున్నారా? యజ్ఞయాగాలు చేసిన కుటుంబం అంటూ పొంగిపోయాడు మా నాన్న. 'నిక్షేపంలా వున్నాడు. నలుపయితేయేం? కృష్ణమూర్తి యెరుపా యేమి' టంది మా అమ్మ. 'రాచ కుమారుడులా వున్నాడు, పెట్టి పుట్టా" వంది మా పెద్దవదిన. 'ఒక్క సంవత్సరంలో పెద్ద డాక్టరయిపోతాడుట' అంది మా చిన్నవదిన."

"నువ్వు–"

"కిటికీలోనుంచి చూసి తలతిరిగి కూలబడిపోయాను. అదేమిటో యెరగని మా అమ్మ నన్ను పొదివిపట్టుకు తీసుకువెళ్ళి కూచోబెట్టింది."

"రామరామా!"

"కూడా వచ్చిన ముసిలా డేమిటో అడిగాడు. నేను మాటాడలేదు. 'పాడగలవా?' అన్నా డాపిల్లాడు"

"తను పాడతా డటనా?"

"మరే, అదే తక్కువ......అప్పుడు నే నేం చేశానో–"

"చెప్పవే అక్కయ్యా!"

"మొగం వంచుకున్నాను, అది చాలక కళ్ళు మూసుకున్నాను. అదీ చాలక నోరు కుట్టేసుకున్నాను. అయినా డోకు వస్తున్నట్టయి ఉబ్బెత్తుగా లేచి–"

"అయ్యో!"

"అయ్యో?"

"అవునవును తప్పే, నువ్వు మంచిపనిచేశావు, అయితే, అప్పుడయినా వాళ్ళు గ్రహించుకున్నారా?"

"సిగ్గూబిడియమూ వుంటేనా గ్రహింపుశక్తి వుండడానికి? వెయ్యిరూపాయిలూ అప్పుడే పుచ్చుకుని, తాంబూలాలు కానిచ్చేసుకుని–"

"ఛీ, వాళ్ళ నేంచేసినా పాపం వుందా?"

"ఎవళ్ళనీ?"

"అవునవును, మీవాళ్ళనే."

"అలా అన్నావు బాగుంది. ఆ పిల్లాడు నాకు వద్దని నెత్తీ నోరూ బాదుకున్నాను. రెండుదినాలు పచ్చి మంచి నీళ్ళు కూడా పుచ్చుకోలేదు. పెళ్ళి కూతుర్ని చేశారు. ఏడుస్తూనే వున్నాను. పీటలమీద కూచోపెట్టారు. ఏడుస్తూనే వున్నాను."

"అయ్యో!"

"అయ్యో అంటే పండువంటి పెనిమిటిని సంపాదించుకున్నావు. నా యాతన నీకిప్పు డేం తెలుస్తుంది చెల్లీ?"

రంగనాయిక యిలా అడిగాటప్పటికీ, జానకమ్మకి మిలమిల మెరసిపోతూ మొగుడు ఎదట నుంచున్నట్టనిపించింది.

అతణ్ణి చూసి వూళ్లోవున్న మిటారికత్తెలందరూ గుటకలు మింగుతున్నట్టున్నా కనపడింది.

దీనికి సాయం, మొన్న మొన్ననే – అంటే యిరవై దినాల కిందటే వొక తమాషా జరిగింది.

వేణుగోపాలసిద్ధాంతిగారి పెద్దకొడుకు మూడోకూతురికి పెళ్ళి.

వీరు నాలుగువేలు వరదక్షిణా, అయిదువందలు లాంఛనాలు యిచ్చారు.

వారు రెండుబోగం మేళాలతోటీ, కవిగాయకులతోటీ ఆడా మొగ – పిల్లా మేకా – పదమూడు బస్సులమీద వచ్చి, అయిదు వేలు నగదు పెట్టి ఝూమ్మంటూ సదస్యం చేశారు.

వారిలో వొక యువతి అచ్చంగా జానకిలా వుంది

హఠాత్తుగా చూసి, పార్వతీశం, ఆమె జానకమ్మే అనుకున్నాడు; కాని ఆమె కట్టుకున్న చీరవంటిది, జానకమ్మకే కాదు, ఆ వూళ్ళోనే యెవరికీలేదు.

ఇంటికి వచ్చాక జరిగిం దంతా చెప్పా డతను.

ఏదో గొప్పవిషయం కనిపెట్టినవాడిలాగ మహా పొంగిపోతూ చెప్పాడతను.

వినివిని మొదట జానకమ్మకూడా వింతేపడింది; కాని చివరికి "ఆ చీర చూశారు కదా మరి, నేనే అని యెలా అనుకున్నారండీ?" అనడిగింది, కొంటె చూపులుచూస్తూ.

ఈ మాట కొరడా కొసలాగ తగిలిం దతనికి.

"అన్నా, మా జానకిలా వుంటావా?" అని ఆపిల్లమీద పుట్టిన స్పర్థ అతనికి కసిగా మారిపోయింది.

వెంటనే రాజమండ్రీ ప్రయాణం కట్టాడు.

అక్కణ్ణుంచి మద్రాసే వెళ్ళిపోయాడు.

సదస్యంనాడు, ఉభయపక్షాలా, ఎక్కడెక్కణ్ణుంచో మరికొందరు చుట్టాలు కూడా వచ్చారు.

"వారు రాలేదు కదా, సదస్యానికి వెళ్ళడమా మానడామా" అని అనుకుంటూనే, చీర కట్టుకోడం తరవాయిగా, తలదువ్వుకోడం వగైరాలన్నీ పూర్తి చేసుకుని వుంది జానకి.

ఇలాంటి స్థితిలో రెండుచీరలు పట్టుకు చక్కా వచ్చాడు పార్వతీశం.

"అయ్యో, రెండెందుకు తెచ్చారండీ యిప్పుడూ?" అని జానకి సాగతీసుకుంది గాని, అతను చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

దానిమీద కొంచెం వాగ్వాదం జరిగింది.

చల్లాబడింది.

అప్పుడు "ఇవాళ కిది కట్టుకో" అని వాటిలో వొకచీర అందించాడతను.

మురిసిపోతూ యిద్దరూ వెళ్ళి చూస్తారు కదా, ఆ పిల్లకూడా సరిగా అలాంటిచీరే కట్టుకుని తయారయింది.

తాను తీసికట్టు అయిపోనందుకు జానకి వుషారుగానే వుంది గాని; "మించలేక పోయానే" అని అతను చాలా కించపడ్డాడు.

ఇది యిలా జరుగుతూ వుండగా ఉభయపక్షాలా వచ్చిన ఆ యీడు పిల్లలందరూ సదస్యం విడిచిపెట్టి ఆ యిద్దరి చుట్టూ మూగారు.

అది గుర్తించుకుని "పల్లెటూరిదానవు నీకెంతవేషమే" అన్న ట్టాపిల్లా; "నీ పట్నవాసం యెగురుపాటు ఈపాటికి చాలించవో ఓవిడా" అన్నట్టు జానకీ కోరచూపులు చూసుకున్నారు.

ఇంటికి వెళ్ళాక జరిగిం దంతా చెప్పి జానకి పార్వతీశాన్ని పువ్వులతో పూజించింది.

అయినా అతనికి తృప్తి కాలేదు.

మళ్ళీ రాజమండ్రీ వుడాయించాడు.

మళ్ళీ రాత్రి పదిగంటలకే యింటికి వచ్చాడు గాని; యెంత అడిగినా వెళ్ళిన కారణమూ చేసుకువచ్చిన పనీ మాత్రం జానకమ్మకీ చెప్పలేదు.

మర్నాడు సాయంత్రం బంతులాడింపు చూడ్డానికి పిలుపు వచ్చింది.

జానకి బర్మామ్ముడి వేసుకుంది గాని; పార్వతీశం అది విప్పించేసి స్వయంగా వాలుజడ వేశాడు.

కనపడీ కనపడనట్టు కాటుకతో కనుబొమ్మలు దిద్దాడు.

బ్రహ్మకయినా తెలవకుండా వుండేటంత నాజూగ్గా చెక్కిళ్ళకి చెర్రీ పొడ రద్దాడు. రవ్వల లోలకులు తీయించేసి జేబులోంచి తీసి చక్రాల లోలకులు పెట్టాడు.

ఇది యిలా జరుగుతూ వుండగానే ఆమె పెదవులు తాంబూలరాగ రంజితా లయినాయి.

తరవాత, ఆమె, అతను చెప్పకపూర్వమే రెండోచీర కట్టేసుకుని, తలలో మల్లెపువ్వులగుత్తి అమర్చుకుని, నిలువుటద్దం యెదుట నుంచుని యెగాదిగా చూసుకుని "మారిపోయానండీ!" అంటూ నెమలి కేక వేసింది.

ఇద్దర్రూ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ వెళ్ళారు

పెళ్ళికూతురి తండ్రి పార్వతీశాన్ని మేజువాణిలోకీ, పెళ్ళికూతురు అక్క జానకిని బంతులాడింపుదగ్గరికీ తీసుకువెళ్ళారు.

తొలీనాడు జరిగింది తలుచుకుని ఆ పిల్లకూడా మాంచి తయారీలో వచ్చింది కాని, అన్ని విధాలా జానకి యెదుట వెలవెలపోయింది.

తొలీనాడు ఇద్దరి చుట్టూ మూగిన పిల్ల లందరూ ఆవేళ వొక్క జానకి చుట్టూ మూగి వూరుకున్నారు.

దీంతో, ఆ పిల్ల, కొట్టినంత బాధపడి యెవరికీ చెప్పకుండా విడిదిలోకి చక్కాపోయింది.

ఇదంతా విని ఆవేళ రాత్రి పార్వతీశం బ్రహ్మానందపడిపోయాడు.

తాను కోరకపోయినా, నిమిషాలమీద అలాంటి చీరలు తెచ్చినందుకూ – రెండు తెచ్చినందుకూ – చక్రాలలోలకులున్నూ తెచ్చి కొత్త అందం సంఘటించినందుకూ పడిపడి దణ్ణాలు పెట్టి జానకి అతని చేతుల్లో కరిగిపోయింది

ఇది కూడా ఆమె కిప్పుడు జరుగుతున్నట్టనిపించింది.

దాంతో "అంతచేసినా మీవాళ్ళు మానలేదూ?" అని కొంచెం గర్వంగానే అడిగిందామె.

దానికి తడువుకోకుండా "నా అదృష్టం మంచిది గదా, వాళ్ళెలా మాన్తారే?" అని యెదురడిగింది రంగనాయిక.

"పసుపుల నలుగులూ, బంతాడింపూ, వూరేగింపూ–"

"సడే, అన్నీ అయినా యనిపించుకున్నారు కాని; వొక్కనాడయినా ససిగా సాగనిస్తేనా నేను!"

జానకి చకిత అయి వూరుకుంది.

"నువ్వు గృహప్రవేశానికి వచ్చి వూరేగుతూ మా వీధిలో ఆగినప్పుడు 'మీవాళ్ళు నన్ను తిరస్కరిస్తే నాకేం లోటా? చూసుకో నాకెలాంటి పిల్ల దొరికిందో?' అన్నట్టు ముందు నీకేసీ తరవాత నాకేసీ చూశారు మీవారు. నా హృదయం గుబగుబలాడిపోయింది. అమాంతంగా పాలకీలోకి దూకి నీ పక్కని కూచోవా లన్నంత ఆదుర్దాపడిపోయాను నే నప్పుడు" అంది మళ్ళీ రంగనాయిక.

జానకి ముసిముసినవ్వులు నవ్వుకుంది.

"నువ్వు తొలిమాటు కాపరానికి వచ్చి నప్పా డెన్నివిధాలో ప్రయత్నించాను కాని, నువ్వు కనపడ్డావే కావు."

"అప్పుడు నే నిక్కడ వున్న దేదీ? పట్టుమని వారం దినాలయినా–"

"అవునవు"నంటూ అప్రయత్నంగా పావంచాలకేసి చూసింది రంగనాయిక.

దూరాన, యెవరితోనో మాట్లాడుతూ చేతవున్న చెంబుకి చింతపండు పట్టిస్తూ ఒక బ్రాహ్మణుడు వస్తున్నాడు.

మొదట అనుమానించి, కళ్ళు చికిలించుకుంటూ చూసి, చివరికి దృఢపరుచుకుని "అడిగో మా పెద్దన్నయ్య" అంటూ కంగారుపడి "దయవుంచవే చెల్లాయీ"అంటూ పావంచాలమీది బిందె అందుకుని "మళ్ళీ రేపు– కాస్త అలస్యమయినా వుండాలిసుమా" అంటూ నీళ్ళుముంచుకుని "సెలవు–సెలవు–సెలవ్" అంటూ ఆత్రంగా బయలుదేరి, మాటవినిపించుకోకుండానే లేడిలా ఎగిరిపోయింది రంగనాయిక.

అది చూసి జానకి తెల్లపోయింది.

"వాళ్ళ పెద్దన్నయ్య వస్తే యేం? నాతో మాట్లాడితే తప్పా?" అని వితర్కించుకుంటూ, రంగనాయిక అన్నగారిని చూసి బెదురుతూ, తరవాత ఆమెకూడా కొంచెం చురుగ్గానే వెళ్ళిపోయింది.

## 6

మండువా వాకట్లో పడక్కుర్చీలోవాలి పార్వతీశం యేదో ఆలోచించుకుంటూ వుండగా, చెరువునుంచి తడిబట్టలతో వచ్చిన జానకి, బిందె బుజమ్మీదే వుంచుకుని చిరునవ్వు నవ్వుతూ యెదుట నుంచుంది.

పదిహేడేళ్ళపిల్ల అయినా సలాకలాగ బక్కపలాచని మనిషి కనక, కుంచెడుతప్పేలా బరువుకే ఆమె వూగిసలాడిపోతోంది.

అది .చూసి మందహాసం చేస్తూ "చాలా బరువులు కలిశాయి పాపం, బిందె యింటో దింపేసి పొడిబట్ట కట్టుకురారాదూ అంతపని వుంటేనూ?" అనడిగా డతను; కాని దానికి జవాబు చెప్పక, అలాగే నుంచుని, అలాగే చిరునవ్వు నవ్వుతూ "మీకెన్నిసంబంధాలు వచ్చాయండీ మొదటా?" అని యెదురడిగిం దామె.

"అదేమిటి?" అన్నా డతను వింతపడి.

"చెబుదురూ"

"ఏమిటి చెప్పడం?"

"బాగానేవుంది, వినపడలేదూ?"

"వినపడితే సరా, బోధపడవద్దూ?"

"పులకం?"

"అబద్ధం ఆడుతున్నాననే?"

"అయితే మళ్ళీ అడుగుతాను. మీ కెంతమంది పిల్లల నిస్తామంటూ వచ్చారండీ మొదటా?"

"రావడం చాలామందే వచ్చారు. అయితే, వచ్చిన వారందరూ వొక్కొక్క పిల్లనే యిస్తానన్నారు గానీ–"

"కానిమాట అడగలేదు నేను."

"అయిన మాటే చెబుతున్నాను నేను. అయితే–"

"అయితే గియితేల కేంఅవసరం వచ్చిందీ యిప్పుడూ?"

"అదే నేనూ అడుగుతున్నాను. ఇలా అడగడానికేం అవసరం వచ్చిందీ?"

"అవసరమే వచ్చింది.?"

"ఏమిటో అది?"

"అదంతా మీకక్కర్లేదండీ!"

"ఘోరకలి! నా సంగతి కూడా నువ్వే నిర్ణయం చేసెయ్యడమేనా?"

జాప్యం సహించలేక చురచుర చూస్తూ "చెప్పరూ?" అని కచ్చితంగా అడిగిందామె. మయూార క్రేంకారంలా వుందామాట.

ఆ శిరస్సు వూపుకి, వొళ్ళంతా వూగి, బిందె కదిలి, నీళ్ళు తటతట్లాడాయి.

అయితే, అసలేమిటో చెప్పకపోవడంవల్ల పట్టుదల వచ్చి "నువ్వు చెప్పావా యేమిటి?" అంటూ మాట మెల్లిగా జారవిడిచాడతను.

కానయితే, అతను చిరునవ్వు నవ్వుతూనే వున్నాడు.

కొంటెచూపులే చూస్తున్నాడు.

కనక, యిదంతా సరాగం అని ఆమెకీ తెలుసు; కాని రంగనాయిక సంగతి తెలుసుకోవాలన్న ఆత్రంలో ఇదంతా తికమకగా కనపడిందామెకి.

ఓపట్టాన యిది తేలదని నిరుకుపరుచుకుంది.

వెంటనే "దాచుకోండి" అంటూ చివాలున బయలుదేరేసింది.

ఇది చూసి అప్రతిభుడయిపోయాడతను; కాని వెంటనే మాంద్యం పోగొట్టుకుని "వెళ్ళిపోతావేం? చెబుతారా, పాపం" అంటూ లేచినుంచున్నాడు. అయితే అప్పటిక ప్పుడే ఆమె "అ–క్క–ర్లే–దు" అంటూ ముందువా తిరగవేసుకుని గుమ్మందాటి పడమటింటిలోకి వెళ్ళిపోయింది.

## 7

నిజం చెప్పవలసివస్తే జానకి మాటకారే కాని; అనవసరమైనమాట వొక్కటీ రానివ్వదు.

అడగవలసిందేమయినా వుంటే సూటిగానూ, స్పష్టంగానూ, మృదువుగానూ, మితంగానూ అడుగుతుంది గాని; అదేపనిగా పట్టుకుని పీడించదు.

అడిగింది చెప్పకపోయినా, కోరింది చెయ్యకపోయినా ధుమధుమలాడదు కాని; వెంటనే జవాబు కావాలి. డొంక తిరుగుళ్ళు పనికిరావు.

ఈసంగతి అతనికి బాగాతెలుసు కాని; వాదం అంటే అతను చెవికోసుకుంటాడు.

అంచేత ధోరణి తరచు ఇలా వచ్చేస్తూ వుంటుంది.

దీనికి ఫలితంగా ఆమె మొగాన అంకితం అయిన అసంతృప్తి చూసి అతను చాలా గాభరా పడ్డాడు.

పడి?

అక్కడే కూచుంటే పడేం లాభమూ?

వెంటనే బయలుదేరాడు.

చూడగా, తలుపు గడియవేసి వుంది.

పిలవగా "పొత్తిచీర కట్టుకుంటున్నానండీ!" అని జవాబు.

చేసేది లేక, మరచిపోకుండా వుండడానికి మధ్య మధ్య గొళ్ళెం కదుపుతూ అతనక్కడే-అలాగే నుంచున్నాడు.

అత నొక్కొక్కమాటు గొళ్ళెం కదిపినప్పుడల్లా ఆమె కొక్కొక్క నవ్వుతెర వస్తూ వచ్చింది.

"ఏం, అడగ్గానే చెబితే యేం?" అని వొకమాటూ, "నన్ను విసిగించినట్టు లేదేం?" అని వొకమాటూ, "ఇంకెప్పుడూ యిలా చెయ్యరుకదూ?" అని వొకమాటూ మాట కూడా నాలుక చివరికి వస్తూ వచ్చింది.

కాని, కిమన్నాస్తి.

నవ్వూ అణుచుకుందామె, మాటా బిగపట్టుకుంది.

అయితే, అతను మళ్ళీ కత్తు కలపడానికి వచ్చాడని ఆమెకి తెలుసు.

అయినా, బతిమాలినకొద్దీ బిర్రబిగిసే రకం కాదు కనక, పని కాగానే తలుపుతీసి, రెప్పవెయ్యకుండా చూస్తూ వెనక్కి తప్పుకుంది.

జరిగిపోయింది గుర్తుంది కనక "నువ్వడిగింది చెప్పడానికి వచ్చా"నని సూటిగా అన్నాడతను.

"నే నేమడిగానూ?"

"చెరువునుంచి యిప్పుడే అలా దొడ్డిదారిని వచ్చావు కామోసు పా-పం!"

"పడకకుర్చీలో పడుకుని నిద్రపోతూ వుండగా నేనేదో అడిగినట్టు కలవచ్చింది కామోసు పు-న్నెం?"

ఇది విని పార్వతీశం తెల్లపోయాడు.

ఆమె తల పంకించుకుంది.

కొంతసేపు ఆలోచించి, అప్పటికీ యుక్తితోచక చివరికి "వినవూ?" అని మొండిగా అడిగాడతను.

"ఓమూల పొయ్యి అలా మండిపోతూవుంటే యీమూల మీతో కభుర్లు చెబుతూ కూచోడానికి వీలుటండీ?"

"మండే పొయ్యిమీద తప్పేదు గిన్ని పడేస్తే ఆ రెండూ కలిసి నీళ్ళతో తన్నుకుంటూవుంటాయి కదుటండీ?"

"ఇంకేమీ పని లేదూ?"

"ఇది పని కాదూ?"

"దాటిపోలేదూ?"

"వెనక్కి లాగేద్దాం, మనకి చేతకాదూ?"

తల అడ్డంగా వూపి, పెదిమలు కూడా వొకమాటు బిగించుకుని "వెనకటిది ముందూ, ముందటిది వెనకానూ" అందామె.

"అదో అందం."

"అడగక్కర్లేదు."

"పొరపాటన్నది అందరికీ వస్తుంది; కాని యింతకత్తుల మీద పరీక్ష –"

"ఎవరు చేశారండీ?"

"నేనే కనక, క్షమించండీ"

"బాగానే వుంది."

"అయితే, యిక తగువెందుకూ? తడిబట్ట ఆరేసివస్తావా – యీమాట కూడా తప్పులోనే చేరుస్తావా?"

దీని కామె బదులు చెప్పలేదు.

మొదట వొక్క నిశితకటాక్షం మాత్రం విసిరింది.

తరవాత యెదటి గోడదగ్గిర పీటవాల్చి "కూచోండి" అని చెబుతూనే పెరట్లోకి చక్కాపోయింది.

## 8

"కథ యెక్కడా ప్రారంభించడం?" అని అత నింకా ఆలోచనలోనే వుండగా ఆమె మళ్ళీ వచ్చి, పొయ్యికి దగ్గరగా చిన్న పీట వేసుక్కూచుని "మరి చెప్పండి" అంటూ సావధాన అయింది.

"మొదట వరాసగా అయిదుగురు పెద్దమనుష్యులు, పిల్లనిస్తామని–"

"అయిదుగురూ వొక్కపిల్లనే?"

"ప్రథమకబళే మక్షికాపాతః – మరుపన్నది యెరగవు పాపం, బదులు తీర్చుకునేదాకా నిద్రపోవు"

"ఉలు కలా వుంటుంది కొందరికి."

"కొందరికే కాదు, సమయం వస్తే అందరికీ అంతేనండి. మరి కథ వినండి."

"అవెందుకు తిరిగిపోయాయో ముందు చెప్పండి."

"ఒకటి మా నాన్నగారికి నచ్చలేదు. ఒకటి మా అమ్మ వొప్పుకోలేదు. ఒకటి లాంఛనాలు కుదరక తప్పిపోయింది. ఒకటి నాకు సుతరామూ నచ్చలేదు. ఒకటి అన్నీ స్థిరం అయిన్నీ, హఠాత్తుగా మా నాన్నగారు పోవడంవల్ల దాటిపోయింది."

"మీ నాన్నపోతే ముహూర్తం మారాలి గాని సంబంధమే దాటిపోవడం యేమిటీ?"

"పిల్ల కట్టుతప్పివుండడం వల్ల వారు వెంటనే పెళ్ళయి పోవాలన్నారు. మావాళ్ళు సంవత్సరమధ్యం పనికిరాదన్నారు. కానయితే ఆలోపున వారూ పెళ్ళి చెయ్యలేక పోయారు కాని; అంతలో నా పరీక్ష పోయింది. ఇదే సందని పరీక్షలో నెగ్గిన మరొకణ్ణి చూసుకుని వారు నన్ను తిరస్కరించేశారు."

"పాపం, పెళ్ళి ఆగిపోడమూ, పరీక్ష తప్పిపోడమూ–"

"నిజమే, మా నాన్న పోవడంవల్ల సంబంధం దాటిపోయింది సంబంధం దాటిపోవడంవల్ల పరీక్ష యెగిరి చక్కాపోయింది."

"అంత బెంగెందుకూ? పెళ్ళికోసమా, ఆ పిల్లకోసమా?"

అతను మిడుతూ మిడుతూ చూసి వూరుకున్నాడు.

"ఏం, మాట్లాడరేం?"

"నిజమే చెప్పాలా?"

"తప్పకుండానూ!"

"అయితే, ఆ పిల్లకోసమే!"

ఇలా చెప్పి, ఆమె యేమంటుందో – యేమనుకుంటుందో అన్నట్టు అతను బెదురుచూపులు చూశాడు.

"అది వెనకటిమాట. తప్పలేదులెండి" అని అభయం అనుగ్రహించిందామె, అతని యింగితం గుర్తించి.

"నువ్వామాత్రం అనుగ్రహం చూపిస్తే యిక చెప్పకేం? ఆ సంబంధం కుదిరినందుకు మొదట నేను వెయ్యిమంది దేవుళ్ళకు మొక్కుకున్నాను తప్పిపోయినందుకు, తరవాత చాలాకాలం మతిపోయి–"

"చివరి కెలా తిరిగిపోయిందండీ చూపు?"

"కోరుకున్న వన్నీ సమకూడడానికి మనమేం దేవతలమా? అవుతుందంటే ఆశ పడ్డాను, తికమకలు వస్తే బెంగ పెట్టుకున్నాను, కాకపోగా, ఆశ వదులుకున్నాను ఆశ యెలాపోయిందో–"

"మొగాళ్ళు అంత సులభంగా తిప్పేసుకోగలరు కామోసు మనస్సు!"

"తిప్పేసుకోగల రంటే–"

"తరువాతి సంగతి చెప్పండి. మీరు తప్పిపోయినందుకాపిల్ల యేం చేసిందో?"

"నాకంటేనూ ఘోరం చేసింది."

"అక్కడికి మీరు మహా ఘోరం చేసినట్టు!"

"నువ్వే కాదూ యిప్పుడే అన్నావూ?"

"నేనా? ............ ఏమనమ్మా?"

"మొగాళ్ళు అంత సులభంగా తిప్పేసుకోగలరు కామోసు మనస్సు అనమ్మా!"

"వోస్ అదా? ............ పోనీ, వొప్పుకున్నాను. అయితే, ఆ పిల్ల చేసిన ఘోరం యేమిటీ?"

"ముహూర్తం దాటిపోయినందుకు బెంగ పెట్టుకుందిట మరో సంబంధం కుదిర్చినందుకు నిట్రుపవాసాలు చేసిందిట. పెళ్ళిలో వొక్కమాటూ సంబరపడుతూ పీటలమీద కూచోలేదుట!"

"ట?"

"టా కాకపోతే నేను చూశానా? ఆ పెళ్ళికి నేను వెళ్ళాననుకున్నావా?"

"మీరు వెళ్ళివుంటే ఆ అమ్మాయి తలంబ్రాలు మీమీదే పోసును, కదూ?"

"ఇంకా సందేహమా? చూసినవాళ్ళలాగే అన్నారు."

జానకి మాట్టాడలేక పోయింది.

"ఊరివాళ్ళందరూ చాలా విడ్డూరంగా చెప్పకున్నారు, కొన్నాళ్ళదాకా."

"ఏమనీ?"

"ఆ పిల్ల ఆ పిల్లాడితో కాపరం –"

"అక్కర్లే దక్కర్లేదు, పెళ్ళయిన తరవాత యేంజరిగిందో అది చెప్పండి"

"తరవాత కూడా ఆ పిల్లచూపు నామీదే వుంది."

జానకి ప్రశ్నార్థకంగా చూసింది.

"ఎలా తెలిసిం దనా?"

"అవును."

"నువ్వు మనుగుడుపులకు వచ్చినప్పుడు, తెల్లవారుజామున ప్రయాణం అనగా, రాత్రి, నీ మెడలో మల్లెమొగ్గల దండ వేశాను, జ్ఞాపకం వుందా?"

"లేకేం? అప్పుడు మీ చిటికెనవేలు నా బుగ్గకి తగిలి వొళ్ళంతా గరి పొడిచింది."

"ఇంకేం? ఆ దండ ఆ పిల్ల పంపిందే"

తన చెవులనే నమ్మలేకపోయింది జానకి.

"ఆవేళ ఆ పిల్లాడు ఇక్కడే వున్నాట్ట కూడా!"

"అయ్యో!"

"దండ పంపడమే కాదు, నీకు వెయ్యమని కబురుకూడా పంపింది."

"అదేం చిత్రమండీ?"

"చిత్రం కాకేం?"

"అయితే, యీ సంగతి మీకెలా తెలిసిందీ?"

"మా సుబ్బత్తగారి రత్తమ్మ తెచ్చింది దండా, కబూరూను."

"అలాగా?"

"మరోమాటు – అంటే నువ్వు మా చెల్లాయికూతురి అన్నప్రాశనకు వచ్చినప్పుడు అరవిచ్చిన గులాబీ పువ్వులు బుట్టెడు పంపింది."

"ఏవీ, నా కిచ్చారు కారేం?"

"చేతితో తాకకుండానే వెనక్కి పంపేశాను."

"ఏం?"

చురచుర చూస్తూ ఆమె ఖంగుమని వేసిందీ ప్రశ్న.

"పువ్వులంటే నీకు సంబరం అని అప్పటికే నాకు తెలుసు కాని; ఆ పిల్ల అలా చేసినట్టు తెలిస్తే వాళ్ళవాళ్ళు కోప్పడరూ? సంబంధంతో పాటు మాటలు కూడా తప్పిపోయాయి మాకు."

"అయితే?"

"అంచేత తిప్పేశాను."

"తిప్పెయ్యడానికి మీకేం అధికారం వుందండీ?" అని నిలవతీసిందామె.

"అంటే?" అన్నా డతను తెల్లపోయి.

"ఆవిడ నాకోసం పంపిం దా పువ్వులు."

"ఓ–హో, అవునుసుమా, నాది తప్పే!"

"ఇక ఆ మాట మరిచిపొండి. తరవాత మీరెప్పుడయినా ఆ పిల్లతో మాట్టాడారా?"

"లేదు."

"ఆ పిల్లో?"

"చాలామాట్లు ప్రయత్నించింది; కాని నేను తప్పించుకుంటూ వచ్చాను; ఒకమాటు సాహసించి వేళాకోళం చేసింది. నేను బదులు చెప్పలేదు."

"ఎంత చిన్నపుచ్చుకుందో పాపం!"

"అందుకు నేనేం చెయ్యగలనూ? ఆ పిల్లకీ నాకూ సంబంధం యేమిటీ?"

"ఎంత తీసేసుకున్నా ఆవిడ మీ పెళ్ళామే!"

"నిజాని కంతే. దానికి జరిగింది రెండో పెళ్ళే!"

"ఇంకేమండీ?"

"మరి లోకం మాట? పోనీ అంటే, అప్పటి కింకా ఆ పిల్లాడు బతికే వున్నాడు."

"అప్పటి కంటే?"

"గులాబీలు పంపాటప్పటికి. తరవాత మూడు మాసాల కతను చచ్చిపోయాడు. మరో మూడుమాసాలకాపిల్ల రజస్వల అయింది."

"రామరామా!"

"ఊరంతా యేడ్చారు కాని; ఆపిల్ల కంట తడయినా పెట్టలేదుట. 'శని విరగడయిపోయిం'దని కూడా అందిట!"

"అనదూ? అయితే, అప్పుడేనా వాళ్ళ వాళ్ళకి బుద్ధి వచ్చిందా? ఆ తల్లి కెవరయినా గడ్డి పెట్టారా?"

బదులు చెప్పలేక అతను మొగం పక్కకి తిప్పుకున్నాడు.

"పోనీ, ఆ పిల్లపే రెవరండీ?"

"రంగనాయిక."

"మీకు బాగుందా ఆ పేరు?"

"నిక్షేపంలా వుంది."

"నా పేరుకంటే బాగుంది కదూ?"

"నీ పేరు మాత్రం?"

"మావూళ్లో—"

"మీ దేవూరూ?"

"అవునవును, తప్పే, మావాళ్ళ వూళ్ళో మా యింటి పక్కని – కాదు కాదు, మావాళ్ళ యింటిపక్కని వొక శూద్రపిల్ల వుంది."

"ఉంటే?"

"దానిపేరు రంగమ్మ."

"అయితే?"

"రంగనాయికమ్మ అని మార్చుకోమని లక్షమాట్లయినా చెప్పాను దానికి"

"పేరు మంచిదే! రూపమూ సాటి లేనిదే. వైధవ్యం వచ్చినా ఆ చక్కదనం తరిగిపోలేదు."

"ఏమి లాభమూ? బూడిదలో పోసిన పన్నీరు. సరే కాని, తరవాత మీకెప్పుడయినా కనపడిందా?"

"లక్షమాట్లు కనపడింది."

"మీరు కనపడ్డప్పుడు దాని మొగం—"

"నేను చూశానా?"

"వే—శారు దాటు."

"ఏం?"

"పోనీ, ఆవిడ కనపడ్డప్పుడు మీకెలా వుండేదో చెప్పండి నిజంగాను."
"ఎప్పుడయినా, అయ్యోపాపం—"
"ఎప్పుడయినానా? అయ్యో అని యింతే?"
"వొట్టు."
"వొట్టువద్దండీ, పాపం ఆవిడ ఎంత దుఃఖిస్తున్నారో?"
"మొగుడు పోతే దుఃఖం కాదూ?"
"తప్పతప్పు, వోగాయిత్యం మాట లనకండి"
ఇది విని చకితుడయి "ఇవాళ నీధోరణి యిలా వుందేం జానీ?" అనడిగాడతను.
"ఆడవాళ్ళ బతు కింతటిదే కాదూ?"
"చెప్పవూ?"
జానకి మాట్లాడలేదు.
"చెప్పవూ?" అని మళ్లీ అడిగాడతను.
సరిగా యీ సమయాన, వీధితలుపు గుంజుతూ పిలుపుమీద పిలుపు పదిమాట్లు పిలిచావారెవరో.
"వస్తున్నా, వస్తున్నా, ఆ, అదే గుంజడమా? వినిపించుకోవద్దూ?" అని గదుముతూ పార్వతీశం వాకట్లోకి చక్కాపోయాడు.
వచ్చిన మనిషి భర్తవైపు చుట్టం అని తెలియగా, పాద్యం యిచ్చి, కుశలప్రశ్నాదికం కూడా కానిచ్చేసి, తవ్వెడు గిన్నె దింపేసి మూడుసోలల గిన్నె యెసరు పడేసింది జానకి.

## 9

తరవాత, భోజనాల వేళదాకా ఆదంపతులకు మాట లందలేదు. అప్పుడయినా చుట్టం వుండడంవల్ల యీ ధోరణీ రాలేదు.
రాత్రి కూడా పన్నెండయ్యేదాకా చుట్టం పార్వతీశాన్ని నిద్రపోనివ్వలేదు.
తెల్లవారింది.
కాలకృత్యాలూ, ఇంటిపనులూ, వీటితో జానకీ పార్వతీశమూ సంసార సాగరంలో పడిపోయారు.
ఆ సాగరంలో ఆ చుట్టం వొక పెద్దకెరటం అయి వారినిద్దర్నీ దూరం దూరంగా నెట్టేస్తూ వచ్చాడు.
జానకి ఆవేళ మామూలువేళకే చెరువుకి వెళ్ళింది కాని; అరగంట కనిపెట్టుక్కూచున్నా రంగనాయిక రాలేదు.
మర్నాడు కూడా ఆమె రాలేదు.
దీనికి సాయం, ఇంటో, కామవరపుజీడిలాగా చుట్టం.
ఈ రెండుదినాలూ, జానకమ్మ, యేదో పోగొట్టుకున్నట్టూ, ఏదో మరచిపోయినట్టూ మందుతిన్నట్టూ అయిపోయింది.
ఈ స్థితి చూసి పార్వతీశం "యేం చెప్మా?" అనుకోకపోలేదుకాని; యేమని అడగలేకపోయాడు.

ఆ దంపతుల అనురాగమూ, ప్రకృతమూ; జానకి అనుభవిస్తున్న అందోళనా, దాంతో పార్వతీశం పొందుతున్న క్షోభా యెంత మాత్రమూ గుర్తించుకోలేని చుట్టం, విసిగించి, వేపేసి "యింక వెళ్ళడా యేమిటి బాబూ?" అనిపించుకుని, మూడోనాడు చల్లబడ్డాక వెళ్ళిపోయాడు.

మొగమాటపెట్టి పార్వతీశాన్ని మాచవరం రేవుదాకా కూడా తీసుకువెళ్ళాడు.

"ఉంటానండీ" అని చుట్టందగ్గిర సెలవు పుచ్చుకుని వీధి గుమ్మంలోనే ఆగిపోయి, యాదాలాభంగా వొక్కనిమిషం అక్కడే వుండిపోయింది జానకి.

అందుకు తగ్గట్టు దూరాన రంగనాయిక కనపడింది

ఎక్కణ్ణుంచో తమ యింటికేసే వస్తున్న రంగనాయికను చూశాటప్పటికి జానకి ప్రాణాలు లేచివచ్చాయి.

ఇంతలో రంగనాయిక అక్కడికివచ్చి, జానకి గుమ్మంలోనే వున్నందుకు మొగం యింతచేసుకునీ కూడా, యెవరయినా వస్తున్నారేమో – అథవా చూస్తున్నారేమో అని వెనక్కీ ముందుకీ బెదిరిబెదిరి చూస్తూ "రేపు స్నానం" అని అలుగో జాస్వరంతోచెప్పి క్షణం అయినా నుంచోకుండా వెళ్ళిపోయింది.

అయినా, జానకి ఆమె కనపడ్డందుకే ఆనందించింది.

చెరువుకి ఎందుకు రావడం లేదో ఆ కారణం తెలవడంవల్ల ఆమెకి అందోళనకూడా తగ్గిపోయింది; కాని అమాట చెప్పడాని కంత సంకోచించడమూ, జడుస్తూ వెనక్కీ ముందుకీ చూడడమూ ఆమె కేమీ బోధపడలేదు.

ఆమె పుట్టింటివారికీ తన భర్తకీ ముఖావలోకనాలయినా లేవు కనక తనతో బాహాటంగా మాట్లాడలేక పోతోందనుకుందామంటే, అయితే, అసలలాగయినా మాట్లాడ్డమూ "చెల్లీ" అనడమూ "వొసే అక్కయ్యా" అనిపించుకోవడమూ యేమిటి?

పాత ఆందోళన పోయి కొత్త జిజ్ఞాస పట్టుకుంది. అయినా, రంగనాయిక మాత్రం విడవరానిదిగా కనపడింది.

దానిమీద "అక్కయ్య అన్నట్టు వెనకటిజన్మలో యిద్దరం వొక్క కడుపున పుట్టామేమో" అనుకుందామె.

"ఒకవూళ్ళోనే వుండినా, అత్తిళ్ళవారికి గర్భశత్రుత్వం వున్నచోట ఇద్దరక్కాచెల్లెళ్ళు యిలాగే అవస్థ పడుతూ వుంటారు కామోసు"నని ఆశ్చర్య పడిందామె.

దీంతో, ఇక్కడ జానకమ్మకి, దినమ్మా అక్కడ రంగనాయికమ్మకిలాగే ఆ రాత్రి చాలాభారం అయిపోయింది.

కళ్ళు పొడుచుకున్నా నిద్రరాదు.

ఏమీ పాలుపోదు.

పోనీ అంటే, యెంతసేపటికీ తెల్లవారదు.

ఈ స్థితిలో మూడోజామున జానకమ్మకి ఒక క్షణం కలత నిద్రపట్టి, అందులో వొక కల వచ్చింది.

ఉన్నస్థలం యేదో గుర్తుకి రాలేదు; గాని రంగనాయిక మధుపర్కాలు కట్టుకుని వుంది.

ఎవరెవరో, పేరంటాళ్ళు తగువులు పట్టుకు వస్తున్నారు.

తాను, అవన్నీ అందుకుంటూ, వారికందరికీ పసుపూ పారాణీ రాసి, గంధం పూసి, తాంబూలా లిచ్చి "మంచిదండీ" "మంచిదండీ" అని సెలవిచ్చి పంపేస్తోంది.

ఇంకొక్క నిమిషం అలాగే వుంటే కల పూర్తి అయి పర్యవసానం తేలిపోయి వుండును; గాని వొత్తిగిల్లడంలో పార్వతీశం చెయ్యి మీదపడి మెళుకువ వచ్చేసింది.

కళ్ళు నులుముకుంటూ లేచి చూడగా పార్వతీశం గాఢ నిద్రలో వున్నాడు.

అతని సుస్నిగ్ధగండఫలకం మీద సన్నని దీపకాంతి జిగ జిగలాడుతోంది.

అది చూసి, చలించి, ఉద్రిక్త అయి, వివశ అయి, ఊర్ధ్వశ్వాసతో మీద వాలి అతన్ని గట్టిగా పొదువుకుని, చుంబనముద్ర వహించిన పెదవులతో ఆ చెక్కిలి గట్టిగా నొక్కి, తానే నిలువునా కరిగిపోయిందామె.

## 10

ఆ సందులోనుంచి వొకరూ, యీ సందులోనుంచి వొకరూ జానకీ రంగనాయికా వొక్కమాటే చెరువుకి వచ్చారు.

"నీకు వెయ్యే"ళ్ళంటే "నీకు లక్షసంవత్సరా" లంటూ అతివేగంగా యిద్దరూ దగ్గిరికి చేరుకున్నారు; కాని పొంగిపోతూ పావంచాల దగ్గిరికి వెళ్ళాటప్పటికీ, అరమూతలు పడ్డ కళ్ళతో చెరువులో నుంచుని వొక ముసలి వితంతువు తులసి పూసల పేరు గిరగిరా తిప్పేస్తోంది.

అది చూసి తెల్లపోయి మొదట యిద్దరూ నాలుకలు కరుచుకున్నారు.

తరవాత, బోసిపులిని చూసిన లేడిపిల్లల్లాగ చెరోవైపూ తప్పుకుని, యెక్కడా యెలాంటి సంబంధమూ లేనివాళ్ళలాగ పావంచాలకి ఆ చివర వొకరూ యీ చివర వొకరూ కూలబడి, కీగంటిచూపులతో కబుర్లు చెప్పుకుంటూ, నొక్కి తోముతున్నట్టు నటిస్తూ తెల్లగానే వుండిన బిందెలు వొట్టిచేతులతో బులబులాగ్గా పామడం మొదలు పెట్టారు

అయితే, వొక్కక్షణం అయేటప్పటికి, ఆ నటనలో, బిందెలు పావంచాలకి రాసుకుని చప్పుడయింది.

అది ముసలావిడ చెవిని పడింది.

పూసల పేరు తిరిగిపోతూనే వుంది – "యెవరది? రంగా?" అందావిడ.

"ఆ."

"తంగిరాలవారి రంగమ్మవేనా నువ్వు?"

"అవు నత్తా!"

"కాశీనుంచి వుత్తరం వచ్చిందా?"

"నాకు తెలవదు."

"కాలూ చెయ్యీ వొంగీదాకా కూతుర్ని కదపలేక పోయింది మీ చిన్న మేనత్త. అయితే, మీ పెద్ద మేనత్త కాశీ చేరుకున్నట్టేనా?"

"నా కదేమీ తెలవదమ్మా!"

"ఏదీ తెలుసుకోక యేంచేస్తున్నావే నువ్వు?"

రంగనాయిక మొగం పక్కకి తిప్పుకుని పళ్ళు పట పట్టాడించింది.

అడిగింది సరిగా చెప్పనందుకూ, చివరికి బదులుకూడా చెప్పనందుకూ ముసలావిడ వొక్కక్షణం రుసరుసలాడింది కాని; చివరికి "పోనీ, ఆ పిల్ల యెవరూ?" అనడిగింది.

"ఎవరో కొత్తపిల్ల, పీసపాటివారి కోడలేమో!"

"పార్వతీశం పెళ్ళామా?"

"కామోసునమ్మా, తెలవ దనలేదూ?"

"కడుపా?"

"ఛీ" అన్నట్టు పళ్ళు బిగించుకుని పక్కవాటుగా నిప్పులు కక్కింది జానకి.

"సడే" అంది రంగనాయిక విసుగ్గా; కాని "కాస్తో కూస్తో యింగ్లీషు కూడా వెలిగించిందిట మరి అన్నం వండగలదు షే ఆ పిల్లా? చెరువునుంచి నీళ్ళు కూడా మోస్తోందీ?" అని మళ్ళీ అడిగింది ముసలావిడ.

అందుకు "బాగా గడ్డిపెట్టు" అన్నట్టు చురచ్చురచూస్తూ జానకి తల ఆడించగా "ఇంగ్లీషు రుచిచూసిన ఆడపిల్లలు, ములసమ్మలు వండిపెడితేగాని అన్నంకూడా ముట్టరుటమ్మా!" అంది రంగనాయిక, యెత్తిపొడుపుగా.

ముసలావిడకి యీ మాట శూలంలా గుచ్చుకుంది. దాంతో అగ్గయిపోయి, పూసలపేరు తిప్పడం కూడా మరిచిపోయి "హేళన చేస్తావుషే పిల్లా? పెద్దా పిన్నా తారతమ్యం చూడవద్దూ? మీ నాన్నతో చెబుతాసుమా!" అంది బోసినోరు తాటించుకుంటూ.

"ఈ దారినే వెడతావా అత్తా మా యింటికి?"

"ఆ, ఆ, యేమన్నావూ? నన్ను చచ్చు పెద్దమ్మకింద కట్టేశావు షే?"

ఇది విని రంగనాయికని కళ్ళతో మెచ్చుకుంది జానకి.

"నేనంటే మీ నాన్నకూడా గడగడలాడతాడుగదా –"

"నీకు కోపంవస్తే వచ్చింది కానీ – దానికి నా పూచీ యేమీ లేదు గానీ – బుచ్చెమ్మత్తా, పెద్దదానవుకదా, జపంకూడా వెలగబెడుతున్నావు గదా, అడిగేవాళ్ళు లేక కాని నీకిప్పు డీపరీక్షలన్నీ ఎందుకూ?" అంటూ నిలవతీసింది, రంగనాయిక.

"శాబాసు, అడిగితే తప్పు షే?"

"బాగుంది, తెలవంది చెప్పకపోతే తప్పుటమ్మా?"

"ఎదుటే వుందికదా, కాస్త అడిగితెలుసుకుంటే యేమే?"

"ఆ పిల్లని నువ్వే అడిగితే యేమమ్మా?"

"ఏం విరగబాటుతనమే మాతల్లీ? మూలపడ్డా పులుసు విరగలేదు కామోసు!"

"మూలపడ్డం యేమిటమ్మోయ్, ముందుకివస్తుంటే?"

"ఆ, ఆ, ముందుకి వస్తున్నావూ? అంచేతే కాలం యిలా మండిపోతుంది."

"అవును, వేసవి ముదిరింది కదా, మండిపోక మరేం చేస్తుందత్తా?"

"నీవంటివాళ్ళు బయలుదేరాక యే కాలమూ మండి పోతోంది .........హరే రామ హరే రామ ........... అన్నీ కిరస్తానీ వేషాలూ సానిటక్కులూనూ ........ రామ రామ హరే హరే ..........మావంటివాళ్ళం యిక బతగ్గాడదు ..........హరే కృష్ణ

హరే కృష్ణ .........బ్రాహ్మణ్యం యెలాగా యిక బుగ్గయిపోతుంది... .......... రాఘవా! రామచంద్రమూర్తీ! జానకీ మనోహరా! రంగనాయకులు తండ్రీ –"

"నీ మొగుణ్ణి పిలుస్తోందే చెల్లెమ్మోయ్!" అన్నట్టొకరూ "నిన్నూ కలిపిందే అక్కయ్యోయ్!" అన్నట్టొకరూ చూసుకుని వారిద్దరూ ముసిముసినవ్వులు నవ్వుకున్నారు.

"త్రిపురాసురులను సంహరించిన తండ్రీ! శూర్పణఖ ముక్కూ చెవులూ తెగ్గోయించిన ధర్మరాజా! యీ వేషాలు నీకు కనపడ్డం లేదుషయ్యా బాబూ?"

తోకతొక్కిన ఆడతాచులాగ లేచినుంచుని "ఇద్దరూ వొక్కటేకదూ అత్తా?" అని కరుగ్గా అడిగింది రంగనాయిక.

ఈ వెక్కిరింపు ముసలావిడ కళ్ళల్లో కారం కొట్టింది.

దాంతో, ఆవిడ కోపం అంతా కాళ్ళల్లోకి దిగజారింది.

ఆవిడ పదిగజాలు వెళ్ళేదాకా అతికష్టంమీద అపుకుని తరవాత, యెలా వున్న బిందెలలా విడిచేసి, జానకీ రంగనాయికా విరగబడి నవ్వుకున్నారు.

## 11

"ఇక వెనక్కిరాదు" అంటూ జానకి బయలుదేరింది.

పై పావంచామీదికి వెళ్ళి చూసి "యెవరూ రావడం లేదు. మనం యిద్దరమే వున్నాం" అంటూ రంగనాయిక కూడా బయలుదేరింది

చెయ్యీచెయ్యీ పట్టుకుని, చెరువులో గుండెలలోతుకి వెళ్ళి యధాపూర్వంగా మళ్ళీ గట్టిగా కౌగలించుకుని, కంఠాల దాకా మునిగిలేచి కబుర్లు కందుకున్నారు వారు.

"వారిదగ్గిర నా మాట యేమయినా తెచ్చావా యేమిటి చెల్లీ?" అనడిగింది రంగనాయిక మెల్లిగా.

"లేదక్కా! యేమిటో వూరుకున్నానే" అంది జానకి.

"వద్దు వద్దు. బాగుండదు. మంచిపనే చేశావు నువ్వు......... కావైతే దీల్లో తప్పేమీలేదు కానీ – అయినా యేమే చెల్లీ?"

"నువ్వేమంటావో–?"

"అదే బాగుంది.....పోనీ ఏమే చెల్లీ?"

"ఏమిటే అక్కా?"

"...........ఓమాటు కదిపిచూస్తే యెలా వుంటుందో?"

"ఏమనమంటావు?"

"ఏమనమంటానా?.. .... ఏమనమంటానా? సిగ్గూ ముచ్చటాకూడా – పోనీ మానేస్తే?"

"నీయిష్టం."

"...........ఊరుకో, ఏమంటే? ఎటొచ్చి యెటుపోతుందో? కనక వూరుకోవే చెల్లాయీ!"

జానకి వూరుకుంది రంగనాయికే వూరుకోలేకపోయింది.

"మనస్సు మనస్సులో లేదు. వెనక్కీ ముందుకీ –"
"నువ్వు కనపడక నేనుపడ్డ బాధ –"
"నా పనీ అలాగే వుంది. ఈమూడు దినాలూ నాకు నిద్రాహారాలు లేవు. నిన్నరాత్రి వొక కలకూడా –"
"ఏమనీ?" అని అవ్యధానంగా అడిగింది జానకి, తనకి వచ్చిన కల జ్ఞాపకం చేసుకుంటూ.
"నువ్వూ నేనూ వారూ యెందుకో రాజమండ్రీ – యెవరో వస్తున్నారే!"
ముంగాళ్ళమీద నుంచుని, నలుగురు కమ్మపడుచులు వస్తూవుండడం చూసి, కొంచెం యెడంగా జరిగి, వొకరితో వొకరికి సంబంధం లేనట్టు చెరోవైపుకీ తిరిగి ఇద్దరూ వొళ్ళు తోముకోడం మొదలుపెట్టారు.

## 12

కమ్మపడుచులలో వొకామె జానకినీ, వొకామె రంగనాయికనీ పలకరించారు.
తాపీగా బిందెలు ముంచుకుని, తమలో వొకామె చెల్లెలి పెళ్ళిమాటలు చెప్పుకుంటూ వెళ్ళిపోయారు.
అక్కాచెల్లెళ్ళిద్దరూ మళ్ళీ ముంగాళ్ళమీద నుంచునిచూసి, మళ్ళీ దగ్గిరసాచేరుకున్నారు.
"మా యింటి కోమాటు రావుటే అక్కయ్యా?" అంటూ జానకి రంగనాయిక చెయ్యిపట్టుకుంది.
"అమ్మయ్యో!" అని రంగనాయిక వొణికిపోయింది.
"ఏమే?"
"వారు చూస్తే?"
"చూస్తే? చూస్తే యేమిటమ్మా? ఏంభయమమ్మా?"
"ఇంకేమయినా తరవాయి వుంటుందా?"
"ఏమంటా రేమిటమ్మా?"
"ఏమో అంటే యింకేం? మాటే ఆడరు. అంతకంటే మరేమిచెయ్యాలి?"
"మాటాడరూ?" అని చురుగ్గా అడిగింది జానకి.
"ఆడరు."
"మాటాడరూ?" అని మళ్ళీ రెట్టించింది జానకి, తన ప్రతాపం తలుచుకుంటూ.
"మాట్లాడ రనుకో. ఆడకపోతే యేమిటో చెప్పు?
"నేను మాటాడిస్తా కాదూ?"
"నువ్వు చెప్పినట్టు వింటారా?"
"వినకపోతే యెరగరూ?"
"తల అడ్డంగా వూపుతూ జానకి యిలా సాగతీసుకోగా "నిజంగా?" అనడిగింది రంగనాయిక.
"చూడరాదూ?"అనడిగింది జానకి గర్వం కనపరుస్తూ.
"నువ్వు నన్నాకాశాని కెత్తేస్తున్నావే చెల్లీ!"
ఇలా అంటూ రంగనాయిక జానకి బుగ్గలు నొక్కింది.

"వారికి తెలవకుండా నువ్వు దొడ్డిగుమ్మాన లోపలికిరా. ఇద్దరమూ పడమటింటో కూచుందాం. వాకట్లో యెవరితోనో మాట్లాడుతూ మాట్లాడుతూ కాఫీకోసం వారు లోపలికి వస్తారు. పీటవేసి కూచోబెట్టి నేను దగ్గిరేవుంటాను. కప్పూ సాసరూ నువ్వు చేతికందించు."

"బాబోయ్!" అంటూ చెయ్యి లాక్కుని రంగనాయిక రెండుచేతులూ నలుపుకుంది.

"అదేమిటే మాతల్లీ?"

"అది వింటేనే కాళ్ళు వొణికిపోతున్నాయే మామ్మా?"

"సింగినాదం కాదూ?"

జానకి యిలా అనగా, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ రంగనాయిక మొగం పక్కకి తిప్పుకుంది.

ఒక్కక్షణం అలాగే వుండి, మళ్ళీ జానకి కేసిచూస్తూ "వారవి పుచ్చుకోకపోతే నేను నిలువునా చచ్చిపోవాలిగాని మరోదారి వుందా?" అనడిగిందామె.

"చూశావా? నేనుంటా నన్నాను కాదుటే?"

"తీరా—"

"కాఫీ యిచ్చినందుకు నీకు కృతజ్ఞత కూడా విన్నవించుకునేటట్టు చేస్తాను, చూసుకో!"

రంగనాయిక మొగాన ఆనందం గుప్పుమంది.

"ఏమంటావే? రావే మామ్మా? పోనీ, దినమ్మూ రావద్దులే, వొక్కమాటురా, ఏం?"

"నీ ధైర్యమూ నీ బలవంతమూ చూస్తే రావాలనీవుంది! నిన్నూ వారినీ డబుల్ కుర్చీలో కూచోబెట్టి, మేజామీద ఫలహారాలూ కాఫీ వుంచి, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ మీ రవి ఆరగిస్తూవుంటే చేతులు కట్టుకుని యెదట నుంచోవాలని యెంతయినా వుంది నాకు."

జానకి మనస్సు వూగిపోయింది. పెదవులు దరహాస విరళితాలయినాయి. కళ్ళు లజ్జాముద్రితా లయినాయి.

హృదయం ఆనందముగ్ధం అయిపోయింది.

దాంతో పరవశ అయి, వొక్కక్షణం మాట్లాడలేక, చివరికి "నిజంగా అక్క అంటే నిన్నే చెప్పాలి" అంటూ ఆమె చేతులు పట్టుకుంది జానకి.

జానకి చేతులు రంగనాయిక పట్టుకుంది.

ఇద్దరూ వివశలయి ప్రీతినెరుపుకున్నారు.

"అందుకోసమయినా రావే. సిగ్గుపడకు. ఏం? వస్తాననవే!" అంటూ ఆమె జబ్బులు పట్టుకుని వూపేసింది జానకి.

దానిమీద వొక్క క్షణం ఆలోచించి "అయితే వోపని చేస్తావా?" అనడిగింది రంగనాయిక.

"ఏమిటదీ?" అని జానకి అడగ్గా, వొకమాటు పైకి చూసి, వొకమాటు జానకి కళ్ళల్లోకిన్నీ గంభీరంగా చూసి, మళ్ళీ, అందుకుంది ఆమె:

ఇవాళ సుబ్బమ్మపిన్ని కూతురుచేత మల్లెమొగ్గలదండలు రెండు పంపిస్తాను."
"పంపిస్తే?"
"ఒకటి వారికి—"
"వేసి?"
"నేను పంపానని చెప్పి మరీ—"
"అలాగే వేస్తాను, వేస్తే?"
"దానిమీద యేమి జరుగుతుందో చూడు. నిజంగా జరిగింది జరిగినట్టు నాతో చెప్పాలిసుమా రేపు."
"ఇన్ని తికమక లెందుకే?"
"ఇవి తికమకలు కావు. ఇలా చేస్తే వారికి నామీద దయ వుందో లేదో—"
"ఉందనుకో. ఉందని తేలిపోతుందనుకో, ఉంటే?"
"మావాళ్ళేమో చేస్తారని నాకు భయంలేదు. నాకు వాళ్ళ లెక్ఖ లేదు."
"దయవున్నట్టు తెలిస్తే? తరవాత యేమిటో చెప్పవే?"
"మీ యింటికి వచ్చేస్తాను."
"నిజంగా?" అనడుగుతూ జానకి చెయ్యిచాపింది.
"నా తల్లే, నాబంగారుకొండే! నిజంగా వచ్చేస్తానమ్మా! వచ్చి వారిని సేవించుకుంటాను. నీ కాళ్ళు కడిగి దాహం పుచ్చుకుంటాను" అంటూ ఆచేతిలో చెయ్యివేసి, వొక్క మాటు అరిచెయ్యి గట్టిగా గిల్లి, పట్టుకుంది రంగనాయిక.
చూడగా, ఆమె కళ్ళలో ఆనందబాష్పాలు సుడితిరిగిపోతున్నాయి.
అది చూసి, తనకిన్నీ అదే స్థితి సంభవించగా గద్గదకంఠం అయి అతికష్టాన "మరిచిపోకు సుమా!" అంది జానకి.
"నిన్ను చంపుకుతిన్నట్టే, సరా? తప్పకుండా వస్తాను తల్లీ! ముమ్మాటికీ వస్తాను. ఈ మూడు దినాలూ నిన్ను చూడకుండానే వుండలేకపోయాను, అది తెలిస్తే విడిచి క్షణం వుండగలనా?"
"తప్పకుండా పంపుతావు కాదూ మల్లెదండలు?"
"వీల్లేకపోతే భోజనం కూడా మానేస్తానుగాని దండలు పంపకుండా వుంటానా?"
"ఎన్ని గంటలకి?"
"ఆరు—తప్పితే యేడింటికి."
"మరో అరగంట చూస్తాను. అప్పటికీ దండలు రాకపోతే నాకు మతి పోతుంది సుమా!"
"మామ్మే, మాతల్లే! నేనెంత పుణ్యంచేసుకున్నానే? నేనెంత పెట్టిపుట్టానే?" అంటూ రంగనాయిక, జానకి కణతలమీద మెటికలు విరిచింది.
"ఉన్న మొగ్గలన్నీ మాకే పంపేస్తే మరి మీవాళ్ళేమీ అనరూ?" అనడిగింది జానకి.
"ఎందు కంటారూ? రెక్కలు పడిపోయేలాగ మల్లెపాదులకి నీళ్ళు పొయ్యడం నేనే కాదా యేమిటమ్మా? కాకపోయినా మా యింటోది యివాళ వొక్క మొగ్గఅయినా

ముట్టుకోను. సుబ్బమ్మపిన్నిగారింటో దినానికి గంపెడు మొగ్గలవుతాయి. అవన్నీ వాళ్ళకీ వాళ్ళకీ యిచ్చెయ్యడమే కాదూ రత్తమ్మక్కయ్యా?"

"నిన్న మాకూ తెచ్చిపెట్టా రక్కయ్యగారు."

"ఇవాళ అయినా తేవడం అదే. దండలుమాత్రం—"

"తప్పకుండా పంపు."

"తప్పకుండా పంపుతాను. రెండు దండలూ నేనే గుచ్చుతాను. అరిటిమొప్పతో పొట్లంకూడా నేనే కడతాను."

"సరే."

"గంధం కూడా పంపనా?" అనడిగింది రంగనాయిక, వూపిరి బిగపట్టుకుని బెల్లించి చూస్తూ.

"నిన్ను మరీ మెచ్చుకుంటా"రంది జానకి.

"మెప్పా?"

"కాకేమమ్మా?"

"చివాట్లు—"

"చాల్లేవే, నేర్చుకుపోయావ్."

"చూస్తావు కాదూ?"

"వింటావు కాదూ?"

"సంయే."

"సంయే."

ఇద్దరూ మళ్ళీ ముంగాళ్ళ మీద నుంచుని చూశారు.

దూరాన ముగ్గురు వైశ్యస్త్రీలు కనపడ్డారు.

"కబుర్లందుకుంటే మనలాగే విడిచిపెట్టరు, పోదామే!"

"పదవే!"

"నువ్వు వెడతావా, ముందు నేను వెళ్ళనా?"

"నన్నే వెళ్ళనియ్యి."

"వెళ్ళు" అని చెప్పి, పావంచాలమీది బిందె పట్టుకువెళ్ళి, నీళ్ళు ముంచి, జానకి బుజాని కెత్తి "మళ్ళీ రేపు. అంతేనా చెల్లీ? " అనడుగుతూ పావంచాలదాకా వచ్చి తన బిందె అందుకుంది రంగనాయిక.

గారాం కుడుస్తూ వొడ్డెక్కి, మందహాసం చేస్తూ "సెలవ్" అంది జానకి.

దానిమీద, రంగనాయిక "మంచిదమ్మా, మంచిదమ్మా!" అంటూ ఆనందవిహ్వల అయి, రెప్ప వెయ్యకుండా జానకి వయ్యారినడకలు చూస్తూ వొక్కక్షణం అక్కడే — అలాగే నిలిచిపోయింది.

తరవాత, చిన్నప్పుడు — అంటే సంబంధం స్థిరపడ్డాక, పార్వతీశం వీధిలో వెడుతూ వుంటే తలుపు చాటున నక్కి తాను చూపించిన విలాసచేష్టలు మననం చేసుకుంటూ వైశ్య స్త్రీలు రేవులోకి రాకముందే వొడ్డెక్కి, వారు పలకరించి అపు చేస్తారేమో అని వొక పక్కకి తప్పకుని తెరసిమరుపుల్లో యింటికి వెళ్ళిపోయిందామె.

## |13|

"చెవు డెప్పణ్ణుంచే మాతల్లీ?"

"నాలుగు దినాలనుంచండీ మామ్మా!"

"ఇక కళ్ళుకూడా—"

"నా కళ్ళు పోవాలని వుందా?"

"నీ కళ్ళు పోతే నాకేం వస్తుందీ? నాకళ్ళే పోవాలి."

"మీ కళ్ళు పోతేమాత్రం యేమివస్తుందీ?"

"వస్తే వస్తుంది. లేకపోతేలేదు; కాని యిలాగ చూడూ!"

"దినమ్మా యెందుకమ్మా! ఇవాళ విడిమొగ్గలుకాదు – దండలు కూడా గుచ్చి – శాబాసు!"

"ఇది కూడా చూడూ!"

"అదేమి టండోయ్?"

"వోస్! ఏమీ యెరగవు పాపం!"

"నిజం అక్కయ్యగారూ!"

"అబద్ధం చెల్లయ్యగారూ!"

"ఒక్కమాటు గంభీరంగా చూసి, వొక్కమాటు చిరునవ్వున్నా నవ్వుకుని "మీ దయ అలావుందన్నమాట. పోనీ, యిలాతెండి" అంటూ మల్లెదండల పొట్లమూ గంధపుగిన్నీ మెల్లిగా అందుకుని, జానకి, అవి మార్బిలు బల్లమీద వుంచింది.

"గంధంపరిమళానికి వీధిపొడుగునా అందరూ విరగబడి చూడ్డమే. సిగ్గేసింది నాకు."

"పా—పం!"

"తెచ్చినందుకా?"

"చూ—శారా? ఇవాళ యిలా మొదలుపెట్టా రేమిటి అక్కయ్యగారూ?"

"నీ బెల్లింపుల కేం గానీ – మరి చూస్తూ నుంచుంటే కాదు, తలకూడా నేనే దువ్వాలిట!"

"అయితే గుర్రం దిగండి."

ఇలా అంటూ జానకి వెనక్కి తగ్గగా "అదేమిటి చెల్లీ?" అంటూ రత్తమ్మ తెల్లబోయింది.

"ఖరాగా వొక్క గంట కూచోవలసిందే మీరు" అంటూ మళ్ళీ యింకో అడుగు వెనక్కివేసింది జానకి.

"ఎంచేతా?"

"ఇంటో లేరండీ!"

జానకి యిలా అనేటప్పటికి, రత్తమ్మ చకిత అయి, వొక్కక్షణం స్తబ్ధత కూడా అయి వుండిపోయి, చివరికి "వోసి నీయిల్లు బంగారం అయిపోనూ, నీకే తల దువ్వడం" అంది నెమలిలాగ.

"మరి ఆ మాట ముందు చెప్పారా మీరు?" అని ముదలకించింది జానకి.

"వొకరిమాట మాత్రం చెప్పానా యేమిటి నేను?"

"చెప్పకపోతే? ఈ దండా యీ గంధమూ యెవరికో-"

"అవి మీకిద్దరికీ గాని అతని కొక్కడికీనా?"

"అయితే, తలకూడా మాకిద్దరికీ దువ్వాలన్నమాట, తెలుసా మరి?"

"నువ్వేమన్నా నాకు తెలుస్తుంది. వెర్రితల్లివి. మాయా మర్మమూ యెరగవు పాపం. తొరగా కూచో అమ్మా, పిండికూడా విసురుకోవాలి యింటికి పోయి.

ఇలా అంటూ దగ్గిరికి వెళ్ళి రత్తమ్మ గడ్డం పట్టుకోగా ఆమె రెండు చేతులూ పట్టుకుని "ఈ పూట మా యింటోవుండం డక్కయ్యగారూ" అంటూ జానకి ప్రాధేయపడింది.

"అమ్మ కనిపెట్టుకుంటుం దమ్మా!

"మీ మరిది వెళ్ళి పిలుచుకువస్తారులెండి దొడ్డమ్మగారిని."

"ఇప్పుడు కాదు, మరోనాడు వస్తాములే, తొరగా కూచో అమ్మా!"

"నేను తప్పమాట అన్నానా అక్కయ్యగారూ?"

"తప్పమాటా? ఎంతమాటా? రంగమ్మ కనిపెట్టుకుని వుంటుందమ్మా నేను వెళ్ళేదాకా. ఇక్కడ యేం జరిగిందో తెలుసుకుని గాని యింటికి వెళ్ళదుట."

"అమ్మయ్యో! అయితే, మిమ్మల్ని క్షణంలో పంపేస్తాను బాబూ! అదెంత కంగారు పడుతోందో పాపం! వలవల యేడ్చేసిం దండీ అక్కయ్య, చూడలేక పోయానండీ అక్కయ్యగారూ!"

"అంతా చెప్పింది రంగమ్మ. నువ్వు పార్వతీదేవివిట. చిన్నదానివని వూరుకుందిట, లేకపోతే నీ కాళ్ళమీద పడునుట. మళ్ళీ జన్మకి నీ కడుపున పుడుతుందిట దేవుడితో దెబ్బలాడి."

"పా-పం!"

ఇలా అంటూ బొట్టుపెట్టే అగరునూనె సీసా తెచ్చి దగ్గిర పెట్టుకుని అద్దంయెదుట కూచుంది జానకి.

ఏమిటేమిటో అడుగుతూ, యేమిటేమిటో చెబుతూ, అమాయికాలైన ఆమె కళ్ళల్లోకి మధ్యమధ్య గంభీరంగా చూస్తూ, వెక్కిరిస్తూ, వేళాకోళాలాడుతూ, క్షణంలో తల దువ్వేసి, ఆమె మొగం కడుక్కు వచ్చి కాటుకపెట్టుకోగా బొట్టున్నూ పెట్టి, ఆ విభ్రమవిలాసాలు చూసి విస్తుపోయి, చివరికి "మరిపోతా" అంటూ రత్తమ్మ చక్కాపోయింది.

## 14

రాత్రి పదిమ్ముప్పావు.

గాసుదీపం వెలుగు గదిలో వురకలు వేస్తోంది.

వట్టివేళ్ళ తడకలు అప్పుడప్పుడే తడవడంవల్ల, పిల్లగాలి కషాయగంధబంధురమై చల్లగా వీస్తోంది.

ఇలాంటి సమయాన, పొట్లం విప్పి మల్లెదండలు పార్వతీశం పక్కగా పక్కమీద వుంచి, గంధపుగిన్నె పట్టుకుని చిరునవ్వు నవ్వుతూ యెదట నుంచుంది జానకి.

ఆమె చూపుల్లో యేదో గంభీర ప్రశ్న కనబడగా అదేమిటా అని ఆలోచిస్తూనే జానకమ్మకి చెయ్యి అందించాడు పార్వతీశం.

జానకి చందనచర్చ ప్రారంభించింది.

"గంధంలో యేమిటో కలిపా"వన్నా డతను.

"ఇవాళ కొత్తా?"

"ఏమిటో అంటే యేదో కొత్తరకం అన్నమాటండి!"

"ఇవాళ కొత్తా అంటే అదేమిటో చెప్పకో మన్న మాటండి!"

"వోస్! ఇదే చెప్పకోలేకపోవాలి."

"వోస్! తెలిస్తే చెప్పడాని కింతసేపు కావాలి?"

"... ................"

"తెలిసిపోయింది."

"చెప్పేశారు."

"చెప్పక? పారిజాతం."

"వకుళం కాదూ?"

"అవునవును. పొరపాటే. రెండూ కలశాయి సమంగా."

"ఆ కలుపే యీ కలపానికి అందం తెచ్చింది"

"...................."

"కాని, కొంచెం తక్కువ వెయ్యవలసింది. ఎక్కువయి కొంచెం మొగంమొత్తు దున్నట్టుంది."

"అదో రుచి, దినమ్మా వొక్కటే అయితే – వొక్క మోస్తరే అయితే మొగం మొత్తదా యేమిటి?"

చకితుడై పార్వతీశం ఆమె కళ్ళల్లోకి చూశాడు.

ఆమె చూపులు మళ్ళించుకుంది.

"ఉడుకులాం మాత్రం మోతాదుగానే పడింది మొత్తానికి గంధం భేషుగ్గానే వుంది"

"ఈ మాట యెప్పుడూ వుంటుందా?"

"ఏం వుండకా?"

"నిన్న నేమన్నారో?"

"నే నిప్పటికీ ఆ మాటే అంటాను, వట్టివేళ్ళతడక లలావరసని గుబాళిస్తూ వుంటే గంధంలో యెవరయినా వట్టివేళ్ళ అత్తరు కలుపుకుంటారా?"

"అలా చూడండీ!"

ఇలా అంటూ, తర్జనీనిర్దేశంతో విరగబూసివుండిన పొగడ చెట్టు చూపించిందామె.

"అయితే?" అన్నాడతను.

"ఇక నేను మాట్లాడను."
"మాట్లాడవా, చెప్పవా?"
"పోనీ, చెప్పనండీ!"
"తెలిసింది, నువ్వు చెప్పనే అక్కర్లేదు. పొగడచెట్టు పక్కని పారిజాతం వుందా మరి?"
"ఉంటే యీ కాలంలో పూస్తుందా మరి?"
గతుక్కుమన్నా డతను.
ఆమె నవ్వు ఆపుకోలేక కష్టపడసాగింది.
"ఎందు కలా నవ్వుకుంటావూ?"

అయ్యో!"

"పైకి నవ్వెయ్యి, కుదపడం మానేస్తుంది."
కుడిచేతి మణికట్టు నోటి కడ్డం పెట్టుకుని గంధపు గిన్నె, అతని కందించి ఆమె కూచుంది.
లేచి అతను యెదట నుంచున్నాడు.
"మంచులా వుంది గంధం."
"నీ మనస్సులాగే, కదూ?"

"................"
"ఇక చాల్లెండి."
"..................."
"వినరూ?"
"          "
"అబ్బా, మీ గుణం పోనిచ్చుకోరు."
"నీ గుణం పోనిచ్చుకున్నావు కాబోలు నువ్వు?"

"ఆలస్యం అవుతుందంటే, ప్రయోజనంలేదు తెలుసా?"
"మ—రే"

"గంధపుచలవకి కుడిచెయ్యి కొంకర్లుపోయింది; కాని చివరికాబాధ తీరింది."
"తీరదూ, యువతలివాళ్ళు మెత్తనివాళ్ళయితే?"
"అబద్ధం ఆడకు."
సిగ్గుపడిన్నీ తీక్ష్ణంగా చూసి మొగంవంచుకుందామె.
కొంచెం సాగి, గంధపుగిన్నె బల్లమీద వుంచేసి మల్లెదండ లందుకున్నాడతను.
ఉభయులూ వొకరికొకరు దండలు వేసుకున్నారు.

"అదృష్టం లేకపోయింది గాని; పూలదండలు కట్టడంలో మాత్రం మంచి నేర్పే వుంది రత్తమ్మ వదినకి."

"మెచ్చుకోవడంలో మీకూ చాలా నేర్పే వుంది కాని; అదృష్టం తారుమారయి కష్టం వొకరిదీ మెప్పు మరొకరిదీ అయిపోయింది."

దీనికి చకితుడై చూశాడతను.

"ఏం, అలా చూస్తారేం?"

"నువ్వే కట్టావా?"

"కా"దన్నట్టు తల అడ్డంగా వూపిందామె, చిరునవ్వు నవ్వుతూ.

"మరెవరు కట్టారూ?"

"వో తాయిలంగారు."

"అంటే?......... తెలవలేదు, చెప్పాలి."

"ముహూర్తం దాటిపోతే మొదలే చెడిందీ? ఆవిడా!"

"ఏమిటీ? అంటూ వులిక్కిపడ్డా డతను.

"మరేమనుకున్నా" రన్నట్టు తల యెగరవేసుకుందామె.

"గంధం కూడా–"

"ఆవిడే పంపారండీ!"

నిర్విణ్ణు డయిపోయా డతను.

"బాగున్నాయి, కదూ?"

"..................."

"సంతోషించినట్టేనా?"

పార్వతీశం గంభీరంగా చూశాడు.

అంతకంటేనూ గంభీరంగా చూసింది, జానకి.

"ఏమవుతుందో యెరుగుదువా?"

"ఇదివరకే అనుకుంటున్నాం మేము 'హొసే చెల్లాయీ' అంటే 'హొసే అక్కయ్యా' అని."

"...................."

"ఏం, వూరుకున్నా రేం?"

"...................."

"మన యింటికి వచ్చేస్తుందిట"

"మాట్లాడ రేమండీ"

"వెర్రీ కాదు, వేషమూ కాదు నీది."

"చిన్నప్పు డెంతో ఆశ పెట్టారుట, ఉసురు తగలదూ? ఆడదా న్నేడిపిస్తే జయం కలుగుతుందిటండీ?"

"దేవుడు చేసినదాని కెవరేం చేస్తారూ?"

"అన్నిటికీ అంతేనా?"

"............నీ సంగతి ఆలోచించుకున్నావా?"

"వండిపెడుతూ యిద్దరికీ చాకిరీచేస్తాను."

పార్వతీశం వొక్కక్షణం దిగ్భ్రాంతు డయివుండి, వుత్తర క్షణంలో ఆవేశంతో ఆమెని పొదువుకున్నాడు

ఆ బాహుబంధంలో ఆమె నిలువునా కరిగిపోగా, తామర తూడుకంటేనూ మృదువుగా వున్న ఆమెని మరింత గట్టిగా కౌగలించుకుని, అరమూతలుపడ్డ ఆమె కళ్ళమీద అతను, కమ్మనిముద్దులు గుమ్మరించాడు.

## 15

తెల్లవారింది.

ఊరికే కాదు – నిద్రపట్టనివ్వక అక్కడ రంగనాయికనీ యిక్కడ జానకినీ పక్కనిబెట్టి రాసేసి మరీ తెల్లవారింది.

వెంటనే స్నానాదికం ముగించుకుని, చద్ది భోంచేసి, అలారం దిద్ది, బేరగాళ్ళు రాగా బెల్లం తూపించి వెయ్యడానికి గరువుమీదికి వెళ్ళిపోయాడు పార్వతీశం.

పనిలో పని జానకమ్మ కూడా యధాపూర్వకంగా యేకబంతి కానిచ్చేసి మెల్లిగా బీరువాదగ్గిరికి చేరుకుంది.

మొదట, ఆమె వీరేశలింగంపంతులు చరిత్ర తీసింది.

తరవాత, వచన భారతం స్త్రీపర్వం తీసింది.

వచన రామాయణం సుందరకాండ అందుకుంది.

రుక్మిణీ కల్యాణమూ పుచ్చుకుంది.

కాని వొక్కటీ – పది బంతులూ నడవలేదు.

విసిగిపోయి చివరికి వీణ అందుకుంది.

శ్రుతిసరిచేసి "యేమిటీ అందుకోడం" అన్నట్టు పైకిచూడగా, గోడమీది పటంలో, సరోవరంలోకి కాళ్ళు చాచుక్కూచుని చెవులోరచేసుకుని వేణుగానం ఆలకిస్తూ వొంటిమీద బట్టవున్నదీ లేనిదీ ఎరగని స్థితిలోవుంది రాధ.

తమాలవనంలో నుంచి దూసుకువస్తోంది ఆ నాదం.

ఆ భావన జానకమ్మ కంఠాన ఆవర్తాలు రేపింది.

వెంటనే ఆ వినపడుతున్నట్టున్న రాగం అందుకుని అలా చూస్తూనే వీణ మీటసాగిందామె.

రెండుమూడు నిమిషాలు గడిచాయి.

ఉల్లాసంగానే గడిచాయి కాని; రాధ కళ్ళల్లో ఆ వేణుగానలోలుని కోసం సుడితిరుగుతున్న ఉత్కంఠ గోచరించింది.

దాంతో, బాష్పప్లావితాలైన రంగనాయిక కనుదమ్ములు స్ఫురించి మనస్సు చెదిరిపోయింది.

ఇక వీణ మీటలేకపోయింది.

ఉబ్బెత్తుగాలేచి వాకట్లోకి వచ్చి చూడగా పదినిమిషాలు తక్కువ యెనిమిదే అయివుంది.

విసిగిపోయి యాదాలాభంగా కిటికిలోనుంచి వీధిలోకి చూడగా బిందె పుచ్చుకుని చెరువుకి వెడుతూ వొక యువతి కనపడింది.

తనలాగే ఆ వూరికి కొత్త కోడ లామె.

తరుచు చెరువుదగ్గిరే కలుస్తూ వుంటుంది.

ఆమె కూడా సంగీతం చెప్పేకుంది.

గాత్రాన పాడుతూ ఫిడేలు వాయిస్తుంది.

"వెళ్ళిపోతుంది" అన్న ఆత్రంతో గభీమని తలుపు తీసి "యిలా రావే వొయారిభామా!" అని పిలిచింది జానకి, చనువుగా.

ఇద్దరూ చీడీలమీదికి కాళ్ళుంచుకుని దగ్గిరదగ్గిరగా కూచున్నారు.

ఏమిటేమిటో చెప్పేకున్నారు.

ఎందుకెందుకో నవ్వుకున్నారు.

బుగ్గలు నొక్కుకున్నారు.

కళ్ళు తిప్పేకున్నారు.

బుంగమూతి పెట్టుకున్నారు.

"నీ చీర యెంతే?" అంటే "నీ పైటపరికిణీ యెంతయిందే?" అనిన్నీ ప్రశ్నించుకున్నారు.

తరవాత యేదోమాట చెబుతూ చెబుతూ "నేమరి పోతా" నంటూ లేచి నుంచుంది ఆ పిల్ల.

"కాస్సేపుండవే" అంది జానకమ్మ.

చెయ్యిపట్టుకు లాగింది కాని; ఆమె నుంచోలేదు

దానిమీద "పదింటికే భోజనంచేస్తే తరవాత యెంతసేపటికి పొద్దుగూకనే వోసెమ్మా!" అని సాగతీసుకుని, అడుగడుక్కీ అగి వెనక్కి తిరిగి చూసి మరీ జవాబులు చెప్పవలసిన అభూతప్రశ్నలు శరపరంపరగా అడిగి, యిక లాభం లేదని తోచగా "మరి వెళ్ళిరా పాపం, మీ ఆయన యెదురు చూస్తూ వుంటారు" అని సెలవిచ్చింది.

ఇంతచేసినా, గడియారం చూడగా యెనిమిదీ ముప్ఫయిరెండు నిమిషాలే అయివుంది.

మళ్ళీ చిరాకుపడిం దామె.

నిజంగా, ఆమె చాలా నెమ్మదయిన పిల్ల కనక సరిపోయింది కాని; మరో రకం అయితే గడియారం పుచ్చుకుని నేలబెట్టి కొట్టేసి వుండును.

అక్కడికీ "అలారం కొట్టేదాకా దీనిమొగం చూడగూడ"దని కొట్టినంత పని మాత్రం చేసి గదిలోకి చక్కా వెళ్ళింది కాని; అక్కడా ఆమె కేమీ తోచలేదు.

కుర్చీ ఆనుకునుంచుని "రత్తమ్మక్కయ్యగా రయినా రాకూడదూ యిలాంటప్పుడూ?" అని వోమాటనుకుంది.

"బేరగాళ్ళు మధ్యాహ్నం వస్తే యేమో?" అని వో మాటనుకుంది.

చివరికి "పోనీ, రెండు ప్లేట్లు వేసుకుందా" మనుకుంటూ ఫోనుదగ్గిరికి వెళ్ళింది.

వెళ్ళిందేకాని తెమల్చుకోలేకపోయింది.

“గాత్రమా, వీణా, ఫిడేలా, గోటా, వేణువా!” అని జిజ్ఞాస వచ్చిందక్కడ.

దాల్లో నాలుగు నిమిషాలు గడిచిపోయాయి.

చెయ్యి పెట్టాటప్పటికి సంగీతం లేకుండా భమిడిపాటి కామేశ్వరరావు గారు, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో నుంచి ఎత్తి చదివిన సీతమ్మ శోకం ప్లేటు వచ్చింది.

అదయాక, యేదో యింగ్లీషు సంగీతం రికార్డు వచ్చింది.

ఇలాగ రెండు మూడు ప్లేట్లు వేశాటప్పటికి “నా యెదుట మరొకళ్ళ పాటా?” అన్నట్టు వాకట్లో గడియారం సాగదీసి అలారం పాడింది.

వెంటనే యెక్కడిప్లేటు అక్కడే – యెలా వున్నఫోను అలాగే వుంచేసి, బిందె బుజాన వేసుకుని, మనస్సులో చాలా తొందరపడుతూ, అడుగులు మాత్రం మెల్లిగానే వేస్తూ చెరువుకి బయలుదేరింది జానకి.

## 16

అప్పటికప్పుడే – పావుగంటకి ముందే వచ్చి అక్కడ కూచుని వుంది రంగనాయిక.

పావంచాలమీద కూచుని, మాటిమాటికీ లేచి చూస్తూ అవసరం లేకపోయినా బిందె తోముతూ ఆత్రపడిపోతోందామె

జానకి కనపడేటప్పటి కామె మెరుపయిపోయింది.

రంగనాయిక కనపడేటప్పటికి జానకీ సంబరపడింది.

వెంటనే “ఎంతసేపటికీ రాకపోతే యెలాగే మాతల్లీ?” అంటూ వొకరూ “తొమ్మిదిన్నర కాందే వచ్చి యేం చెయ్యనూ? కాకపోయినా, నువ్వు ఇవాళ తొరగా వస్తావని నేనేం కలగన్నానా?” అంటూ వొకరూ లేచి గభీమని కౌగిలించుకున్నారు.

ఆ వెంటనే చెరువులో కూడా దిగి గుండెల్లోతుకి వెళ్ళి నుంచున్నారు.

అప్రయత్నంగా వొక్కమాటు కంఠందాకా మునిగిలేచారు.

“ఏం జరిగింది చెల్లీ?” అంటూ ప్రారంభించింది రంగనాయిక, జాప్యం సహించలేక.

“నేను చెప్పలేదూ?” అని జానకి యెదు రడిగింది. దీంతో, యిద్దరూ వుక్కిరి బిక్కిరి అయిపోయారు.

అప్పుడు “వివరంగా చెప్పవుటే చెల్లీ?” అంటూ రంగనాయిక గడ్డం పట్టుకోగా, అంతఃపురంలోనే వుండిపోవలసిన సంగతులు తప్ప తత్తిమ్మా – జరిగిం దంతా – వొక్క అక్షరమయినా విడిచిపెట్టకుండా – పై పెచ్చు కళ్ళు తిప్పుకుంటూ మరి కొన్ని అక్షరాలు కలిపి అతిరసవంతగా చెప్పింది జానకి.

మొదట రంగనాయిక మొగాన ఆనందం మెరిసింది

దాంతో, ఆమె కళ్ళు అరమూతలు పడ్డాయి. చేతులు దోయిలించుకున్నాయి.

తరవాత – వెంటనే – కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

రావిరేకల్లాగ పెదిమలు వొణికిపోయాయి.

కంఠం గద్గదిక మయిపోయింది.

ఇందుకే జానకి అప్రతిభ అయిపోగా, రంగనాయిక, అతి కష్టంమీద తెరిపిచేసుకుని "చెల్లీ, ఇక యీజన్మ కింతే అని నిరాశ చేసుకుని వుండగా నువ్వు నన్ను స్వర్గాని కెక్కించావు. ఏమిచేసినా నీరుణం తీర్చుకోలేను. ఇవి చేతులుకావు, కాళ్ళు" అని రెండు చేతులూ పట్టుకుని మరి మాట్లాడలేకపోయింది.

జానకమ్మ కూడా నీరవురా లయిపోయింది.

ఒక్క నిమిషం యిద్దరూ అలాగే వుండిపోయారు.

పైట సవరించుకుంటూ తరవాత "చెల్లాయి! నేనిక వెడతానే. మా మరదలు పుట్టింటికి వెడుతుం దివాళ. అది వెళ్ళాటప్పు డింటో వుండకపోతే బాగుండ దమ్మా! అసలే అది కజ్జాకోరు. నన్ను చూస్తే దాని కళ్ళు మిటమట్లాడతాయి కూడాను. కనక, మళ్ళీ రేపు ఎలాగో వీలుచేసుకుని రేపు మీ యింటికే వచ్చేస్తాను. ఏమీ అనుకోకేం? తప్పులుంటే మరిచిపోవేం? అక్కయ్యమీద దయవుంచేం?" అంటూ గడ్డం పట్టుకుని బతిమాలి, బిందె ముంచుకుని, మెల్లిగా పావంచా లెక్కి పదిగజాలకోమాటు ముసిముసి నవ్వులతో తిరిగితిరిగి చూస్తూ వెళ్ళలేక వెళ్ళలేక బలవంతాన వెళ్ళిపోయింది రంగనాయిక.

అప్రతిభ అయిపోయి అలాగే నుంచుంది జానకి.

"మీ అక్కయ్య, మరదళ్ళ క్కూడా లోకువయిపోయింది చూశావా?" అని యెవరో అడిగినట్టయిందామెకి.

దీంతో, ఆమె నరాలు పొంగిపోయాయి

కళ్ళల్లో రోషం ఆవరించింది.

ఆ కళ్ళకి, మరదళ్ళు, చీపురుకట్ట పుచ్చుకుని, రంగనాయికను తరుముతున్నట్టు కనపడింది.

మనస్సు గుబగుబ లాడిపోయింది.

వెంటనే చరచరా బిందె ముంచుకుని, గబగబా యింటికి వెళ్ళిపోయిందామె.

## 17

సాయంత్రం అయిదున్నర గంటలవేళ, పార్వతీశం, పొలంనుంచివస్తూ బలరామిరెడ్డి అనే మిత్రునితో కూడా సూరావధానులుగారి పెద్దదొడ్డిదగ్గిరికి వచ్చాటప్పటికి, దొడ్డిగుమ్మాన నుంచుని వుండిన పనిమనిషి "బాబయ్యా!" అని సంబోధించి, రెడ్డికేసి చూస్తూ యేదో నసికింది.

అది విరోధుల యింటి పనిమనిషి కావడంవల్లా, విరోధుల స్థలంలో నుంచుని వుండడం వల్లా తనని కాదనుకునిన్నీ "యేమిటీ?" అనడిగాడు పార్వతీశం.

రెడ్డికేసి చూస్తూ ఆమె మళ్ళీ నసికింది.

అది యేదో చెప్పతలుచుకుందనీ, రెడ్డి వున్నందుకు, సందేహిస్తోందనీ గుర్తించి "తొరగా చెప్పు, భయంలేదులే" అన్నాడు పార్వతీశం.

అయినా ఆమెకి తృప్తి కాలేదు కాని; చేసేది లేక అపవారించి "మిమ్మల్ని రంగనాయికమ్మగారు పిలుస్తున్నా"రంది.

పార్వతీశాని కంతా అర్థం అయింది.

అయినా "యెందుకూ?" అనడిగాడు.

"ఏమో బాబూ!"

"ఎక్కడుందీ?"

"ఈ దొడ్లోనే" అంటూ తలుపు తెరిచి పనిమనిషి లోపల అడుగు పెట్టింది.

మిత్రులు నేత్రావధానం చేసుకున్నారు.

అది వోపట్టాన పూర్తికాకపోయినా చివరికి "వెళ్ళవ"ద్దన్నట్టు రెడ్డి మొగం పక్కకి తిప్పుకున్నాడు.

అది పార్వతీశం కాళ్ళకి బందం అయింది.

నిజానికి అతని అభిప్రాయమూ "వెళ్ళకూడ" దనే కాని;, అతను రెడ్డి కేసి చూస్తూనే వుండగా – అంటే రెడ్డి అతనికి కనపడుతూనే వుండగా – అదనంగా "రారూ?" అంటూ దోసిలి వొగ్గి రంగనాయిక ప్రాధేయ పడుతున్నట్టూ "వెళ్ళకపోతే నేనొప్పుకోను సుమండీ!" అంటూ జానకి ఆజ్ఞాపిస్తూ వున్నట్టూ కనపడింది.

ఆగలేకపోయాడు.

వెంటనే ముందు పనిమనిషీ, యెవరయినా చూస్తున్నారేమో అని వొకమాటలాగా యిలాగా చూసి తరవాత పార్వతీశమూ దొడ్డోకి బయలుదేరారు.

చేసేదిలేక "జాగ్రత్తసుమండీ!" అని మాత్రం అని, రెడ్డి, ఆ గుమ్మాని కెదురుగా వున్న సందు మొగకి వెళ్ళాడు.

☆ ☆ ☆

రివ్వునవచ్చి సంపంగిపరిమళం ఘ్రాణతర్పణం చేసింది.

రువ్వున వచ్చి కాకి అరుపు కర్ణవిదారణం చేసింది.

అది మనస్సు కుల్లాసం కలిగించగా, యిది హృదయంమీద దెబ్బ కొట్టింది.

మరొక డయితే యేమి చేసునో గాని పార్వతీశం ముందుకే అడుగు వేశాడు.

పెరిగి పెరిగి చివరికి మొగ్గతొడిగిన ప్రేమ వికసించగా రంగనాయిక కళ్ళనిండా చూసింది గాని; వల్లమాలిన సిగ్గు వచ్చి ఆమె మొగం వంచేసింది

అయితే, తన సమీపానికి రావడంలో అతను కనపరచిన ద్రుతగతి చూసి, అతను, ముందు తనను గుచ్చి కౌగిలించుకుని, ముద్దాడి, తరవాతే మాట్టాడతా డనుకుని, ఆసిగ్గుచాటున మురిసిపోతూ నిరీక్షించింది.

పట్టరాని ప్రేమ వుండి, నిగ్రహించుకోరాని సాహసం పుడితే తప్ప స్త్రీ– అందులోనూ లేజవరాలు ప్రియుణ్ణి రమ్మని అహ్వానించలేదు కనక, తనని చూడగానే ఆమె స్వయంగ్రాహం చేసే మాట్టాడుతుందని – సంఘం తలుచుకుని జంకుతూ కూడా అతనెంతో ఆశించాడు కాని; మిడుతూ మిడుతూచూస్తూ చివరికిద్దరూ బొమ్మలయి వుండిపోయారు.

చూసిచూసి "పాపం, సిగ్గుపడితున్నా"రనుకొని పనిమనిషి తప్పుకుంది.

అప్రయత్నంగా యిలాగ ఏకాంతస్థితి సంభవించినా మరో అడుగు ముందుకు వేసిన్నీ చివరికతను "ఎందుకూ రమ్మన్నావుటా?" అనడిగాడు.

ఈ మాట ధన్నుమని హృదయంమీద కొట్టినట్టుకాగా ఆమె నీరవురాలయిపోయింది.

"రమ్మనడం నిజమేనా?" అని మళ్ళీ అడిగాడతను.

ఏమిటేమిటో మాటలు తోచి, నిర్ధారణ కాక అప్పుడూ ఆమె బదులు చెప్పలేకపోయింది.

"పనిమనిషి అబద్ధం చెప్పినట్టుంది" అని గంభీరంగా చూశాడతను.

ఇది విని వెళ్ళిపోతాడేమో అని ఆదుర్దాపడుతూ అటూ ఇటూ చూసిందామె.

ఆ చూపులతని హృదయం కలిచేశాయి.

వెంటనే వొక్క అంగలో వెళ్ళి అతనామె చెయ్యి పట్టుకున్నాడు.

అందుకామె సిగ్గుపడి మొగం పక్కకి తిప్పకుంది.

అయినా, ఆ మొగం వికసించి వుండడం గుర్తించి గభీమని పొదువుకుని గుండెలకదుముకుని, "రంగా, నేనిక్కడ అట్టేసేపుండడం మంచిదికాదు. నువ్విది యోచించావా?" అనడిగాడు.

"ఇప్పటికా దయవచ్చింది?"

"ఎప్పటికయినా నీ దయ ముందు నా దయ యేపాటిదీ?"

"కోటిగుణితం."

"................"

"ఇప్పటిదాకా నా కళ్ళు మాత్రమే చల్లగా వున్నాయి, ఇప్పుడు హృదయం కూడా చల్లబడింది."

"................"

"ఎంతో ఆశపడ్డాను. చివరికి నా ఆశలన్నీ మంచు విడిపోయి నట్టయిపోయాయి కాని, నేటికి చెల్లాయి అనుగ్రహం—"

మాటసగంలో అందుకుని "దీనికేం చెప్పాలో నాకు తోచడం లే"దన్నాడుతను.

"బెంగపెట్టుకో వద్దంటే చాలు."

ఆమె వోరచూపులే చూస్తోంది

ఆ చూపులయినా లజ్జాముద్రితాలుగానే వున్నాయి కాని; ఆమెచేతులు తన నడుముకి చుట్టుకోవడమూ, ఆమె శరీరం తన శరీరంలో ఇమిడిపోతూ వుండడమూ గుర్తించి "నీ సాహసం చాలా ఆశ్చర్యం కలిగిస్తోంది. నీ ప్రేమ తిరస్కరించ లేకుండా వున్నాను కాని; గందరగోళం పుట్టవచ్చు"నంటూ మొగం పైకెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడతను.

అయితే "గందరగోళం పుట్టవచ్చు" నేమిటి విరుచుకుని మీద పడేపోయింది.

పార్వతీశం యిలా అనేటప్పటికి "ఎవడురా నువ్వా? నా దొడ్లో కెందుకు వచ్చావురా బుద్ధిహీనుడా?" అంటూ వొక రంకె వినబడింది

చూడగా, రంగనాయిక మూడో అన్న వెంకటేశం, ఆబోతులాగ మీదికి వస్తున్నాడు.

అయితే, పార్వతీశం రంగనాయిక పిలుపెలా అంగీకరించాడో వెంకటేశం పిలుపూ అలాగే అంగీకరించాడు గాని; రంగనాయికను విడిచి బట్ట ఎగగట్టి ప్రేమస్థానే రోషం జ్వలింప చేసుకుని, ఆనందార్ద్రాలయిన నేత్రాలు జోతులు చేసుకుని, దరహాసతరళిత మైన అధరం శౌర్యస్ఫురితం చేసుకుని, ప్రేమాద్వైత సాధన వ్యగ్రాలయిన చేతులలో వజ్రముష్టి సంఘటించుకుని "రారా అప్రాచ్యుడా!" అని మోహరించాటప్పటికి మీదే పడ్డాడు

# 18

రంగనాయిక కొయ్యయిపోయింది.

ఆమె కళ్ళు సిగ్గు పడుతున్నాయి. చెమ్మగిల్లుతున్నాయి. నిప్పులు కక్కుతున్నాయి. చెదిరిపోతున్నాయి కూడాను.

అప్పటికప్పుడే వారు ద్వంద్వయుద్ధం సాగిస్తున్నారు.

తన దొడ్డి అని వెంకటేశం భరవసా.

తన ప్రియురాలి సముఖం అని పార్వతీశం దిలాసా.

దీనికి తోడు, వెనక్కి తీస్తే రంగనాయిక "ఛీ" అంటుందేమో అని యిద్దరికీ వల్లమాలిన శౌర్యం.

దీంతో ముఖాముఖీ అయీ అవడంతోటే బాహాబాహీ; కచాకచీ, ముష్టా ముష్టీ, పదాపదీ అయిపోయి, యిద్దరూ కూడా మాం —చి ముమ్మరంలో వున్నారు కనక కొమ్మ టేనుగుల్లాగ కుమ్ముకోసాగేరు.

రంగనాయిక ప్రకృతిలో పడింది.

సరిగా ఆమె చూపులకు మళ్ళీ నైశిత్యం అబ్బేటప్పటికి పార్వతీశం, వెంకటేశాన్ని క్రాపింగు పట్టుకుని వంచి వీపుమీద నాలుగైదు వీసెగుద్దులుంచాడు.

ఆ వంగివుండడమే వొక వుపాయంగా యెంచుకుని, పార్వతీశాన్ని కూలగొడదామని వెంకటేశం అతని రెండు కాళ్ళూ పట్టుకున్నాడు.

అయితే, వెంకటేశం చేతులు తన కాళ్ళకి చుట్టబెట్టుకోడంతోనే నడుము పట్టుకుని పార్వతీశం, వెంకటేశాన్ని యెత్తి కుదేసాడు.

రంగనాయిక కళ్ళు చిరతలు కమ్మాయి.

పార్వతీశం రోషస్ఫులింగాలలో గర్వప్రభ మెరిసింది.

ఆ పడ్డపాటునే రెండు తన్నులు తగిలిద్దామని పార్వతీశం కాలెత్తాడు గాని; అంతలో జ్ఞాపకం వచ్చి, తటాలున రంగనాయిక కేసి చూసి ఆమె మొగాన సంబరానికి బదులు కలవరం వుండడం గుర్తించి వూరుకున్నాడు.

వెంకటేశానికి చచ్చినచా వయింది; క్రోధం పోలేదు.

మళ్ళీ నిప్పులు క్రక్కుతూ లేచా డతను.

పార్వతీశంమీద పడదామని వూగిసలాడాడు కాని; హఠాత్తుగా పతకం మార్చుకుని "లాంజముండా" అంటూ రంగనాయికమీది కురికాడు.

అదిచూసి పార్వతీశం అగ్గయిపోయాడు.

అంతకిముందే రంగనాయిక తప్పించుకోవాలని చూసింది కాని; దొరికిపోయింది.

వెంకటేశం ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

ఒక్క క్షణం వుంటే రంగనాయిక వెంకటేశాన్ని చూపులతో కాల్చేసునో, పెనుగులాడునో, యేడుస్తూ కూలబడునో కాని, పార్వతీశం అది చూడలేకపోయాడు.

వెంటనే వెంకటేశం రెక్క గూటిమీద వొక్క పోటు పొడిచాడు.

తరవాత అతని గజ్జల్లో వొక తాపు తన్నాడు.

దీంతో, వెంకటేశం రంగనాయికను విడిచి పార్వతీశంతో కలియబడ్డాడు.

ఇద్దరికీ రోషం పెచ్చిపోయింది.

ఇద్దరూ జుట్లు పట్టుకుని వంచుకున్నారు. తన్నుకున్నారు. గుద్దుకున్నారు. గెంటుకున్నారు.

రంగనాయిక అప్పుడు మళ్ళీ వొకమాటు దిగ్భ్రాంత అయి, అంతలో మళ్ళీ ప్రకృతిలో పడి, పార్వతీశమే పైచెయ్యిగా కనపడుతూ వుండినా కంగారుపడి, వెంటనే వీధిలోకి వచ్చి, యెదటిసందు మొగని బలరామరెడ్డి కనపడగా ధైర్యం తెచ్చుకుని, యెవరికయినా వినపడిపోతుందేమో అని కంఠం నొక్కుకుని "లోపల కొట్టుకుంటున్నా"రని ఆత్రపడిపోయింది.

ఇది వినడమే తడువుగా రెడ్డి దొడ్లోకి వురికి వొక్క వురుమురిమాడు. అప్పటికప్పుడే ఆయాసం ప్రారంభం అయి వుండడంవల్లా, పైపెచ్చు అగ్గిపిడుగులాగ యెదుట పార్వతీశం కుడిభుజం బలరామరెడ్డి కనపడ్డంవల్లా వెంకటేశం కళ్ళూ చేతులూ తేలవేసుకోగా, ఆ సందుబాట్లో మరో నాలుగు గుద్దులు గుద్ది, సాగతీసి వో—క్క తాపు తన్ని "దిక్కున్నచోట చెప్పకో" అంటూ వెంకటేశం జుట్టు విడిచిపెట్టాడు పార్వతీశం

వొణికిపోతూ గుమ్మాన నుంచుని వుంది రంగనాయిక.

"భయపడకు" అంటూ వెళ్ళి పార్వతీశం ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

ఇది భయంకాదు అంటూ మెల్లిగా చెయ్యి విడిపించుకోబోయిందామె.

"మా—మన యింటికి వెళ్ళిపోదాం రా" అంటూ ఆ చెయ్యి పట్టుకునే వుండి అడుగు వేశాడు పార్వతీశం.

దీంతో రంగనాయిక తేరుకుంది.

ఆమె చూపుల్లో ధైర్యమూ సిగ్గూ మెరిశాయి.

ఆ స్థితిలో ఆమెకూడా వొక్క అడుగు వేసింది కాని; చురచుర చూస్తూ, తల అడ్డంగా వూపుతూ, చేత్తో కూడా నిషేధిస్తూ "ఇప్పుడు కా"దన్నాడు రెడ్డి.

"ఏం?" అనడిగాడు పార్వతీశం.

"ఇప్పుడేవస్తే దొమ్మి జరిగిపోతుంది" అని పార్వతీశానికి చెప్పి, "ఇవాళకి మీ అమ్మమ్మగారింటికి వెళ్ళిపొండి. మరి నుంచోకండి" అంటూ రంగనాయికను తొందరపెట్టాడు రెడ్డి.

"కాదుకాదు, అమ్మమ్మగారి యింటికికాదు, నరసింహ దీక్షితులు మామయ్య గారి యింటికి వెళ్ళుమందాం — భద్రమ్మత్త రంగమ్మ పింతల్లేగా?" అన్నాడు పార్వతీశం.

"అది బాగుం" దన్నట్టు చూసింది రంగనాయిక.

మళ్ళీ పార్వతీశం కేసి చూసి, "వెళ్ళాలి. మరి కదలండి, తొరగా. నేను బతికి వుండగా మిమ్మల్నెవరూ యేమీ చెయ్యలేరు" అంటూ రెడ్డి తొందరపెట్టాడు.

అప్పుడొక్కమాటు పార్వతీశం కేసి గంభీరంగా చూసి రంగనాయిక, మళ్ళీ మళ్ళీ వెనక్కి తిరిగితిరిగి చూస్తూ పక్కసందులోకి వెళ్ళిపోయింది.

ఇది యిలా జరుగుతూ వుండగా పనిమనిషి వచ్చి లోపల తలుపు గొళ్ళెం పెట్టేసింది.

"భద్రమ్మగారింటికి వెళ్ళమన్నారేం?" అనడిగాడు రెడ్డి.

"రంగనాయికని నాకివ్వనందుకు అక్కగా రని సందేహించకుండా రామసోదెమ్మత్తగారిని ఇప్పటికీ కోసిపెడుతూనే వుంది భద్రమ్మత్త."

"అయితే?"

"రాజమండ్రివెళ్ళి రంగనాయికను నేను పెళ్ళిచేసుకుంటే మద్దత్తు చెయ్యడానికి వారింటిల్లపాదీ సిద్ధంగా వున్నారు."

"సరే" అన్నాడు రెడ్డి.

వెంటనే వారిద్దరూ యెదటి సందున పడ్డారు.

మాటిమాటికీ వెనక్కి చూస్తూ "వోయ్ లచ్చిరెడ్డీ! వోరి సుబ్బారెడ్డీ! వొయ్యోయ్ కృష్ణారెడ్డీ! యేమండోయ్ సూరారెడ్డి నాన్నగారూ!" అని తనవారిని కేకలేస్తూ కూడా వెళ్ళాడు బలరామిరెడ్డి.

## 19

తానొక పడకకుర్చీలో వాల్తూ, రెడ్డికిన్నీ వొక పడకకుర్చీ చూపిస్తూ "ఏం, నేను తొందరపడ్డా నంటావు, కదూ?" అనడిగాడు పార్వతీశం.

"తొందరకాకపోతే?" అని ముదలకించాడు రెడ్డి.

"అప్పుడు వెళ్ళకపోతే యెందులో నయినా పడి చచ్చి పోతుంది గాని అక్కయ్య, మరేమయినా వుందా?" అనడుగుతూ మండువాచివరికి వచ్చి నుంచుంది జానకి

"వున్నావా?" అన్నట్టు చూశాడు పార్వతీశం.

"అవిడా కనిపెట్టలేకపోయారు. అసలు, తోటలోనే వున్నారు వెంకటేశంగా రేచెట్టుకిందో?"

"ఏమయినా, మహా చురుకైనవాడోయ్!"

"అలాగేం?"

"నిన్ను చూశాటప్పటికి మాత్రం నవనాడులూ కుంగిపోయాయి."

ఇది విని మందహాసం చేసి "నన్నుకూడా కలిపి ఛార్జీ యిస్తారు. మొన్ననే పేచీపడి వున్నారు కనక వోబిరెడ్డినీ, నరసింహారెడ్డినీ కూడా కలుపుతా" రన్నాడు రెడి.

"అయినా, మీరేమీ తొందరపడవద్దు."

"వెంకటేశంగారి నొక దబ్బళింపు—"

"వద్దు వద్దు. మనం యెదిరిఛార్జీ కూడా పెట్టవద్దు."

"వాళ్ళు ఛార్జీ యివ్వడమే నిరుకయితే అట్నుంచి నరుక్కురావడానికి మనకు సాయం లేకపోలేదు."

"మరి రంగనాయికమ్మగారి మాటేమిటీ?"

"అదే బెంగగా వుంది. ఆమెని బాధిస్తారు."

"నీ కా బెంగ అక్కర్లేదురా బావా!" అంటూ మాటలోనే వచ్చింది రత్తమ్మ.

"ఏ దొడ్డోనూ కనపడకపోగా నీతో మీ యింటికే వచ్చేసిందనుకున్నారు వాళ్ళు; కాని పిడపర్తివారి శ్యామలాంబ, వేమూరివారి సందులోకి వెళ్ళినట్టు చెప్పింది. దానిమీద రామస్వామీ సూరన్నా వెతకడానికి బయలుదేరగా 'ఆ సంగతి తరవాత చూసుకుందాం' అంటూ నరసింహ దీక్షితులు బాబయ్య జబ్బలు పట్టుకుని వాళ్ళని వెనక్కి పంపేశాడు. రామసోదెమ్మపిన్నీ నేనూ యిప్పుడే చూసి వచ్చాం. రంగమ్మ, దీక్షితులువారి యింటో సుఖంగా వుంది" అని వివరంగానున్నూ చెప్పిందామె.

అది విని "అక్కయ్య భద్రంగా వుందా అక్కయ్యగారూ? రామసోదెమ్మ పిన్ని గారేమీ అనలేదూ?" అనడుగుతూ ఇంకో అడుగు ముందుకి వచ్చింది జానకి.

"నా కడుపు చెడపుట్టా" వని యేడ్చింది. 'నేనిక తల యెత్తుకు తిరగడం యెలాగా' అంటూ మొత్తుకుంది.

"అక్కయ్యా—"

"నువ్వు నా గొంతుక కొయ్యలేదూ?" అని ముదలకించింది

ఇది విని "సెబాస్" అని చెయ్యి జాడించుకుంటూ పార్వతీశం అందుకున్నాడు.

"పరీక్షపోయినవాడితో తమపిల్ల కాపరంచెయ్యడం వారికి పనికిరాకపోయింది. మరి చచ్చినవాడి పేరుచెప్పుకుంటూ పడివుండడం ఆమెకి మాత్రం పనికివస్తుందా?"

"భద్రమ్మపిన్ని సరిగా నువ్వన్నట్టే అనలేదు కాని; చిక్కగానే చీవాట్లు—"

"ఏమన్న దేమిటి ఆవిడ?"

"మొగుడూ పెళ్ళాలని విడతీశావు నువ్వు."

మళ్ళీ "సెబాస్" అంటూ వూగిపోయాడు పార్వతీశం.

"రంగనాయికమ్మగారు చెప్పుతో కొట్టారు సూరావధా నలుగారిని" అన్నాడు రెడ్డి.

"మరి దీక్షితులు మామ యేమీ అనలేదూ?"

"అనకేం? అతను కలగజేసుకోబట్టే రామసోదెమ్మపిన్ని చల్లగా యింటికి వెళ్ళిపోయింది. ఆవిడ గుమ్మం దిగుతూ వుండగా 'నిన్నెవ రేం చెయ్యగలరో చూస్తాను, రానియ్యవే చెల్లీ' అంటూ దుడ్డుకర్ర పుచ్చుకుని గుమ్మాన కూచున్నాడు రామచంద్రుడు."

"వాడున్నాడూ యింటిదగ్గిర?" అని యెగిరి గంతువేసి "రెడ్డీ, యిక మనం నిశ్చింతగా వుండవచ్చు. రంగనాయిక పువ్వుల్లో పెట్టినట్టుంటుంది" అన్నాడు పార్వతీశం.

దానిమీద "నేనో మాటు చూసిరానా అక్కయ్యనీ, ఏమండీ? మీరు సాయం వస్తారా రత్తమ్మక్కయ్యగారూ!" అంటూ వుబలలాటపడింది జానకి; కాని "వద్దు ఇవాళే కాదు, ఇంతట్లోనే మీరు గుమ్మం దిగడానికి వల్లకాదు" అన్నాడు బలరామిరెడ్డి.

"బోధపడిందా?" అనడిగాడు పార్వతీశం.

"అవునమ్మా, కొన్నాళ్ళపాటు నువ్వు వీధి మొగం చూడ్డానికి వీలులేదు" అంది రత్తమ్మ కూడా.

జానకమ్మ నిరుత్సాహపడిపోయి వెనక్కి తగ్గింది.

"చెల్లెమ్మగారి నిల్లు కదలవద్దన్నారు సరే. మరి దానివల్ల మీమీద యెంత పూచీపడుతోందో గ్రహించుకున్నారా?" అనడిగాడు రెడ్డి, రత్తమ్మని.

"అంటే?"

"అంటే, ఈ గొడవలు పాతబడిపోయేదాకా మీరిక్కడ వుండిపోవా లన్న మాట, తెలుసా?"

రత్తమ్మ నిలా అడిగి పార్వతీశం కేసి చూశాడు రెడ్డి.

"అడగవలసినమాటే అది" అన్నాడు పార్వతీశం.

ఇంతలో "ఉండండీ! నాకు భయంగా వుంది. మీరుండి పోవాలండీ అక్కయ్యగారూ!" అంటూ రత్తమ్మ చేతులు పట్టుకుంది జానకి.

రత్తమ్మ హృదయం కరిగిపోయింది.

జాలీ కనికరమూ ఆమె రక్తనాడుల్లో పరుగులు తీశాయి.

వెంటనే ఆమె రెడ్డితో "అన్నమాటే" అంది. పార్వతీశంతో "నువ్వు బెంగపెట్టుకో" కంది. "ఇక్కడకాదు, రా" అంటూ చెయ్యిపట్టుకుని జానకమ్మ నింటోకి తీసుకు వెళ్ళింది, చివరికి.

"సెబాస్!" అన్నాడు రెడ్డి.

పొంగిపోతూ వుబ్బెత్తుగా లేచి "అదీ మాట, దయ అంటే అలా వుండాలి" అంటూ రత్తమ్మ వెనకనే యింటోకి వెళ్ళాడు పార్వతీశం.

# 20

రోజుకుంటూ వెళ్ళి, వెంకటేశం, జరిగిం దంతా చెప్పగా "లాం-జముండని పచ్చడి చేసేద్దాం రండి, రంగిని" అంటూ సూరన్న యెగిరిపడ్డాడు.

"నలుగురమూ వెళ్ళి పార్వతీశంగాణ్ణి తన్నేద్దాం రండి" అంటూ రామస్వామి నడుం బిగించాడు.

"ఎంతపని చేశాడూ అభాగ్యుడూ?" అంటూ సూరావధాని రుద్రుడయిపోయాడు.

వారిలో వొక్క భీమన్న శాస్త్రి మాత్రం తొందరపడలేదు. పైపెచ్చు, తమ్ముణ్నీ తండ్రినీ సద్దణచి "మునసబు నోమాటు తీసుకురారా" అని పోతునాయణ్ణి పంపాడు.

ఇది యిలా జరుగుతూ వుండగా యింటోకి వెళ్ళి "చితక బొడిచేశాను గాడిదకొడుకుని" అంటూ ఆడవాళ్ళదగ్గిర పురాణం విడేశాడు వెంకటేశం.

"అయ్యో" అంటూ ముసలమ్మ కూలబడిపోయింది.

"ఏం పోయీకాలం వచ్చిందీ వదినకీ?" అంటూ వెంకటేశం పెళ్ళాం పరవళ్ళు తొక్కింది.

"దినాలు గడవాలి. అప్పుడే తీరిందా సంబరం?" అని విత౦తుకోడలు సాగదీసుకుంది.

"ఎన్నాళ్ళనుంచో యీ స్నేహాలు?" అంటూ సూరన్న పెళ్ళాం మూతి ముడుచుకుంది.

పెద్దకోడలు నోరువిప్పలేదు; కాని, అత్తగారికేసి చూస్తూ వెటకారంగా నవ్వి తన గదిలోకి చక్కా పోయింది.

ఆ మాటలు గుండెలు బద్దలుకొట్టగా, యీ నవ్వు ప్రాణాలు తోడెయ్యగా రామసోదెమ్మ ముందు ఇల్లంతా చూసి, తరవాత చిన్నదొడ్డి వెతికి చివరికి, పెద్దదొడ్డి అంతా తిరిగి "వోసి నీ మొగం మండిపోనూ, యెక్కడ తగలడ్డావే రంగీ?" అంటూ మోటబావిదగ్గిర చతికిలబడి పోయింది, వగర్చుకుంటూ.

రంగనాయిక ఆవరణలో యెక్కడా లేదని తెలిశాటప్పటికి మొగాళ్ళు "వాడితోనే పోయింది, పదండి కొంపకి నిప్పుపెట్టేద్దాం"అని వొకడూ "జుట్టు పట్టుకుని వాడి పెళ్ళాన్ని వీధిలో బరబరా యీడ్చేద్దాం రండి" అని వొకడూ యెగిసిపడ్డారు.

"శపించేసి వీడివంశం నిర్వంశం చేసేస్తా" నంటూ సూరావధానులు చెంబుకోసం అటూ ఇటూ చూశాడు.

నాల్గుగ్గళ్ళ రాత్రిదాకా ఆలోచించి "నలుగురు (ఫలానా ఫలానా) రెడ్లని వెంటబెట్టుకువచ్చి, పార్వతీశం, వెంకటేశాన్ని తన్నించి, కుమ్మించి, గుద్దించి, కొట్టించి, ఈడ్పించి వెళ్ళిపోయినట్టు పోరి భీమన్న శాస్త్రి మునసబు చేత ఒకీరు రాయించాడు.

ఏదో కూనీకేసు సందర్భంలో పోలీసుమురా లొల్ల గ్రామంలో మకాం చేసి వుండగా, రాత్రికి రాత్రి ఒకీరక్కడకే వెళ్ళిపోయింది.

## 21

కాలాని కొక్కటే పని.

అది రావడం, వచ్చి వెళ్ళిపోవడ మున్నూ.

నిజానికీ రెండూ వొకటే; కాని సావధిక మైన మనుష్యుని దృష్టిలో వుందీ విభాగం.

ఇంతే కాదు, ఒక్కొక్కప్పుడు కాలం అతి వడిగా వచ్చేసినట్టు కనబడుతుంది. మరొక్కొక్కప్పుడు అతి మందంగా వచ్చిన ట్టనిపిస్తుంది.

వెళ్ళేటప్పుడున్నూ ఈ హెచ్చు తగ్గులు కనపడతాయి.

ఇది కూడా మనుష్య జీవితం సావధికం కావడంవల్ల కనపడేదే.

"అయ్యో, దినాలు దొర్లి పోతున్నా"యని కొందరు బెంగ పెట్టుకుంటారు.

"పొద్దుగూకదు, తెల్లవారదు" అని కొందరు దిగులుపడతారు.

"ధర్మం దిగనారిపోతోంది. అంతా కాలమహిమ" అంటూ కొందరు దేవుళ్ళాడతారు.

"కాలం యింకా పక్వం కాలేదు" అని కొందరు నిరీక్షిస్తూ వుంటారు.

ఏమయినా, అది హృదయం బద్దలుకొట్టే దుఃఖాలూ మోసుకువస్తుంది.

ఆనంద పారవశ్యం కలిగించే సుఖాలూ తీసుకువస్తుంది.

ఏమీ తోచనివ్వని స్తబ్ధతా వెంటబెట్టుకుని వస్తుంది.

అనేక విషయాలలో దిగ్భ్రాంతి కలిగించే మార్పులూ గెంటుకువస్తుంది.

అయితే, యివేమీ కాలికాలు కావు.

ఒక్క ప్రగతి మాత్రమే కాలికం.

ఎండలు మండిపోతూ వుండినా, వానలు ముంచెత్తేస్తూ వుండినా, చలి గజగజలాడించేస్తూ వుండినా, అది ఆగదు.

నిలవదు కూడాను.

వస్తూనే వుంటుంది.

వెళ్ళిపోతూనూ వుంటుంది.

ఒక్క ప్రమాణంలో జరిగిపోవడమే దానిపని.

నిజాని కిది యెరగనివా రెవరూ లేరు.

ఈ గుర్తు నిలుపుకోగలవారు మాత్రం లేరు, అంతే.

ఆవేళ అలాగే తటస్థించింది.

పార్వతీశమూ రెడ్డీ అలా కూచునేవుండగా సూర్యాస్తమానం అయింది.

వెలుగు పోయింది.

చీకటి పడింది.

అది ఘనీభవించింది.

ఊరు మాటుమణిగింది.

ఇదంతా పార్వతీశం గుర్తిస్తూనే వున్నాడు

ఆ పూట అక్కడే భోజనం చేసిన – వుండిన్నీపోయిన రెడ్డికూడా చూస్తూనే వున్నాడు.

ఇవన్నీ సక్రమంగానే – వరాసగానే జరిగిపోయాయి కాని, తరవాత కాలం నిలిచిపోయిన ట్టనిపించింది.

నిద్రరాదు.

పోనీ అంటే మెళుకువగా వుండి చేసేది కనబడదు.

కోదండరామరెడ్డి వచ్చి బకీరు వెళ్ళిపోయిన సంగతి చెప్పి వెళ్ళిపోయాడు.

దానిమీద యేమి జరుగుతుందో?

అసలు, దాల్లో ఏమి ఆరోపణ లున్నాయో?

అందులో యెవరెవ రిరుక్కున్నారో?

రంగనాయికను కూడా అందులో కీడ్చారో యేమిటో?

కొండారెడ్డి రామచంద్రునితో మాట్టాడివచ్చి రంగనాయిక పుట్టింటివారు మళ్ళీ తొంగిచూడలే దని చెప్పి వెళ్ళిపోయాడు.

దానిక్కారణం క్రోధమో, కళంకభీతో, నిర్మమతో?

భద్రమ్మత్త ఆమె కేమయినా విరుగుడు మాటలు చెబుతోందేమో?

నరసింహదీక్షితులుమామ చీవాట్లు పెడుతున్నాడేమో?

రంగనాయిక అందుకు వగుస్తోందో సంతోషిస్తోందో?

యేమి ఆలోచనలు చేస్తోందో?

జరిగిం దానికి పశ్చాత్తాప పడుతోందో, తెగింపే చేసుకుంటోందో?

పరిస్థితులకు లొంగిపోయి ఆమె తనకి ప్రతికూలంగా మాట్టాడుతుందో, మాటే ఆడదో?

ఇంతవరకూ వచ్చాక, చివరి కామె యేమి చేస్తుందో?

ఏమి చేస్తే యేమి జరుగుతుందో?

ఇలాగ వారి కిద్దరికీ వొకటే ఆందోళన.

దానివల్ల రకరకాల వ్యూహాలు.

వాటిమీద పకడ్బైన యెత్తులు.

వాటివెనకనే బలమైన విఘాతాలు.

ఎటూ నిర్ధారణ కాక "చివరి కేమయినా కానీ" అని తెగింపు.

అవ్యధానంగా "అయితేనూ?" అంటూ మళ్ళీ యథాపూర్వకంగా జిజ్ఞాస.

ఊరు మాటుమణిగాటప్పటికి పార్వతీశమూ బలరామరెడ్డీ యీ స్థితికి వచ్చారు వచ్చి యీ స్థితిలోనే వుండిపోయారు.

అయితే, వారుండిపోతే కాలం వుండిపోతుందా?

నిశీధం అయింది.

చుక్క పొడిచింది.

కోళ్ళు కూశాయి.

పచ్చిరంగులాగ చీకటి వెలిసిపోయింది

తుమ్మెదలు శ్రుతివెయ్యగా కోకిలలు ప్రభాతగీతాలు ఆలాపన చేశాయి. చివరికి, భళ్ళున తెల్లవారేసింది.

ఎఱ్ఱని కిరణాలతో సూర్యుడు పొడుపుకొండమీదికి రాగా, ఎఱ్ఱని టోపీలతో పోలీసులు వూళ్ళోకి వచ్చారు.

## 22

సూపర్నెంటు గ్రామకచేరిలో కొలువుతీరాడు.

వెంకటేశం "చరిత్రాత్మక"మైన వాఙ్మూలం యిచ్చాడు.

తరవాత పెద్దపాలికాపు సాక్ష్యం చెప్పడానికి వచ్చాడు.

టంచన్‌గా నుంచుని, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఠీవిగా అడగ్గా "పార్వతీశం బాబయ్య గారూ మా చిన్న దొరగారూ కలబడ్డం నిరుకేనండి" అంటూ ప్రారంభించాడు వాడు.

"ముందెవరు కలియబడ్డారు?" అని సర్కిలు ప్రశ్న.

"ఇద్దరూ ముందుకురికితేనే కలబడ్డం అవుద్దండి మరి. ముందేటండి ముందు?" అని వాడి ముదలకింపు.

"పోనీ, ముందెవరు కొట్టారూ?"

"ఎవరూ కొట్టలేదండి."

ఇలా అని వాడు తనకేసి వోరచూపులు చూడగా, కొండారెడ్డి, సుతారంగా తల పంకించి, మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

"అయితే, ముందెవరు కుమ్మారూ?"

"ఎవరూ కుమ్మలేదండి."

మున్సబు కరణాలు మొగమొగాలు చూసుకున్నారు.

వాడికేసి భీమన్న శాస్త్రి కరుగ్గా చూడగా, భీమన్న శాస్త్రికేసి సబినస్పెక్టరు చురుగ్గా చూశాడు.

ఈ వ్యవధానంలో చెదిరిపోయిన తన ప్రతిభ కూడదీసుకుని, సర్కిలు "వారిద్దరూ వొకరిజుట్టు వొకరు పట్టుకున్నారంటావు – అంతేనా?" అని బెల్లించాడు.

"వారిలో వొకరికీ జుట్టులేదండి బాబయ్యా!"

"జుట్టంటే క్రాపింగనుకో."

"అలా మనవిచేసుకోండి బాబయ్యా! మా చిన్న దొరగారి క్రాపింగు పార్వతీశం బాబయ్యగారి చేతిలో వుందనుకోండి. పార్వతీశం బాబయ్యగారి మెడకాయ మా చిన్న దొరగారి చేతిలో వుందనుకోండి."

"అది సరే కాని ముందెవ్వరు పట్టుకున్నారంటావ్?"

"నేను చూశాటప్పటికే వారి క్రాపింగు వీరూ వీరి మెడకాయ వారూ పట్టుకుని వున్నారంటాను దేవరా!"

సబ్బా సర్కిలూ మొగమొగాలు చూసుకున్నారు.

అది గుర్తించి "ఏమంటున్నా"డన్నాడు దొర.

"వాడు చాలా అంటున్నాడు కాని; వొక్కటీ మనకి పనికివచ్చేది లేదండి" అని బదులు చెప్పాడు సర్కిలు

దానిమీద "డామిట్!" మనకి కావలసిందా అడుగుతున్నావు? వాడు చూసింది చూసినట్టు చెప్పమను" అని దొర కసరగా, వొక్క క్షణం తమాయించి "నువ్వు చూసింది చూసినట్టు చెప్పరా!" అన్నాడు సర్కిలు.

వెంటనే "మరిగంటే – " అంటూ అందుకున్నాడు వాడు కాని; యింతలో "దొరగారు చిత్తగించాలి" అంటూ వొక ఆడకుయ్యి వినిపించింది.

## 23

అందరూ వులిక్కిపడ్డారు.

చూడగా నమస్కారం చేస్తూ దొర యెదట రంగనాయిక నిలిచివుంది.

దొడ్డి గుమ్మాన హాల్లో ప్రవేశపెట్టి, సింహద్వారందాకా సాగనంపి మాయమైనాడు రామచంద్రుడు.

అక్కణ్ణుంచి వొక్క అంగలో దొరయెదటికి వచ్చి వాలిందామె.

చెదరిపోయిన అందరి చూపులూ వొక్క క్షణానికి కుదుటపడ్డాయి.

అప్పుడు వ్యవహారం విషమించిందని గుర్తువచ్చింది వారికి.

మున్సబు "కథ యెదురుతిరిగిం"దనగా, "చిక్కేనయ్యోయ్" అన్నాడు కరణం.

భీమన్న శాస్త్రి వెంకటేశమూ నిలువునా కొయ్యయిపోయారు.

సూరావధాని తలకాయ తీసుకువెళ్ళి పొట్టలో పెట్టుకున్నాడు.

ఇది గమనించి "పదపద, యిక్కడికెందుకు వచ్చావ్?" అని గదుముతూ వచ్చి సూరన్నా రామస్వామీ లాక్కుపోదామని చూశారు గాని; "దొరగారూ, నన్ను రక్షించండి" అంటూ ఆమె గోలచెయ్యగా, దొర ఇంగితం కనిపెట్టి సబినస్పెక్టరు వారిని వెనక్కి పంపేశాడు.

దానిమీద భీమన్న శాస్త్రి వూరుకోలేక "ఆమె మా చెల్లెలు. ఆమె యిలాగ నలుగురిలోకీ రావడం మాకు మర్యాదకాదు కనక, ఆమెని మా యింటికి తీసుకు వెళ్ళడానికి సెలవిప్పించండి" అని కోరాడు దొరని.

"ఆమె నా యెదటి కెందుకు వచ్చిందీ?"

"దుర్బుద్ధివల్ల."

"ఎంత బలమైన కారణమూ లేకపోతే అయినయింటి పడుచు ఇలా వీధికి వస్తుందీ?"

"ఎవరో దుర్బోధ చేసి వుంటారండి"

"వాళ్ళకి కారణం?"

"మేమంటే కిట్టకపోవడమే."

దీనిమీద "మావాళ్ళంటే కిట్టనివాళ్ళెవళ్ళూ లేరండి మావాళ్ళకే నేనంటే కిట్టదండి" అంది రంగనాయిక

భీమన్న శాస్త్రి మాట్లాడలేకపోయాడు.

అది చూసి "నువ్వు వచ్చిన పనేమిటీ?" అనడిగాడు రంగనాయికని దొర.

దానికి "తమరిప్పుడు విచారణ సాగిస్తున్న దొమ్ములాట నా మూలాన జరిగిందేనండి" అని కొంచెం సంకోచిస్తూ తలవంచుకుని బదులుచెప్పింది రంగనాయిక

ఇది విన్న వారందరూ మెరుపుకొట్టినట్టయిపోయారు.

ముఖ్యంగా దొర "ఓ–హో" అంటూ తలపంకించి "అసలుకథ బయటికి వస్తోం"దన్నాడు.

"చిత్తం" అని వినయంగా నిట్టూర్పు విడిచాడు సర్కిలు.

మున్సబూ కరణమూ కళ్ళు తేలవేసుకున్నారు.

నుంచునివున్న భీమన్నశాస్త్రి మీది ప్రాణాలు మీదికే యెగిరిపోయాయి.

సూరావధాని కుతకుత వుడికిపోయాడు.

"భేష్, రసవంతమైన ఘట్టం" అని మెల్లిగా అంటూ వూగిపోయాడు, నోట నువ్వుగింజ నానని వొక బ్రాహ్మణ యువకుడు.

"పొలంలో పనుంది, నేను వెళ్ళిపోవచ్చునా బాబయ్యా!" అనడిగాడు పాలికాపు.

కొండారెడ్డి మళ్ళీ మీసంమీద చెయ్యివేసుకున్నాడు

# |24|

గు–ప్పు మన్న గుసగుసలు చ–ప్పగా చల్లారాయి.

మున్సబు బకీరూ, వెంకటేశం వాజ్మూలమూ వొక్క పక్కకి తోసేసి "ఆ, యేమిటమ్మాయీ? ఏం జరిగిందీ?" అనడిగాడు రంగనాయికని, దొర.

"పార్వతీశంగారూ, మా వెంకటేశం అన్నయ్యా మా పెద్ద దొడ్లో కొట్టుకున్నమాట నిజమేనండీ" అంది రంగనాయిక.

"కొట్టుకోడాని క్కారణం యేమి వచ్చిందీ?"

"నేనూ పార్వతీశంగారూ మాట్టాడుకుంటున్నాము అది చూసి మా అన్నయ్య సహించలేకపోయాడు."

"పార్వతీశంగా రక్కడికి స్వయంగానే వచ్చారా?"

"లేదండి, నేను పిలిస్తే, సందేహించి సందేహించి, చివరకి నా మాట తీసి వెయ్యలేక వచ్చారు."

ఇది విని "మామ్మో, మా తల్లే, నన్ను తప్పించిందమ్మా మా తల్లి" అంటూ, పనిమనిషి చాలా సంబరపడింది.

"నువ్వెందుకు పిలిచావూ?" అనడిగాడు దొర

"వారి పాదా లాశ్రయించుకుందామని."

"వా రెవరూ నీకూ?"

"కోరుకున్న పెనిమిటి."

ఈ మాట అన్నప్పుడు బలితమైన మనశ్శక్తి ఆమెస్వరానికి గాంభీర్యం కలిగించగా, లలితమైన లజ్జ ఆమె మొగం వంచేసింది

ఇది విని అక్కడివా రందరూ వూగిపోయారు.

భీమన్న శాస్త్రి, కాళ్ళపట్టు తప్పిపోయి కూలబడగా సూరావధాని రెండుచేతులా మొగం కప్పుకున్నాడు.

ఈ వ్యవధానంలో సర్కిల్ చెప్పిన మాటమీద "నువ్వు వితంతువులా కనపడుతున్నావే?" అన్నాడు దొర

దీంతో, కొరడాకొస తగిలినట్టయి రంగనాయికమ్మకి శౌర్యం ముంచుకు వచ్చింది. మొగం ఎఱ్ఱబడింది.

అయినా, వెంటనే సమాళించుకుని, దిటవున్నూ తెచ్చుకుని "నాకింకా పెళ్ళే కాలేదండి" అందామె.

అందరికంటే దొర యెక్కువగా వింతపడ్డాడు.

ఆ వింత అతని కళ్ళల్లో ప్రశ్నార్థకాలు మొలిపించింది.

అది గుర్తించి "ఇది స్పష్టంగా తెలవా లంటే కొంచెం ఓపికట్టాలి" అందామె.

"అనవసరం గొడవలు మనకెందుకూ?" అన్నట్టు చూశాడు సర్కిలు; కాని "ఓపిక పట్టా" నన్నాడు దొర.

దానిమీద ఒక్కక్షణం ఉపక్రమణిక వూహించుకుని రంగనాయిక ప్రారంభించింది:



"కన్యాకాలే యత్నా ద్వరితా"

"పార్వతీశంగారి తల్లి జబ్బుమనిషి. ఆమె ఆ జబ్బులో వుండగానే పార్వతీశంగారికి వొడుగయింది. ఆ వొడుగులో వొకనాడు మా అమ్మతో నేనూ వెళ్ళాను."

"............"

"వారిచుట్టాలలో వొకావిడ 'నువ్వు రోగిష్టిదానవు కదా, పంచశిఖలతో వుండగానే నీ కొడుక్కి పెళ్ళి చేసుకోరాదుటే?' అనడిగిం దామెని. దానిమీద 'అలాచేస్తేనే బాగుండును. లేకపోతే నా చిట్టి తండ్రి పెళ్ళి నా కళ్ళ బడుతుందో పడదో?' అన్నారామె. అని అలాగా యిలాగా చూడ్డంలో పక్కనున్న నేను కనపడగా, నన్ను చేతుల్లోకి తీసుకుని 'మా నాయన్ని పెళ్ళాడతావుటే పిల్లా?' అనడుగుతూ నన్ను గుండెలకి వొత్తుకున్నారు. దాంతో, ఆమె సందిట నేను కరిగిపోయా ననుకున్నాను. అప్పుడే వారితో పీటలమీద కూచోవా లన్నంత వుబలాటం పుట్టింది నాకు."

ఇది విని దొర కుర్చీకిచేరబడి "అది ప్రేమకాదు; కాని చపలచిత్తులు కాని వారికి కాలక్రమాన ప్రేమ అయిపోవచ్చు" నంటూ మళ్ళీ సరిగా కూచుని "తరవాతా?" అనడిగాడు.

"మరో రెండుమూసాల కాజబ్బు ముదిరి మంచాన పడిపోయా రామె. ఇక బతక రన్నమాట పుట్టాక మా అమ్మ ఆమెని చివరిమాటు చూడ్డానికి బయలుదేరింది. నేను కూడా వెళ్ళాను. మంచం మీద కాళ్ళకాడదిక్కున కూచుని అప్పటికి వారు తల్లిగారికి పాదసేవ చేస్తున్నారు. అది చూశాటప్పటికి నాకు 'అతని పక్కన కూచుని నువ్వు కూడా నీ అత్తగారికి కాళ్ళు పట్టరాదుటే పాపం?' అని నన్నెవరో గదిమినట్టనిపించింది దీనికి సాయం, ఆ స్థితిలో కూడా నన్ను చూపించి ఆమె 'పెళ్ళాడతావా నాయనా?' అనడిగారు కొడుకుని ఇద్దరమూ సిగ్గుపడ్డాం, ఆ సిగ్గుతోనే యిద్దరమూ చూసుకున్నాం ఆ చూపుతోనే ఇద్దరమూ 'సంయే అంటే సంయే' అనుకున్నాం. ఏదో సరికొత్త సుఖం అనుభవానికి వచ్చినట్టయింది నాకు."

"అదీ సంగతి" అని బల్లగుద్ది అందుకున్నాడు దొర.

"చాలా చక్కని సన్నివేశం అది నిజంగా అది దైవికమైన సంఘటన, ప్రేమ పరిణామానికి అది ప్రారంభం. అయితే, చెప్పాను కాదూ? స్థిరచిత్తుల విషయంలోనే అది దృఢపడి కొనలుసాగుతుంది."

సర్కిలుతో యిలా చెప్పి, దొర "తరవాతా?" అని మళ్ళీ అడిగా డామెని.

"మరో నాలుగు దినాల కామె చనిపోయా" రంది రంగనాయిక నీరసంగా.

ఇలా అని వొక్కక్షణం ఆమె నీరవురాలయి పోయి గుక్కిళ్ళు మింగింది

అది దొరకి సానుభూతి కలిగించింది.

"ఆ సంవత్సరం చదువు మానేసి వారు ఊళ్ళోనే వుండిపోయారు. వారి గుమ్మంలో నుంచే నేను బడికి వెళ్ళేదాన్ని. ఒకనాడు అరుగుమీద కూచుని వుండి వారు నన్ను పిలిచారు; కాని నేను అలా చూదామనుకుంటూనే చూడలేక పోయాను. మాట్లాడదా మనుకుంటూనే మాట్లాడలేకపోయాను నుంచోనైనా నుంచుందా మనుకుంటూనే నుంచోలేకపోయాను."

"మర్నాడు మళ్ళీ పిలిచారు. 'నుంచోవూ రంగా' అని మళ్ళీ పిలిచాటప్పటికి నేను కదల్లేకపోయాను. నన్నంత ముద్దుగా అంతవరకూ యెవరూ పిలవలేదు. వారయినా అదే మొదటిమాటు. ఆ పిలుపు నా గుండెల్లో నిండిపోయింది. నా కాళ్ళకి బందా లయిపోయింది. వెంటనే వీధిలోనే దగ్గిరికి వచ్చి, బుజ్జగించి, గడ్డం పట్టుకుని నా మొగం పైకెత్తి కళ్ళల్లోకి గంభీరంగా చూసి చిరునవ్వు నవ్వారు. దాంతో నిలువునా కరిగిపోయాను నేను. తరవాత, యించక్కని బొమ్మల పుస్తకం చేతిలోపెట్టి వెన్నుతట్టి పంపేశారు."

ఇది విని కనుబొమ లెగరవేసుకుంటూ "చాలా మంచి పిల్లవాడు. యువరాజు కాదగ్గ పిల్లవాడు" అన్నాడు దొర వుద్రిక్తుడై.

దాంతో రంగనాయిక చెక్కిళ్ళు గరిపొడిచాయి.

చాలామంది కళ్ళు చెమ్మగిల్లాయి.

అపవారించి, సూరావధాని నెత్తినోరూ బాదుకున్నాడు.

## 25

పూర్తిగా వొక్క నిమిషం మాట్లాడలేకపోయింది రంగనాయిక.

ఎదటి గోడమీద అభావదృష్టులు పరుపుతూ వుండిపోయిందామె.

కళ్ళనిండా నీళ్ళు కమ్మి ఆ అభావదృష్టులు కూడా మందగించిపోయాయి.

అది చూసి దొర చకితు డయినాడు.

చివరికి తనకి తానే ప్రకృతిలోపడి, కంఠం సవరించుకుని, మళ్ళీ మెల్లిగా ప్రారంభించిం దామె:

"తరవాత వారు నన్ను పలకరించని దినంలేదు. నేను బడికి వెళ్ళేటప్పుడో, యింటికి వెళ్ళేటప్పుడో – యెప్పుడో వొకప్పుడు, కనిపెట్టుకుని వుండి నన్ను పలకరించేవారు. కనపడనినాడూ, పలకరించనినాడూ నేనూ బడిలో బొమ్మలా వుండిపోయేదాన్ని. ఇంటికి వెడితే భోజనం సయించేది కాదు."

ఇది విని సర్కీలు గతుక్కుమన్నాడు.

తన పదకొండేళ్ళ కూతురు కూడా యిలాగే యే పిల్లాణ్ణయినా చూసుకుని చెడిపోతోందేమో అని కంగారుపడి పోయా డతను.

ఆమె మళ్ళీ అందుకుంది:

"వారు నాకు చక్కని కలా లెన్నో యిచ్చారు ఎన్నో బొమ్మలపుస్తకాలిచ్చారు. ఎన్నిమాట్లో బత్తాయిపళ్ళు వొలిచిపెట్టారు. ఎన్నిమాట్లో గులాబీపువ్వులు నా జెడలో వుంచారు. చివరికి ఇస్కూళ్ళు తెరిచాక చదువుకోసం రాజమంద్రీ వెళ్ళిపోతూ వొకనాడు నన్ను తమవాకిట్లోకి పిలిచి 'మళ్ళీ వచ్చాటప్పుడు నీ కేమి తెచ్చిపెట్ట'మంటా వని లాలిస్తూ అడిగారు. 'లక్ష్మీదేవి విగ్రహం చిన్నదీ వెండిదీ తెచ్చిపెట్ట' మన్నాను. జ్ఞాపకం వుంచుకుని వారది తెచ్చియిచ్చారు ఇప్పటికీ నా పెట్టెలో వుందది"

"రాజమండ్రీలో చదివినంతకాలమూ వారు వారం వారమూ యింటికి వచ్చేవారు. నన్ను చూడకుండా వుండలేకే వారు వచ్చేశారు. వారు వచ్చేదాకా నేనూ వుండలేకపోయేదాన్ని. నా కేమిటేమిటో తెచ్చిపెట్టేవారు వారు. వారి పాదాలు కొలుచుకోడం తప్ప నేనేం చెయ్యగలనూ వారికి? ఇంతకీ, ఆ శనివారమూ ఆదివారమూ నేను వెన్నెట్లో తేలిపోయేదాన్ని. తక్కిన దినాల్లో అంధకారంలో మగ్గిపోయేదాన్ని."

"..................."

"బి.ఏ.చదువుకి వారు చెన్నపట్నం వెళ్ళవలసి వచ్చింది. తండ్రిమాట జవదాటలేక తప్పనిసరిగా వారు ప్రయాణం కట్టుకున్నారు. ఇది తెలిసి నేను బెంగటిల్లి పోయాను. వారందినాలు నేను నిద్రాహారా లెరగను; కాని, చివరికి, వారు చెన్నపట్నం బి.ఏ. అయితేనే నాకు గొప్ప అనుకుని మనస్సు కుదుటపరుచుకున్నాను. మధ్యాహ్నం బయలుదేరి వారు వెడుతా రనగా నేను పొద్దున్న వారి ఇంటికి వెళ్ళాను. వీధిగుమ్మాన వెడితే యెవరయినా చూసి పోతారేమో అని దొడ్డిగుమ్మాన వెళ్ళాను. అప్పటికి వారు గదిలో పెట్టె సద్దుకుంటున్నారు. ఎదట పడాటప్పటి కిద్దరమూ పొంగిపోయాం. నేను మల్లెపువ్వుల దండగుచ్చి జాకెట్టులో దాచి పట్టుకువెళ్ళాను. నన్ను చూస్తూనే వారు దగ్గిరికి రావడమూ, వారిని చూస్తూనే నేను మల్లెదండ వెయ్యడమూ జరిగిపోయాయి."

దొర సర్కిలుకేసి చూశాడు.

"అప్పటికి నీ వయస్సెంత?" అనడిగాడు సర్కిలు.

"పన్నెండో యేడు వెళ్ళింది" అంది రంగనాయిక.

"పూలదండ బాగా గుచ్చగలిగానో లేదో అని నేను బెదురుతూ పట్టుకువెళ్ళాను; కాని, వారి మెడలో అది మెరిసినట్టు కనపడింది. ఎక్కడలేని పరిమళమూ వచ్చినట్టున్నూ అయింది దానికి. నేను దండవేసినందు కెంతో సంబరపడి వారు అది తీసి నా మెడలో వేసి 'యిప్పుడు మరీ బాగుంది' అన్నారు. 'మీకోసం గుచ్చితెచ్చా' నని నేనూ 'పూల దండలు ఆడవాళ్ళకే బాగుంటా'యని వారూ కొంతసేపు పెనగులాడుకోడం అయినాక, నేను మళ్ళీ వారికే వేశానది."

ఇది విని మున్సబు చెవిలో నోరుపెట్టి "ఆముక్తమాల్యద" అని గొణిగాడు కరణం; కాని అదేమిటో బోధపడక ఒక్కక్షణం వింతచూపులు చూసి, చివరికి బాధ్యత అంతా తనమీదే వున్నట్టు కేసు వినసాగాడు మున్సబు.

"కొంతసేపటికి తండ్రిగారు వారిని బోజనానికి పిలిచారు. వెంటనే ఆ దండ తీసి జేబురుమాలులో చుట్టి పెట్టెలో పెట్టుకుని 'రంగా, ఇది నాకూడా పట్టుకువెడతాను. వీలయినప్పుడల్లా చూసి నిన్ను చూసినట్టే వూహించుకుని ఆనందిస్తాను. ఎప్పుడూ నామీద యీ దయ వుంచేం. నన్ను మరిచిపోకేం?' అంటూ నా కళ్ళలోకి గంభీరంగా చూశారు వారు. అందుకు నేను బదులు చెప్పలేక పోయాను. నా చైతన్యం అంతా ఆ దండలో యిమిడ్చేసినట్టయిపోయింది నాకు. పైపెచ్చు ఎందుకో ఏడ్పువచ్చింది నాకు. నన్నుచూసి వారూ అలాగే అయిపోయారు."

దొర నిశ్చలంగా చూశాడు.

రంగనాయిక కళ్ళల్లో అప్పుడు కూడా ఆ పరిస్థితి ప్రతిఫలిస్తున్నట్టు కనపడిం దతనికి.

ఆ చిహ్నం కంఠంలోకి మార్చుకుని మళ్ళీ అందుకుందామె:

"నా కళ్ళు చెమ్మగిల్లడం చూసీ చూడగానే, యెప్పుడూ లేంది గభీమని నన్ను పొదువుకున్నారు వారు. నేను నా మొగం వారి మెడలో దాచుకుని కొంతసేపటికి మనస్సు దిటవుపరుచుకున్నాను. తరవాత, నన్ను పొదివి పట్టుకునే గుమ్మందాకా సాగనంపి, నేను సందులో నడిచినంతసేపూ నాకేసే చూశారు వారు."

ఇది వినీ చూసీ కరణం తనకేసి జాలిగా చూడగా, గోడవైపు మొగం తిప్పుకుని, సూరావధాని కళ్ళల్లో నీళ్ళు పెట్టుకున్నాడు

"అది ప్రేమ. ఈమె ప్రేమస్వరూపం. దేవునిదృష్టిలో అప్పుడే ఈమే ఆ యువకుడూ భార్యాభర్తలయి పోయారు" అంటూ దొర ఆవేశంతో అనగా, సర్కిలు "ఇప్పటికీ యీ అమ్మాయి నిజంగా కన్యే ఈమెకి తల్లిదండ్రులు చేశా మనుకుంటున్నది పెళ్ళికాదు, శిక్ష" అని భీమన్న శాస్త్రికేసి పులుకూ పులుకూ చూశాడు.

ఇదంతా చూసి పుట్టింటివారు తప్ప తక్కిన అందరూ రంగనాయిక యెడల వాత్సల్యముగ్ధు లయిపోయారు.

దొరకిన్నీ వాత్సల్యభావం కలిగింది.

అది హృదయం నిండిపోగా అతను "ప్రియమైన అమ్మాయీ, తరవాత యేమి జరిగిందమ్మా?" అని సాదరంగా అడిగాడు

అది రంగనాయికమ్మకి దిటవు కలిగించింది.

దీంతో "వారిమీద కేసు నిలవ"దని నమ్మకమున్నూ కలిగిం దామెకి.

ఈ ధీమాతో ఆమె మళ్ళీ ప్రారంభించింది·

"యుక్తసమయంలో మావాళ్ళు నన్ను పార్వతీశంగారికే నిశ్చయపరిచారు అందుకు నేను వెయ్యిమంది దేవుళ్ళకు మొక్కుకున్నాను కాని; హఠాత్తుగా వారి తండ్రి కాలం చేశారు. దాంతో ముహూర్తం దాటిపోయింది తరవాత, యేమి దుర్బుద్ధి పుట్టిందో, మావాళ్ళు వారిని కాదని మరో కోతికి నన్ను కట్టబెట్టారు"

"దయ్యాలు" అంటూ సీదరించుకుని "అమ్మాయీ, అందుకు నువ్విష్టపడ్డావా?" అని ఆత్రంగా అడిగాడు దొర.

"లేదండి. నాకా సంబంధం వద్దనీ, పార్వతీశంగారే కావాలనీ కచ్చితంగా చెప్పేశానండి, బతిమాలానండి. మంకుపట్టు పట్టి యేడ్చి, చివరికి భోజనం కూడా మానేశానండి. అయినా, మావాళ్ళు కాళ్ళూ చేతులూ విరిచికట్టి—"

ఆమె యిలా అనేటప్పటికి దొర అగ్గయిపోయాడు.

అతని చూపులు సర్కిలుమీద ఆగ్నేయాస్త్రాలు విజ్జిమ్మాయి.

అవి భరించలేక సర్కిలు మొగం వంచుకున్నాడు

అప్పటికి తన వుద్యోగధర్మం జ్ఞాపకం వచ్చింది దొరకి.

"తరవాత యేం జరిగిందమ్మాయీ?" అని వెంటనే అడిగాడతను.

దానిమీద "నా వుసురు తగిలి సంవత్సరం తిరక్కుండానే ఆ పిల్లాడు గుటుక్కుమనేశాడండి" అనేసింది రంగనాయిక
దొర తల పంకించాడు.
మున్సబూ కరణమూ గతుక్కుమన్నారు.
సర్కిలు గంభీరంగా చూడగా భీమన్నశాస్త్రి మొగం వంచుకున్నాడు.
సూరావధాని కళ్ళు తుడుచుకున్నాడు.
మొట్టమొదటిమాటు వెంకటేశానికి ఆ పిల్లాడిమీద అసహ్యాభావం కలిగింది.

## 26

ఇది యిలాజరుగుతూనే వుండగా వీధిలో సీత్కారాలూ, ఛీత్కారాలూ రేగాయి. వెన్ను విరుచుకుంటూ వొక కానిస్టేబులూ, మడమ తాటించుకుంటూ సబినస్పెక్టరూ ఆ సద్దణిచాటప్పటికి మళ్ళీ రంగనాయిక అందుకుంది:

"శని విరగడ అయిపోయినందుకు నేను బ్రహ్మానందపడ్డాను; కాని 'ముందుగతి యేమిటీ?' అన్న విచారం పట్టుకుంది నాకు. నా హృదయం పార్వతీశంగారిని విడిచిపెట్టలేకపోయింది. ఎవరో వీరేశలింగం పంతులుగారి పేరు—"

రంగనాయిక యిలా అనేటప్పటికి, పంతులు యెడల తనకి వుండుకున్న గౌరవాదరాలవల్ల, దొర, అప్రయత్నంగా శిరస్సు వంచుకున్నాడు.

"—చెప్పారు. నాకు ఆవేశం వచ్చింది. దాంతో మళ్ళీ కోరిక రేకెత్తింది. ఆశ పరుగులు తీసింది. దానిమీద ఎన్నో పరిశోధనలు చేశాను. ఎన్నో అడ్డంకులు దాటాను. నా తపనా, నా ఆశా వారిలో మార్పు కలిగించినట్టు తెలిసింది. చివరికి వారి హృదయంలో వొకపక్క చిన్నస్థలం—"

"ఇప్పటి కింకా వారికి వివాహం కాలేదూ?" అనడిగాడు, దొర ఆత్రంగా.

"అయింది. ఆ దంపతులు చిలకాగోరింకల్లాగ ఆనంద డోలికల్లో వూగిపోతూనే వున్నారు. అయితే వారికిద్దరికీ నామీద అనుగ్రహం కలిగింది. అంచేతనే వారి హృదయంలో వొకపక్క చిన్నస్థలం నాకు దొరికిందన్నాను" అని బదులు చెప్పింది రంగనాయిక.

దొర చకితుడై సర్కిలుకేసి చూశాడు.

సర్కిలు రంగనాయిక మీద సంశయదృక్కులు పరిపాడు.

సూరావధాని మొగాన ఔదాసీన్యమూ, భీమన్నశాస్త్రి మొగాన రోషం మంటలూ చూసి కరణం వింతపడ్డాడు.

చూసిచూసి, కంఠం సవరించుకుని, రంగనాయిక మళ్ళీ అందుకుంది:

"దీంతో మా పుట్టింట ముళ్ళమీద వున్నట్టనిపించింది నాకు. నా యింటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను."

ఇలా విని ఒక్కక్షణం ఆగి—"తెలిసిందా?" అన్నట్టు గంభీరంగా చూసి "నా యింటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను" అని మళ్ళీ రెట్టించి, రంగనాయిక మళ్ళీ అందుకుంది:

"నిన్న సాయంత్రం వారు పొలం వెళ్ళి వస్తున్నారు. ఒక్కరే వున్నారు. ఈ సంగతి విన్నవించుకుందామని నేను మావాళ్ళ పెద్దదోడ్లోకి పిలిచాను. మొదట సంశయించారు గాని; చివరికి దయచేశారు వారు."

"వారివెంట మరెవరున్నారూ?" అనడిగాడు దొర.

"దేవుడు!" అని అవ్యవధానంగా చెప్పేసి గంభీరంగా చూసింది రంగనాయిక.

సర్కిలుకేసి చూశాడు దొర.

ఏదో అడగడానికి సర్కిలు రంగనాయిక కేసి చూశాడు.

అది గుర్తించి "వెంట మరెవరయినా వుంటే నే నెందుకు పిలుస్తానూ వారినీ?" అని నిలవతీసినట్టడిగింది రంగనాయిక.

బకీరుచూసి "బలరామరెడ్డి, వోబిరెడ్డి, నరసింహారెడ్డి కోదండరామరెడ్డి–" అంటూ చదివి "ఈ నలుగురూ పార్వతీశంగారి వెంట లోపలికి రాలేదూ?" అని మళ్ళీ అడిగాడు దొర.

"రాలేదు" అని దృఢంగా అని, పులుకూ పులుకూ చూస్తూ, "బకీరులో నా గొడవ యేమయినా వుందా?" అనడిగింది రంగనాయిక.

"లే"దన్నాడు దొర.

"ఇంకేం? ఉన్నది తీసేశారు. లేనిది కలిపారు. ఇదెవరు చేశారో నేను చెప్పలేను. తమరు విచారణ చేయించండి" అంది రంగనాయిక.

"బాగా జ్ఞాపకం చేసుకో" అన్నాడు సర్కిలు.

"పన్నెండు గంటలకిందట నా కళ్ళ యెదటే జరిగింది జరిగినట్టు చెప్పడానికీ జ్ఞాపకం చేసుకోవాలా?" అని యెదురడిగిందామె.

చిత్తయిపోయి, దొరకేసి తెల్లమొగం పెట్టి మళ్ళీ అంతలో–

"పోనీ, మీ పెద్ద పాలికాపు ఉన్నాడు కాదూ?" అనడిగాడు సర్కిలు.

అలవోకగా చూస్తూ "ఉన్నాడు" అని సర్కిలుకీ, గంభీరంగాచూస్తూ "రాజమండ్రీలో" అని దొరకీ బదులుచెప్పింది రంగనాయిక.

సర్కిలు గతుక్కుమన్నాడు.

మొగం వంచుకుని పాలికాపు నవ్వుకున్నాడు.

కరణంకేసి బెదురుగా చూశాడు మున్సబు.

భీమన్నశాస్త్రికేసి చూస్తూ "మా కంఠం మీదికి తెచ్చారండోయ్" అన్నట్టు తల పంకించుకున్నాడు కరణం.

అప్పటికొక విధంగా నిర్ధారణ చేసుకుని "తరవాతా?" అన్నాడు దొర.

"వారు దయచేశారు. నేను నా సంగతి మనవి చేసుకున్నాను. వారు కల్లోలం పుట్టవచ్చునన్నారు. నాకు భయం లేదన్నాను నేను. ఇంకా అంటున్నాను. ఇంతలో యెలా చూశాడో రంకెలువేసుకుంటూ వచ్చి మా వెంకటేశం అన్నయ్య వారి మీద పడ్డాడు."

ఇది విని, వెంకటేశం, మీది పెదవి తడుముకున్నాడు.

అతనిజట్టువాళ్ళు "సెబాస్" అనుకున్నారు.

చూసిచూసి "మీ అన్నయ్యకి సాయం యెవరూ?" అనడిగాడు సర్కిలు.

"కాళ్ళూ చేతులూనూ" అని సర్కీలుకి ఝుడితి ప్రత్యుత్తరం యిచ్చేసి, గంభీరంగా కూడా చూసి, మళ్ళీ ప్రారంభించింది రంగనాయిక:

"ఇద్దరూ కలియబడ్డారు. సమానంగా కొట్టుకున్నారు. మూడోవాళ్ళెవళ్ళూ కలగచేసుకునేవాళ్ళు లేక అయాసం వచ్చాదాకా పెనగులాడుకున్నారు. మధ్యని, వారి నేమీ చెయ్యలేక మా అన్నయ్య నామీద పడ్డాడు–"

సభలో ఛీత్కారాలు రేగాయి.

"రెండు తాపులు తన్ని వారు మా అన్నయ్య నీడ్చేశారు నిమిషంలో."

అక్కడ వున్నవారిలో చాలామంది గొల్లు మన్నారు. కొందరు మాత్రం కీచుమన్నారు.

"మళ్లీ కలియబడ్డారు. మళ్ళీ కొట్టుకున్నారు. వొళ్ళు మరిచిపోయి కొట్టుకున్నారు. చివరికి మా అన్నయ్య ముందుగా ఇంటిదారి పట్టాడు."

మళ్ళీ పకపకలు రేగాయి.

వెంకటేశం మొగం వంచుకోకపూర్వమే కొండారెడ్డి మళ్ళీ మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

## 27

సూరావధాని జగన్మిథ్యాత్మ మననం చేసుకున్నాడు

భీమన్నశాస్త్రి తన లౌక్యప్రజ్ఞ స్మరించుకున్నాడు.

వెంటనే "మా చెల్లెలు అమాయికురాలు" అంటూ దొరయెదటికి వెళ్ళి, "దాని కెవరో దుర్బోధ చేశారండీ" అంటూ మళ్ళీ ప్రారంభించాడు.

"ఆమె చెప్పిన సంగతులు అబద్ధం అంటారా మీరు?" అనడిగాడు దొర.

"కొన్ని నిజమే."

"అబద్ధాలేమిటి?"

"చిత్తం చిత్తం, నామనవి–" అంటూ చేతులు పిసుక్కున్నాడు శాస్త్రి.

"మీరు చెప్పాకునే దేమిటి?"

"మా చెల్లాయిని మా యింటికి తీసుకువెళ్ళి మాట్లాడడానికి సెలవిప్పించండి."

రంగనాయిక గుండెలు పీచుపీచు మన్నాయి కాని; దొర కనుబొమలు ముడిపడ్డం చూసి ఆమె తేరుకుంది.

అదీ, దొర యింగితమూ గుర్తించి "మీ అన్నయ్య కేంచెబుతావమ్మాయీ?" అనడిగాడు సర్కీలు.

"నేను వెళ్ళనండి" అంది రంగనాయిక

"బాగా ఆలోచించుకో" అని రెట్టించాడు సర్కీలు

"అంతా యింతా కాదు, చాలాచాలా ఆలోచించుకునే చెబుతున్నానండి. ఈ జన్మలో నేనిక నా పుట్టింటిగడప దాటను."

శాస్త్రి మొగాన "దాటనిస్తేనా?" అన్న భావం ప్రతిఫలించింది; కాని సూరావధాని రక్కుమనిపోయాడు.

"తల్లినీ తండ్రినీ వొదులుకుంటావా?"

"వాళ్ళే నన్ను వొదులుకున్నారండి."

నిట్టూర్చి, బుర్రవంచుకుని భీమన్నశాస్త్రి చిన్న అరుగుమీదికి వెళ్ళిపోయాడు

ఒక్క క్షణం యెవరూ మాట్లాడలేదు.

ఆ క్షణాన చీమకూడా చిటుక్కుమనలేదు.

ఆగాంభీర్యం వొక్కమాటు దొర భావచక్రాన్ని తిప్పేసింది.

ఆ చక్రభ్రమణంలో యేమిటేమిటో పటాలు మెరిసిపోయాయి.

ఆ మెరుపులో, తన దేశానికీ యీ దేశానికీ యెంత దూరం వుందో, తన సంఘానికీ యీ సంఘానికీ యెంత వార వుందో స్పష్టంగా గోచరించిం దతనికి.

మరి తనకీ యీ వ్యవహారానికీనో?

దూరం లేకపోవడమే కాదు, సంబంధమే వుంది.

సర్వమూ తన అధీనంలోనే వుం దిప్పుడు.

ఈ సంగతి స్ఫురించాటప్పటికి, క్షణికమై సార్వజనీనత తిరోహితమయిపోయి, అతనికి అధికారదర్పం సాక్షాత్కరించింది.

అది మొగాన ప్రతిఫలించింది.

అది గుర్తించి, వెంటనే మరింత టంచన్‌గా నుంచుని, తన సావధానత దొర దివ్యచిత్తానికి నివేదించుకున్నాడు సర్కిలు.

అప్పుడు "ఇటు హృదయం వూపేసే సత్యమూ, అటు గుండెలులేని కల్పనానూ" అని తీక్ష్ణంగా చూశాడు దొర.

ఆ చూపు చిన్న అరుగుమీద చిచ్చుబుడ్డి అయింది.

దీనికి సాయం కరణం వీపుగిల్లగా కొంచెం వొణుకుతూ లేచి, వంగి ముందుగా మున్సబు చేతులు దోయిలించుకున్నాడు.

అది చూసి, వ్యవహారం మరో అంతస్థుకి వెళ్ళిపోతూవుందని గ్రహించి, "మరి నాకు సెలవు దయచేయించండి" అంది రంగనాయిక.

"అవును, ఈమె యింకెందుకూ?" అన్నట్టు చూశాడు సర్కిలు. దాని మీద తలపంకించి "నీ సంగతి యేమి టమ్మాయీ?" అనడిగాడు దొర.

"నాకు సెలవిప్పించండి."

"వెళ్ళవచ్చు."

"నేను నా యింటికి వెళ్ళిపోతున్నాను."

చూసి చూసి "నీ యింటికా?" అనడిగాడు దొర.

"అవును, నా యింటికే. పార్వతీశంగారి యిల్లే నా యిల్లు!"

ఈ మాట ధీమాగానే చెప్పింది కాని; చెప్పిన తరవాత ఒక్క తృటికాలం ఆమె చెక్కిళ్ళమీదా కళ్ళలోనూ కొత్త సిగ్గు మెరిసింది.

"అది నీ యిష్టం" అన్నాడు దొర.

"మీరు చూస్తూనే వున్నారు. నేను మావాళ్ళ యింట్లో నుంచి విడిచేతులతో యివతలికి వచ్చాను."

ఇలా చెబుతూ ఆమె తన రెండు చేతులూ తిప్పితిప్పి చూపించింది.

"చూశాను."

"గొడవలన్నీ మీరు చిత్తగించే వున్నారు. నేను మీ రక్షణ కోరుతున్నాను."

"నీ కేమీ భయంలేదు. ఘనత వహించిన శ్రీ చక్రవర్తి గారి పరివారం యావత్తూ సర్వకాల సర్వావస్థల్లోనూ నీకు పెట్టనికోట అయివుంటుంది, భయపడకు!"

ఇలాచెప్పి, దొర, ఆమె ప్రార్థన నోటు చేసుకున్నాడు.

"ఎప్పు డెలాంటి బకీర్లు వస్తాయో? రాయవరం గ్రామం మీరొక కంటితో కనిపెడుతూ వుండాలి."

"అవశ్యమూనూ!"

ఇలా అంటూ గంభీరంగా లేచి నుంచుని, "ఈమె మేజరు. స్వతంత్రురాలు. ఎక్కడికి వెళ్ళడాని కయినా, తన జీవన విధానం యెలా నిశ్చయించుకోడాని కయినా యీామెకి హక్కుంది. తన భారం అంతా దేవునిమీదవేసి యీామె వొట్టిచేతులతో బయలుదేరడం కూడా రికార్డయింది. కనక, యీామె కెవరయినా అడ్డువెళ్ళారంటే సంకెళ్ళు పడతాయి. ఇప్పుడే కాదెప్పు డయినా సరే, యీామె స్వేచ్ఛ కెవరయినాసరే అభ్యంతరం కలిగించారంటే కఠినవరకం పడుతుంది" అంటూ వురిమినట్టు చెప్పాడు దొర.

పట్టలేక సూరావధాని బారుమన్నాడు.

అన్ని విధాలా వుచ్చులు బిగవడం చూసి భీమన్నశాస్త్రి మొగం వంచుకుని చలికిలపడ్డాడు.

"మీరూ మీరూ బాగానే వున్నారు. చివరికి మాకూ వురి. మంచిపని చేశారులెండి" అని తొడమీద పొడిచి, మున్సబు, భీమన్నశాస్త్రిని నిష్ఠురాలాడాడు.

బరాబరులు చేస్తున్నట్టిద్దరు కానిస్టేబిల్సు జనాన్ని తప్పించి దారిచేశారు.

వెంటనే అంజలిబంధం నుదుట అన్చుకుని దొరకేసి తిరిగి నమ్రురాలై, భూమి కవతరిస్తున్న దేవకన్యలాగ మెల్లిగా అరుగు దిగింది రంగనాయిక.

*(1931 జులై భారతినుంచి – పెంపకం)*

★ ★ ★

# శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి

❋ జననం : 23-4-1891 ❋ మరణం : 25-2 1961

ఫ్యూడల్ సంస్కృతి నుంచి వచ్చినా శాస్త్రిగారు ఆ సంస్కృతి పాత్రల చేత ఫ్యూడల్ సంస్కృతి భాషను మాట్లాడించినట్లు మరెవరూ మాట్లాడించ లేరన్నది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల గురించి కొడవటిగంటి కుటుంబరావుగారి అభిప్రాయము. శ్రీపాదవారి కథలు విని ఉండకపోతే తెలుగుల ఉనికి అయోమయం చదువరులకే చదువు చెప్పగలిగినది ఆయన రచన. తీయందనపు తీయందనము చదువులిచ్చినదాయన శైలి. ఆయన రచనలు మరో భాషకు లొంగవు. తెలుగు వారైన వారికే శ్రీశాస్త్రిగారి కథలు చదివి ఆనందించే అదృష్టము - అన్నది మల్లాది రామకృష్ణశాస్త్రిగారి అంచనా. అచ్చమయిన వ్యావహారికాంధ్రం వ్రాసిన వారిలో ప్రథమగణ్యులు శ్రీపాద వారు - అన్నది పిలకా గణపతిశాస్త్రి బేరీజు. దీన్నే తనదైన శైలిలో "సర్వదా తమరీనాటియాంధ్ర వ్యావహారిక భాషానిర్మాతృగణ ప్రథమగణనీయులు" అని అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సుమారు 75 కథలు రాశారు. తమ కథలను వారు చిన్న కథలని పిలిచినా అవన్నీ ఓ రకంగా నవలికలనే అనచ్చు, వస్తువురీత్యా ప్రణయం, సంఘ సంస్కారం, ప్రబోధం, కుటుంబ జీవితం, అపరాధ పరిశోధనం, భాషా వివాదాత్మకం, అవహేళనాత్మకం, చారిత్రకం-అంటూ స్థూలంగా విభజించుకోవచ్చు.

శ్రీపాదవారు ఇవేకాక పద్య రచనలు, నాటకాలు, నాటికలు - రేడియో నాటికలు, నవలలు, అనేక వచన రచనలు, అనువాదాలు, వైద్యగ్రంథాలు సహితం రాశారు.

'ప్రబుద్ధాంధ్ర' పత్రికను చాలాకాలం నిర్వహించారు. వ్యావహారిక భాషావాదిగా గిడుగు ఉద్యమానికి అండదండలందించారు.

గాంధీ - ఖద్దరు - హిందీ ఈ మూటినీ వ్యతిరేకించిన వ్యక్తి. శాస్త్రి వాచస్పతి, తార్కికుడు, వసంతుడు, కుమారకవిసింహుడు, భటాచార్యుడు, కౌశికుడు, - అన్న మారుపేర్లతో శతాధిక వ్యాసాలు రాశారు.

1891 లో తూర్పు గోదావరి జిలా రామచంద్రపురం తాలూకా పొలమూరులో జన్మించారు వేదం, జ్యోతిషం, ధర్మశాస్త్రాలను అభ్యసించారు. పిఠాపురం సంస్థాన కవులు శ్రీ వేంకట రామకృష్ణ కవుల శిష్యులు. పలు అష్టావధానాలు చేశారు. వల్లూరు, వేటపాలెం గ్రామాలలో అధ్యయనం చేశారు. తెలుగు కథకులలో కనకాభిషేక గౌరవం లభించిన మొదటివారు వీరు. (1956)

ఇవే మా తెలుగు కథలంటూ తెలుగువాళ్ళు గర్వించతగ్గ కథలనందించిన మనాపారీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. 1961 లో రాజమండ్రిలో చనిపోయారు.

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd.